# చతుర

అగస్ట్ 1983

సంపుటి : 6 సంచిక : 7

## ఈనెల సమగ్ర నవల

నేరం అంటే ఏమిటో తెలియని పసి వయసులోనే తల్లిని ఆదుకో బోయి హంతకురాలిగా ముద్రపడి జైలుకు వెళ్ళిందా పాప. అసలే అందాలరాశి. దానికి తోడు సద్గుణాల మూటగా ప్రశంసల్ని అందుకుంది అక్కడ. బోర్‌స్టల్ స్కూల్లో శిక్షాకాలం పూర్తయే సరికి విద్యావంతురాలూ అయింది. బాహ్య ప్రపంచం వేసిన ముద్ర.....

## పవిత్ర పాపి

ని తొలగించుకోవటం కోసం చెల్లి, అమ్మమ్మలతోపాటు గుంభనగా బతుకుతూ ఉన్నత విద్య నభ్యసించసాగిందామె. కాకుల్లా పొడిచే లోకుల ధాటికి తట్టుకుంటూ జీవితంలో అండగా నిలబడగల యువకుడినీ వెదుక్కోగలిగింది. అయినా అనుకో కుండానే మరోసారి 'హంతకి'గా ముద్రవేయించుకోవలసిన పరిస్థితి ఎలా ఎదురయింది ?

## కొండముది శ్రీరామచంద్రమూర్తి

నేటి సమాజంలో చెలామణీ అవుతున్న అసమత్వాల్నీ, ఆటవిక న్యాయాన్నీ, అందుకు బలయిపోతున్న జీవితాల్నీ చిత్రిస్తూ రచించిన 'పవిత్ర పాపి' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : సత్యమూర్తి

రెండవ కవరు : ఎల్.ఆర్. గ్రోవర్

బాబ్జీ

మూడవ కవరు : సూరజ్ ఎన్. శర్మ

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# సైకిల్ వీరుడు

ఓ మైలు దూరం సైకిల్ తొక్కేసరికే కాళ్లు పట్టుకుపోయి వేలాడబడిపోతాం మనం. అలాంటిది ప్రపంచాన్ని సైకిల్ మీద చుట్టిరావడమంటే మాటలా? అదీ రోజుకి సుమారు వందమైళ్ళ చొప్పున 138 రోజుల్లో ప్రపంచ యాత్ర పూర్తి చేయడమన్న విషయం వింటేనే నీరసం వస్తుంది మనకు.

ఇరవైనాలుగేళ్ళ నికొలస్ సండర్స్‌కి మాత్రం సైకిల్ పేరు వింటేనే హుషారు పుట్టుకొస్తుంది. సైకిల్ మీద 'అత్యంత వేగంగా ప్రపంచయాత్ర చేసిన వ్యక్తి'గా పేరొందాడు. చిన్నతనం నుంచి ఇతనికి సైకిల్ అంటే ప్రాణం. సైకిల్ మీద ప్రయాణం చేసే అవకాశం చిక్కితే వదిలేవాడుకాదట. చిన్నతనం నుంచి వున్న సైకిల్ పిచ్చి దినదిన ప్రవర్ధమానమై ప్రపంచయాత్ర చేయడం వరకూ వచ్చింది.

ఇంగ్లండ్‌కు చెందిన నికొలస్ 1976-1979 మధ్యకాలంలో జరిగిన అన్ని రకాల ప్రముఖ ఫ్రెంచ్ సైకిల్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో పాల్గొన్నాడు. బ్రిటిష్



సైకిల్ ఛాంపియన్ ఇతను. ఒలింపిక్ పోటీల్లో అమెచ్యూర్ సైకిలిస్ట్‌గా మాత్రమే పాల్గొనేవాడు. పోటీలపర్వం ఎంతకాలం నడుస్తుంది, స్వయం సంపాదనా శక్తి సంపాదించుకోవాలిగాని అని అన్పించింది అతనికి. కేవలం పతకాలు కడుపు నింపవని గ్రహించాడు.

ఇంగ్లండ్‌లో మనదేశంలోలాగా క్రీడా ప్రావీణ్యం చూసి ఉద్యోగాలివ్వరు. అందుకని వేరే మార్గాలు వెతుక్కోక తప్పలేదు. ప్రపంచయాత్ర ప్రారంభించే ముందు ఎవరి సహాయం లేకుండా ఒంటరిగా బతకగలడో లేదో తెలుసుకోడానికి కాలేజీవారి అనుమతి తీసుకొని ఓ ఏడాదిపాటు ఒంటరిగా వున్నాడు. దీంతో అతనికి ఆత్మవిశ్వాసం ఏర్పడింది. ఇప్పుడు ఇతను ఒంటరిగా జీవించడంలోని ఆనందం గురించి, సమాజ సంక్షేమానికి అవి ఎంతగా ఉపయోగపడేదీ వివరిస్తుంటాడు.

లండన్‌లో ట్రఫాల్గర్ స్క్వేర్ వద్ద పాప్ గాయకులు ఇచ్చిన వీడ్కోలు అందుకుని బయల్దేరిన నికొలస్ ఫ్రాన్స్, ఇటలీ, ఏథెన్స్, ఈజిప్ట్, చైనాల ద్వారా ఇజ్రాయిల్ చేరాడు. ఇరాన్ ప్రభుత్వం అనుమతి ఇవ్వనందున ఇజ్రాయిల్ నుంచి బొంబాయికి విమానంలో సైకిల్‌తోసహా వచ్చిపడ్డాడు.

మద్రాసు, రామేశ్వరాలు సందర్శించి జపాన్, హవాయ్ ద్వీపాలు తిరిగి అటే లాస్‌ఏంజిల్స్ వెళ్ళాడు. అక్కడి నుంచి అమెరికాను ఓ చుట్టు చుట్టి వచ్చాడు. స్వదేశంలో ఇతనికి ప్రోత్సాహం లభించకపోయినా విదేశాల పత్రికలు ఇతని వార్తలు ప్రచురించి ప్రోత్సహించాయి. ప్రయాణ సమయంలో పులులు, పాముల వంటి క్రూరమృగాల నుంచి ప్రమాదాలు ఎదుర్కొన్నా చివరికి క్షేమంగా ఇంటికొచ్చి పడ్డాడు. వచ్చే ఏడు ఇతని పేరు గిన్నిస్ బుక్‌లోకి ఎక్కుతుంది. తన యాత్రానుభవాలను పుస్తకంగా రాసి దాని మీద వచ్చే ఆదాయంతో జీవించాలనుకుంటున్నాడు ఈ సైకిల్ వీరుడు.

## ఊసరవెల్లి

నిమిషానికొకలా ప్రవర్తించేవాళ్ళని ఊసరవెల్లితో పోలుస్తుంటారు. కాని తనకి తెలీకుండానే రంగులు మార్చే ఊసరవెల్లితో, సమస్తం తెలిసి కూడా కప



ఈనాడు

# భాషాస్వరూపం

మాతృభాషలో మాట్లాడేటప్పుడు పామరులు కూడా తప్పులు పలకరుగాని రాసేటప్పుడు పండితులు కూడా తప్పులు రాయవచ్చు. ఎందువల్ల ?

మాట్లాడేటప్పుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసం లాంటివి తోడ్పడతాయి. రాసేటప్పుడు ఈ సాధనాలుండవు. కనక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం ఉండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం ''ఈనాడు భాషాస్వరూపం''.

పత్రికల్లోనూ ఇతర వ్యావహారిక రచనల్లోనూ సామాన్యంగా కనిపించే తప్పులు పరిశీలించి అవి దొర్లకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరిస్తూ ప్రముఖ భాషా శాస్త్రవేత్త డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ రచించిన పుస్తకమిది.

ఇది పత్రికా రచయితలకేకాక, ప్రజలకు అర్థం అయ్యేలాగా రాయాలని, తమ భావాలు స్పష్టంగా ఎదుటివారికి అందజేయాలనీ ఆశించే వారందరికీ ఉపయోగపడుతుంది.

వెల రు. 25.00

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి.ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టు ద్వారా పొందవచ్చు.

ప్రతులకు:

ఉషోదయా పబ్లికేషన్స్
ప్రయివేట్ లిమిటెడ్
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,
హైదరాబాద్ – 500 004.

టంగా ప్రవర్తించే మనిషిని పోల్చడం అన్యాయం కదా!

అది నివసించే పరిసరాలకి అనుగుణంగా, శత్రువుల బారినుండి తప్పించుకునేందుకు అలా రకరకాల రంగులు మారుస్తుందని సాధారణంగా అంతా అనుకుంటారు. నిజానికి మూడ్, ఉష్ణోగ్రత, వెలుతురు పరిస్థితులను బట్టి ఊసరవెల్లి రంగులు మారుస్తుంది.

మామూలుగా ఊసరవెల్లులు బ్రౌన్, ఆకుపచ్చ రంగుల్లో ఉంటాయి. కాని అవి ఆఫ్‌వైట్, పసుపుపచ్చ, లేతాకుపచ్చ రంగులు మార్చగలవు. బైటి వాతావరణం చల్లగా వున్నప్పుడు అవి మార్చే రంగులు లేతగా ఉంటాయి.



ఊసరవెల్లి చర్మానికి అనేక పొరలుంటాయి. ప్రతి పొరలోను రంగు కణాలుంటాయి. లోపలి పొరలో నల్లని "పిగ్మెంట్" కణాలుంటాయి. రంగు కణాల సంకోచ వ్యాకోచాలను ఊసరవెల్లి నరాలు అదుపులో ఉంచుతాయి. లోపలిపొరలో ఉన్న నల్ల రంగు కణాలు పై చర్మానికి దగ్గరగా గాని, దూరంగా గాని రావడాన్ని బట్టి ఊసరవెల్లి బాహ్య రంగుల్లో తేడా కనబడుతుంది.

ఊసరవెల్లి తన ఆహారమైన క్రిమి కీటకాదుల్ని పట్టుకుందుకు వున్నచోటు నుండి కదలకుండా నాలుకను చాపుతుంది. ఒక్కోసారి దూరాన ఉన్న ఆహారాన్ని పట్టుకుందుకు నాలుకను మరింత పొడవుగా జాపవల్సి వస్తుంది. అలా చాపిన నాలుక పొడవు దాని శరీరం పొడవుకు రెండింతలుపైన వుంటుంది. మరి అంత పెద్ద నాలుకా నోరు మూసుకుని కూర్చున్నప్పుడు నోట్లో ఇమిడిపోవడం గమ్మత్తే గామరి.

## ట్వింకిల్..ట్వింకిల్

కాటుకలాంటి కటిక చీకట్లో తళుక్కున ఓ మిణుగురు మెరిస్తే నల్లని చీరమీద చమ్కీ చమక్కు గుర్తొస్తుంది.

దీపాలు కనిపెట్టకపూర్వం మిణుగురు పురుగుల్ని వెలుతురు కోసం దేవుడు ప్రత్యేకంగా సృష్టించాడని నమ్మేవారు. ఇప్పటికీ దట్టమైన అడవుల్లో రాత్రిళ్ళు ప్రయాణించే గిరిజనులు మిణుగురుల్ని సీసాల్లో వేసుకుని లాంతర్లలా వాడుకుంటున్నారు. క్యూబాలోనూ, ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లోనూ స్త్రీలు బతికున్న మిణుగురుల్ని తమ దుస్తులమీద అలంకరణకోసం పిన్నులతో గుచ్చుకుంటారు.

రెక్కలున్నాగాని మిణుగురుని కీటకం అనరు. పురుగనే అంటారు. అసలు దానికా ట్వింకిల్‌నెస్ రావడానికి కొన్ని తమాషా కారణాలున్నాయి. మిణుగురు పొట్టలో ఐదురకాల రసాయనాలున్నాయి. ఆక్సిజన్ మిణుగురు శరీరంలోకి ప్రవే





శించగానే సరాలలో ఒక విధమైన రియాక్షన్ జరిగి ఐదురసాయనాలు ఒకదానితో ఒకటి కలుసుకునేలా చేస్తుంది. వెంటనే వెలుతురు పుట్టిస్తుంది. కొన్ని క్షణాల తర్వాత మరో రసాయనం ఇంకోదానితో కలిసి ఆ వెలుతురును ఆర్పేస్తుంది. అలా ఆరి వెలగడం వల్ల మనకి మిణుక్కు మిణుక్కు మన్నట్లనిపిస్తుంది.

అసలు రహస్యం ఏమిటంటే మగ మిణుగురులు రాత్రిపూట సంచారానికి బయల్దేరుతాయి. ఆడ మిణుగురులు గడ్డి మొక్కలు, పొదలమీద పొంచివుంటి ఆ సంకేతాలకోసం ఎదురుచూస్తుంటాయి. సంకేతం అందగానే అవికూడా మిణుక్కు దీపాలు వెలిగించి తమ ఉనికిని తెలియజేస్తాయి.. సో, ట్వింకిల్ ... ట్వింకిల్ ... హౌ ఐ వండర్ వాట్ యు ఆర్ ... అన్న రైమ్‌ను మార్చి పాడుకోవాల్సిందే!

# ఉజ్వల ప్రపంచానికి కవాటాలు తెరుద్దాం... రండి!



జీవితంలో రకరకాల అవకాశాలు వస్తూ ఉంటాయి. వచ్చిన అవకాశాలను తెలివిగా ఉపయోగించుకొనే వారినే విజయం వరిస్తుంది. అవకాశాలు అంది రావడానికి డబ్బు అవరోధం కాకుండా మార్గదర్శి మీకు తోడ్పడుతుంది.

మార్గదర్శిలో మీ అవసరాలకు అనుగుణంగా వివిధ రకాల చిట్‌లు ఉన్నాయి. తేలికయిన వాయిదాల్లో మీరు పొదుపుచేసే వీలుంది. లాభసాటి డివిడెండ్లు తోడవుతూ పెరిగి పెద్దయ్యే మొత్తాన్ని తిరిగి మీరు పొంద వచ్చును. మీ జీవితమూ, మీ తోటివారి జీవితాలూ మరింత శోభాయమానం కావడానికి ఆ మొత్తం ఉపకరిస్తుంది. మార్గదర్శిలో పొదుపు చెయ్యడం నవజీవనానికి నాంది అని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!



**మార్గదర్శి**
చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్
మార్గదర్శి హౌస్, అబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిద్ సెంటర్, హైదరాబాద్ ● లక్డికాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

KIRON/MCF/81/3

# ఖైదీ

రాజుల రాజ్యం పోయి మంత్రుల పాలన వచ్చినా పేకముక్కల్లోను, కొన్నిరకాల కీటకాల్లోను రాజు, రాణీ మిగిలే ఉన్నారు.

చెత్తాచెదారం తిని బతికే చెదపురుగుల రాచఠీవికేమీ కొదువలేదు. అలా అని ప్రతి చెదపురుగూ రాజుగాని, రాణీగాని కాలేదు.

స్తాయి. చెదపురుగుల ప్రధానశత్రువుచీమ. చీమ బారి నుండి కాలనీని రక్షించడంతప్ప రెండో పని చేతకాదు వీటికి. ఈ సైనికు లకు తిండి పెట్టి శుభ్రంచేసే పనికూడా కార్మిక చెదపురుగులే చేస్తాయి. ఇక మూడవది రాయల్ వర్గం. మిగతావాటి కంటే ఆరోగ్యంగా, పెద్దవిగా వుండేవే రాజు, రాణీ అవుతాయి. వీటిపని కేవలం సంతానాభివృద్ధే.



చెదపురుగులు పెట్టే పుట్టలు జాగ్రత్తగా పరిశీలిస్తే కాలనీల్లా ఉంటాయి. చెదపురుగులు వాటిని అవే మూడు వర్గాలుగా విభజించుకున్నాయి. ఒక్కో పుట్టలో కొన్ని లక్షల చెదపురుగు లుంటాయి. కష్టించి పనిచేస్తాయి. సొరంగాలు నిర్మించడం, పుట్టల గూళ్లు కట్టడం, మొత్తం కాలనీ (పుట్ట) వాసులకు సరిపడే ఆహారం, నీళ్లు సంపాదించడం, గుడ్ల నుండి బైటికి వచ్చిన పిల్లల సంరక్షణా బాధ్యత–సర్వం ఇవే చూసుకుంటాయి.

సైనిక వర్గానికి చెందిన పురుగులు కాలనీ రక్షణ బాధ్యత మాత్రమే వహి

చెద పుట్టలు అనేక గదులుగా, బుల్లి బుల్లి సొరంగాలుగా విభజించి ఉంటాయి. ఈ చెదపురుగుల కాలనీని కట్టడం పని తనాన్ని చూసినఏ వాస్తు శాస్త్రజ్ఞుడికైనా కళ్లు తిరగాల్సిందే! అంత నేర్పు కనబడు తుంది మరి. సరిగ్గా మధ్యలో ఉండే గదిలో రాజు, రాణిని ఉంచి అంజే దాదాపు బందీలుగా చేసి సైనిక పురుగులు కాపలా ఉంటాయి. ఏదైనా ప్రమాదం జరిగి పుట్ట చెల్లాచెదురైతే తప్పించి ఈ రెండూ బైటికి రాలేనంత పకడ్బందీగా ఉంటుంది బందిఖానా. నిరంతరంశ్రమిస్తూ బైటి ప్రపంచాన్ని చూడగలిగే కార్మిక చెదపురుగులెంత అదృష్టంచేసుకున్నాయో అని వగవడం మినహా పాపం... రాజు, రాణీ తమగదిదాటి బైటికి రాలేవుకదా!●





# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన
ఫార్ములా మీ నోటి శ్వాస
శుభ్రంగా, తాజాగా వుండేలా
చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా,
దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుండి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

'కస్తూర్బా గరల్స్ బోర్స్టల్ స్కూల్' అన్న బోర్డు చూసి "వారే అబ్బీ-ఆపావు ! ఇక్కడే దిగాల్నేను!" అంటూ రిక్షావాణ్ని కంగారు పెట్టేసి, రిక్షా ఆపించి గబగబా దిగబోయి కాలు తడబడి తమాయించుకుంది ! పక్కనున్న ఊచపట్టుకుని దిగి, ఉస్సురని నిట్టూర్చి, "ఊరికి దూరంగా ఎక్కడో వల్లకాట్లో వున్నట్టుందిరా! అయినా పాపం జాగర్తగా తీసుకొచ్చావ్. నీ కష్టం నా కొద్దురా అబ్బీ!" అంటూ అనుకున్న దానికన్నా ఓ పావలా ఎక్కువియ్యబోయింది నర్సమ్మ-కట్టుకున్న ఆవు లంచు ముతకచీర పమిటచెంగు చివరనున్న ముడిని విప్పుతూ.

"ఏందమ్మో, చార్మినార్ కాడన్నావ్. షాలిబండా సివరకొచ్చినం. దో రూపయా జాదాదో" అన్నాడు రిక్షా అతను మెడకు చుట్టుకున్న గళ్ళ రుమాలును తీసి మొహానికి పట్టిన చెమటను తుడుచుకుంటూ.

"ఏవిటేవిటీ? ఏదో కష్టపడ్డావు కదా అని ఓ పావలా ఎక్కువియ్యబోతే ముసల్దాన్ని చేసి మోసం చెయ్యాలనుకుంటున్నావట్టుంది. నా దగ్గర నీ పప్పులేం ఉడకవ్రా అబ్బీ ! ఈ నర్సాపురం నర్సమ్మ నీలాంటివాళ్ళను ఇదిగో ఇంత మందిని చూసింది" అంటూ పండిపోయిన తన తలకట్టును చూపించింది.

దాంతో ఇద్దరూ ఘర్షణ పడ్డారు. బయట కరకరమంటున్న ఎండ. రోడ్డుమీద ఎవరి పనుల్లో, ఎవరి ఆలోచనల్లో వారు పరుగెత్తుతున్నట్టుగా నడుస్తున్న జనం. హైదరాబాదు నగర కాంత రాత్రి పెట్టుకున్న మర్మాసు ఇంకా పూర్తిగా కడిగేసుకోనట్లున్న ఉదయం. నర్సమ్మ వాగ్ధాటిముందు రిక్షావాడు నిలవలేకపోయాడు. తిట్టుకుంటూ, గొణుక్కుంటూ ఆమె ఇచ్చినంతా పుచ్చుకుని, మరో బాడుగ వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు.

గేటు దగ్గరున్న గూర్ఖా ఆమెను ఆపబోయాడు. చేసంచితో అతగాణ్ణి అవతలకు ఒక్క నెట్టునెట్టింది ఆమె. "నా మనుమరాలి కోసం నే వెళుతుంటే నువ్వెవడవురా అబ్బీ నన్నాపుతున్నావూ?" అంటూ లోపలకు ప్రవేశించింది.

చేతిలో ఓ గుడ్డ సంచితో ధాష్టికంగా లోపలకు వస్తున్న అరవైయ్యేళ్ళ నర్సమ్మను ఆ పాఠశాల ప్రాంగణంలో ఉన్న ఆడపిల్లలు ఉత్సుకతతో చూశారు.

వాళ్ళంతా విచ్చుకోవడం మర్చిపోయిన ముద్దబంతి పూవుల్లా ఉన్నారు. ఎదగడం ఆగిపోయిన ఏడాకుల అరటి చెట్లల్లా ఉన్నారు. కొందరు పరికిణీ-జాకెట్లల్లో ఉన్నారు. కొందరు లంగా-వోణీల్లో ఉన్నారు. కొద్దిమంది అయిదు గజాలచీర మడతలను నిన్ననో, మొన్ననో ఒంటికి చుట్టబెట్టుకున్నట్టున్నారు.

వాళ్ళందర్నీ కంటికొసల్నుంచి చూసి కొంచెం దూరం ముందుకు నడిచి, ఓ అమ్మాయిని దగ్గరకు పిల్చి, "మీ పంతులమ్మ ఉండేది ఎక్కడా?" అన్నది నర్సమ్మ పెద్దగా.

ఆ అమ్మాయి ఆ ప్రశ్నకు నోటితో సమాధానం చెప్పలేదు. వరండా చివరగా 'వెల్ ఫేర్ ఆఫీసర్' అనే బోర్డున్న ఓ గదిని చూపించింది చేతో.

"ఏం... నోటితో చెబితే నీ నోటి ముత్యాలు రాలిపోతాయా?" నర్సమ్మ కోపంగా అన్నది.

"పాపం, ఆ అమ్మాయి మూగదండీ"





పక్కనున్న మరోపిల్ల అన్నది జాలిగా.

'అయ్యయ్యో...ఆ పాడు దేవుడు నిన్ని జైలుపాలు చేయడమే కాకుండా అవకరం గూడా పెట్టాడా, బానేవుంది సౌడబ్బెం!' అనుకుంటూ ఆమె వెల్‌ఫేర్ ఆఫీసరున్న గదిలోకి అడుగుపెట్టింది.

వెల్‌ఫేర్ ఆఫీసరు ఎదురుగా ఉన్న టేబిలు మీద 'మిస్ పుష్పవతి, యం.ఏ' అన్న నేమ్‌ప్లేట్ ఉంది. ఆమె కూర్చున్న కుర్చీకి పైన గోడమీద ప్రెసిడెంట్, ప్రైమినిస్టర్ నవ్వడానికి ప్రయత్నంచేస్తూ ఫొటోల్లో కనిపిస్తున్నారు. గుమ్మంపైన ధర్మో రక్షతి రక్షితః అన్న సంస్కృత శ్లోకం ఉంది. కిటికీల్లో ఫ్లవర్ వేజులున్నాయి. ఆ పూలకుండీల్లో జపాన్ పద్ధతిలో పెంచబడుతున్న వామన వృక్షాలున్నాయి. ఆ చెట్లకు కొన్నింటికి పూత వుంది, కొన్నింటికి కాయలున్నాయి.

నర్సమ్మ సరాసరి వెళ్ళి పుష్పవతి ఎదురుగా వున్న ఓ కుర్చీలో కూచున్నది.

"ఏవమ్మా! నువ్వేనా ఇక్కడి పంతులమ్మవి?" అన్నది మర్యాదల సంగతి తరవాత, ముందు విషయంలోకి వచ్చేద్దాం అన్నట్టుగా.

"నేను పంతులమ్మని కాదండీ, ఆఫీసర్ని! ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ని!"

నర్సమ్మకు ఆ ఇంగ్లీషు మాట సరిగా అర్థం కాలేదు. "ఉహూ!" అన్నది ఏదో ఒకటి, ఏదైతేఏం అన్నట్టుగా.

"నా మనవరాల్ని తీసుకు వెళ్ళడానికి వచ్చాను! అన్నది మళ్ళీ.

నేరస్థుల్ని పాఠశాలలోకి తీసుకుని వచ్చేటప్పుడూ, మళ్ళీ తీసుకుని వెళ్ళిపోయేటప్పుడూ రకరకాల మనస్తత్వాల్ని ప్రదర్శించే అనేక మంది మనుషుల్ని పుష్పవతి తన రెండు దశాబ్దాల సర్వీసులో సన్నిహితంగా చూసింది. కొందరు కన్నీళ్ళతో వేగిపోయేవారు. కొందరు భయంతో కనలిపోయేవారు. కొందరు వాత్సల్య భారంతో కుంగిపోయేవారు. 'మా అమ్మాయిని జాగ్రత్తగా చూసుకోండి మిస్'అని బ్రతిమిలాడేవారు కొందరు.

'ఏదో తొందర్లో తప్పు సేసింది తల్లీ. గుణం మంచిదే. తవరే కాపాడాల' అంటూ కాళ్ళమీదపడి ప్రార్థనాస్వరంతో అంగలార్చేవారూ, 'తమరే తల్లీ తండ్రీ దైవం దానికిపుడు. ఏ రోజు మా బిడ్డ నొగ్గేత్తారో ఓ కార్డుముక్క రాయించండమ్మా, రైలుబండీలో వచ్చి బిడ్డను తోలుకెళ్ళిపోతాము' అనేవారూ...తమ పిల్లల్ని జాగ్రత్తగా చూడడం కోసం పుష్పవతికి డబ్బులిచ్చి ప్రలోభ పెట్టాలని ప్రయత్నం చేసేవారూ...

ఎందర్నో చూసింది పుష్పవతి తన సర్వీసులో.

కొందరు పిల్లలకు ఏ దిక్కూ ఉండేది కాదు. గాలికి పూసిన పువ్వులు ఆ పిల్లలు. వారిని కోర్టులో రకరకాల ప్రశ్నలువేస్తే ఏ సమాధానాలు ఎట్లా చెప్పాలో కూడా వాళ్ళకు తెలీదు. వారిని విచారించడం కోర్టువారికి నల్లేరుపై బండి నడకలా ఉండేది. రెండేళ్ళు, మూడేళ్ళు, నాలుగేళ్లు - వయసునుబట్టి, నేర లక్షణాన్నిబట్టి శిక్షను వేసేవాళ్లు. బోర్‌స్టల్ స్కూలుకు పంపించేసేవాళ్ళు. ఓ వ్యాను సిద్ధంగా ఉండేది కోర్టు బయట ఆ బాల నేరస్థులకోసం. వ్యానులో పదిమంది పోలీసులమధ్య ఆ ఆపపిల్లలు బిక్కుబిక్కుగా కూచుని భయం భయంగా ఆ పోలీసుల చేతుల్లో ఉన్న తుపాకుల్ని చూస్తూ స్కూలు చేరుకునేవాళ్లు. తుపాకుల్ని చూస్తూ వాళ్ళ గుండెల్లో అణగారి

పోయిన మాటలు ఇహ ఆ స్కూలు లోపల వాళ్లున్నంతకాలము బయటకు వచ్చేవికావు. వాళ్ళ హృదయ క్షేత్రాల్లో ప్రవహించవలసిన మానవతా జలధారలు ఇంకిపోయేవి. మమతల నీలజలదాలు ఊసరక్షేత్రాలకు ఎగిరిపోయేవి.

తన అసిస్టెంట్ల సహాయంతో పుష్పవతి ఎన్నో విధాల ప్రయత్నించేసేది ఆ అభాగ్య బాలికలను ఉత్సాహపర్చడానికి. కొన్నిసార్లు ఆమె ప్రయత్నాలు ఫలించేవి, మరికొన్నిసార్లు ఆమె ఉస్సురని నిట్టూర్చవలసివచ్చేది.

"ఎవరు మీ మనవరాలు?" పుష్పవతి ప్రశాంతంగా అడిగింది.

"నిప్పులాంటి తన తల్లిమీద ఆ దొంగసచ్చినోడు భూషయ్య చెయ్యెయ్యబోతే, ఎనకపాల్నెళ్ళి ఆడీపులో బాకు దెగెయ్యలేదూ... అదే మా పార్వతి!" సర్సమ్మ కంఠం వణికింది.

"ఏం...అట్టా చెయ్యడం తప్పా? మానం దోచుకోబోయినవాడి పేణం తీస్తే అది తప్పా? తన మానంమీద కన్నేసినాడనే కదా ఆ కీచకుణ్ని ద్రౌపదమ్మ తన మొగుడిచేత చంపించింది? అక్కడ ద్రౌపదమ్మకు మొగుడడ్డం వచ్చాడు, ఇక్కడ నా కన్నకూతురికి తను కన్న కూతురడ్డంవచ్చింది. అది తప్పన్నది కోర్టు. ఆరేళ్ళిక్కడ ఉండమన్నది... ఆరేళ్లు! ఈ ఆరేళ్ళూ నా తల్లి ఏ నరకం అనుభవించిందో? అయినవాళ్ళు ఉండి కూడా తనను ఆదుకోలేదని ఎంతగా మనసులో కుమిలిపోయిందో? అందుకనే మీ దగ్గర్నుంచి ఉత్తరం రాగానే ముసిలిదాన్ని ఓపిక లేకపోయినా 'ఓసేవ్ నువ్వింట్లో ఉండవే. నే వెళ్ళి మీ అక్కయ్యను తీసుకొస్తాను' అని శ్యామల్తో చెప్పి రేవుదాటి మూడొందలమైళ్ళు ఆ ముదనష్టపు రైల్లో ప్రయాణంచేసి ఇదిగో ఇట్టావచ్చిపడ్డా నీ దగ్గరకు. ఏదీ తల్లి పార్వతి..ఎక్కడుంది నా మనవరాలు"

"నేరం చేసినవాళ్లు చిన్నవాళ్లైనా, పెద్దవాళ్లైనా శిక్ష అనుభవించక తప్పదు సర్సమ్మగారూ"

తన పేరు ఆమె నోటివెంట విని సర్సమ్మ ఉలిక్కిపడింది. "నేను... నేను తెల్సునా మీకు?"

"మీరెవరో తెలుసుకోకుండానే మీరు వచ్చి పార్వతిని తీసుకువెళ్ళిపోవచ్చు అని ఉత్తరం రాశామంటారా?" పుష్పవతి నవ్వింది అనునయంగా. ఆమె పలువరుస తెల్లగా మెరిసింది.

"నేను ఫలానా అని మీరు చెప్పడం కోసమే ఎవరు మీ మనవరాలని అడిగాను. ఇవ్వాళ మీరు వస్తారని తెలుసు. పార్వతిని తీసుకువెళ్తారనీ తెలుసు. రండి, మీ మనవరాల్ని చూద్దురుగాని"

ఇద్దరూ ఆ గది దాటి బయటికివచ్చి వరండా మెట్లుదిగి విశాలమైన ఆవరణలో ఎడమవైపుగా తోటలో చెట్లమధ్య,పంపుల దగ్గర రకరకాల పనిపాటలు చేసుకుంటున్న 'ఇన్‌మేట్స్' దగ్గరకు వెళ్ళారు.

ఒకచోట అయిదారుగురు ఆడపిల్లలు బట్టలుతుక్కుంటున్నారు. ఒకమ్మాయి దూరంగా ఓ చెట్టు బోదెనానుకుని కూర్చున్నది కళ్ళు మూసుకుని. ఆమె కళ్ళ నుండి నీళ్లు చెంపల మీదుగా కిందకు కారిపోతున్నాయి.

పద్దెనిమిదేళ్ళ ఓ పడుచు పిల్ల ఆ పిల్ల దగ్గరకు మెల్లగా నడుస్తున్నది. ఆ పడుచుపిల్ల నడకలో హొయలు, వదనంలో ఒక విషాద నిర్లిప్తత, సర్వదేహం నుండి బయటకు ప్రవహించే ఒక

విచిత్రమైన సౌందర్యం. ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళి తన పమిట కొంగుతో కన్నీరు తుడిచింది. "ఏమిటి చెల్లాయ్?" అన్నది అనుకంపతో.

"అక్కా..." ఆ పిల్ల బావురుమంది. "ఇహ నేను స్కూలుకు పోను"

"ఏం?"

"బోర్‌స్టల్ పిల్ల.... బోర్‌స్టల్ పిల్ల అంటూ అబ్బాయిలు నన్నేడిపిస్తున్నా రక్కా"

"అంటే వాళ్ళేడిపిస్తున్నారు కదా అని చదువు మానేస్తావా నువ్వు?"

"మరింకేం చెయ్యనూ?" ఆ పిల్ల బేలగా అడిగింది.

"మనలాంటివాళ్ళకు చదువే ఊత కర్ర. ఆ కర్ర లేకపోతే మనం నడవనే లేము. ఒకవేళ నడిచినా, నడుస్తూ నడుస్తూ కిందపడితే పైకి లేవలేము"

అట్లా ఆ అమ్మాయికి ధైర్యం చెప్పి, "పో... పోయి వాళ్ళతో కలిసి పనిచెయ్యి. పనిచేస్తుంటే ఇటువంటి ఆలోచనలురావు" అన్నది.

మరికొంత దూరంలో ఇద్దరాడపిల్లలు తొక్కుడుబిళ్ళాటాడుతున్నారు- సన్నగా పాటపాడుకుంటూ. ఆ వడుచు వెళ్ళి వాళ్ళ ఆటను మానిపించేసి, గద్దిస్తూ అడిగింది-

"ఇప్పుడు ఎంతైందర్రా టైము?"

వాళ్ళిద్దరూ సమాధానం చెప్పలేదు. తలలు వంచుకు నిలబడ్డారు. "ప్రేయర్ సెషన్ అయిందా? బ్రేక్‌ఫాస్ట్ అయిందా? కాలేదు. కానీ మీ ఆటలకు మాత్రం టైమయిపోయింది. ఆటకూ, పాటకూ, తిండికీ, నిద్రకూ కూడా కొన్ని సమయా లంటూ ఉన్నాయి. వెళ్ళండి వెళ్ళండి. వెళ్ళి తొందరగా కాలకృత్యాలు పూర్తి చేసుకుని ప్రార్థనకు హాజరుకండి" అన్నది వీలయినంతగా కోపాన్ని నటిస్తూ. వెళ్ళబోతూ వెళ్ళబోతూ వాళ్ళిద్దర్లో ఒక అమ్మాయి అడిగింది- "పార్వతక్కా... నిజంగానే నీకు కోపం వచ్చిందా?"

ఆ మాట విన్న పార్వతి పక్కున నవ్వింది. ఆ నవ్వు చూసి వాళ్ళూ నవ్వారు. నవ్వుతూనే లోపలకు పరుగెత్తారు.

మరో చోట పార్వతి అంట్లు తోమిన గిన్నెల్ని రెండు బకెట్లలో ఉంచి చెరో చేత్తోనూ చెరో బకెట్టునూ పట్టుకుని మోయలేక మోయలేక వంట ఇంట్లోకి మోసుకువెళ్తున్న ఓ ఎనిమిదేళ్ళ పసి పిల్లను చూసింది. జాలిపడి ఆ చేతుల్లోంచి రెండు బకెట్లనూ అందుకోబోయింది.

"అక్కా! నువ్వు... నువ్వు మోస్తావా వీటిని? అంట్లు తోమడం, తోమినవాట్ని వంట ఇంట్లోకి చేరేయడం నా పనక్కా!"

"మోయదల్చినవాళ్ళు మోయలేక పోయినప్పుడు, మోయగలిగినవాళ్లు ఆ భారం మోయడంలో తప్పులేదు చెల్లాయ్"

ఆ చిన్నారికి సాయంచేసి పార్వతి వంటపాత్రల్ని గదిలో సర్దిపెడుతున్నపుడు ప్రేయర్ బెల్ మోగింది. "పదమ్మా... పద. ప్రేయర్‌కు ఆలస్యం కాకూడదు" అంటూ ఆ చిన్నపిల్లను తీసుకుని ప్రార్థనా సమావేశానికి వచ్చింది.

ఓ మామిడిచెట్టు నీడలో పిల్లలందరూ గుండ్రంగా మూడు వరుసల్లో నిలబడ్డారు. పైనుండి సూర్యుడు చెట్ల ఆకుల మధ్యనుండీ సందుచేసుకుని ఆ పిల్లల వేపు రాగ నేత్రాలతో చూస్తున్నాడు. చెట్ల కొమ్మలమీద చేరిన పక్షులు మెడలు ముందుకు సారించి వాళ్ళ పాటను వినడానికి కుతూహలం ప్రకటిస్తున్నాయి.




కిచకిచమంటున్న రెండు ఉడతలు నిశ్శ బ్దంగా నిలబడిపోయాయి.

పిల్లల మధ్యగా పార్వతి నిలబడి ఉంది. సన్నగా, బంగారు తీగలా ఉంది. కోలగా, లేతగా ఉన్న మొహం. వంకీలు తిరిగిన నల్లని పొడువాటి వత్తైన జుత్తు. చిన్న గడ్డం. గడ్డం మీద కోసుగా ఉన్న ముక్కు. పల్చటి చెంపలు. చెంపకు కిందగా, గడ్డానికి పక్కగా ఓ పుట్టుమచ్చ. ఆమె సాదాచీర కట్టుకున్నా శ్రీకారంలా గంభీరంగా ఉంది.

పార్వతి తన మధురమైన కంఠంతో, కళ్ళుమూసుకుని నిశ్చల ధ్యానంలో, మోహనరాగంలో ఆ సర్వేశ్వరునికి తమ జీవితాలను నివేదనం చేస్తూ ప్రార్థనాగీతా న్నందించింది.

"ఏమిటి తండ్రీ మా బతుకులకర్థం? పువ్వులు వికసించక ముందే వాటిని నిర్ద యగా నలిపి ధూళిలో విసిరివేశావు. ఎగరడం రాకముందే చిన్నారి పక్షుల రెక్కలు విరిచి నేలపై కూల్చివేశావు. సమాజం మమ్మల్ని చిన్నచూపు చూస్తు న్నది. ఆ చూపుల తూపుల తాకిడికి తట్టుకోలేకపోతున్నాం. భవిష్యత్తు అంధకార మయంగా, భయావహంగా కన్పిస్తోంది. కడలిలో చుక్కానిపట్టి, తెరచాప గట్టి, మమ్మ దరికి చేర్చరావా ప్రభూ!"

ఆమె కంఠంలో ఉన్న ఆర్తికి జగత్తే కరిగి నీరైనట్లుంది. దూరంగా నుంచుని విన్న నర్సమ్మ తనను తాను నిగ్రహించు కోలేక ముందుకు రాబోతే పుష్పవతి ఆమెను పట్టుకుని ఆపింది.

ప్రేయర్ అయిపోయిం తర్వాత పార్వతి వెనకాలే అందరూ భోజనశాల లోకి నడిచారు. ఎవరి ప్లేట్లను వారు తీసుకుని, వారి వారి స్థానాల్లో వరుసగా కూచున్నారు. వంటమనిషి అందరికీ టిఫిన్ వడ్డించటానికి ఆయత్తమౌతోంది.

"ఊ...మీ రోల్ కాల్ చెప్పండి" పార్వతి పెద్దగా అన్నది.

అందరూ తమ తమ నంబర్లను వరు సగా చెప్పసాగారు. తొమ్మిదో నెంబరు పలకలేదు. "నంబర్ నైన్...?" పార్వతి పిలిచింది.

"తన గదిలో నుంచి ఇవ్వాళ జరీనా ప్రేయరుక్కూడా రాలేదక్కా" నంబరు ఎనిమిది అన్నది.

"సరే, మీరు టిఫిన్ కానివ్వండి. నేను కనుక్కు వస్తాను"

జరీనా ఎందుకు రాలేదో తెలుసుకో వాలనీ, ఆ అమ్మాయి వచ్చేవరకూ ఆగి అప్పుడు టిఫిన్ చెయ్యాలనీ వాళ్ళందరకీ లోలోపల ఉన్నా, పైకి "అట్లాగే అక్కా!" అనేశారు యాంత్రికంగా. తలలు వంచుకుని టిఫిన్ తినసాగారు కొద్ది కొద్దిగా. వాళ్ళ ఆలోచనలన్నీ జరీనా చుట్టూనే ఉన్నాయి, పార్వతి చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి.

"ఎందుకు జరీనా ప్రార్థనకు రాలేదు, టిఫిన్ చేయటానికి రాలేదు?" అన్నది పార్వతి గదిలో అడుగు పెడుతూనే ఉద్వేగంగా.

జరీనా కిటికీ వైపుగా నిలబడి ఉంది. కిటికీలో నుండి బయటి ప్రకృతి అరుణారు ణంగాకన్పిస్తోంది.పార్వతి ప్రశ్నకు జరీనా జవాబు చెప్పలేదు. కనీసం ఇటు తిరిగైనా చూడలేదు. పార్వతే మెల్లగా వెళ్ళి జరీనా భుజాల మీద చేతులు వేసి, ఆ పదహారేళ్ళ పిల్లను తనవైపుకు తిప్పుకుంది. "ఏమిటి- ఏం జరిగింది?" అన్నది తల్లిలాగా.

పార్వతికీ, జరీనాకూ పెద్దగా వయో

భేదం లేకపోయినా, పార్వతి కన బరుస్తున్న అభిమానపు పెద్దరికంలో జరీనా చిన్నపిల్లైపోయి, "బెహన్!" అంటూ పార్వతి గుండెల్లో తలదాచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

"ఏమైంది జరీనా?"

ఆవేశపు పొంగు కొంత తగ్గింతర్వాత జరీనా వెక్కిళ్ళ మధ్యగా అన్నది. "నీకు తెలుసుగా నేనేం చేశానో, ఏ నేరం మీద ఇక్కడకు వచ్చానో?"

పార్వతి నీరవంగా అన్నది. "నువ్వూ, నేను అందరం చిల్డ్రెన్స్ యాక్ట్ కింద వచ్చినవాళ్ళమేలే... నేరమేదైతే ఏం?"

"కానీ... కానీ, నేను చేసిన నేరం... ఊహూ, అది నా దృష్టిలో నేరం కానే కాదు" జరీనాలో ఒక దృఢత్వం, ఒక వింత ఆవేశం.

"అయితే ఇంకా ఎందుకు ఆ



కన్నీరు?"

"చేసిన పని అక్కరకు రాక పోయిందన్న బాధ. చెపితే నమ్మవ్ బెహన్ నువ్వు! మా అమ్మకు పదిహేనో ఏట పెళ్లైంది. పెళ్లైన రెండోఏట నేను పుట్టాను. అంటే మా అమ్మకూ, నాకూ పదహేడేళ్ళే అన్న మాట వయసులో తేడా. తెలీనివాళ్ళు మమ్మల్నిద్దరూ అక్కా చెల్లెళ్ళనుకుంటారు. అట్లా ఉంటాం మేము. నిజానికి మా అమ్మ ముందు నేనెందుకూ పనికిరాను తెలుసా? అంత అందమైన కళ్ళు, నీలికళ్ళు, గుండ్రటి మొహం, కడిగిన ముత్యంలాంటి శరీరం. అందుకనే మా నాన్నకు... ఛూత్..." జరీనా అసహ్యంతో కిటికీలోనుండి బయటకు ఉమ్మేసింది. "అమ్మ నడ్డం పెట్టుకుని డబ్బు సంపాయిద్దామనుకున్నాడు. అర్థ మయిన వెధవలకూ అమ్మ అందాన్ని

తాకట్టు పెడదామనుకున్నాడు. అమ్మ కాళ్ళావేళ్లా పడ్డది. ఉహు..వినడే! అపుడు నేను అడ్డుపడ్డాను. కన్నతండ్రి... కన్న తండ్రా కాదు, స్వయానా కడుపున కన్న కూతురిమీద పోలీసులచేత వ్యభిచార నేరం మోపిస్తాడా? నేను పోలీసులమీద తిరగబడ్డాననీ, గాయపర్చాననీ దొంగ సాక్ష్యం చెప్పిస్తాడా? వాళ్ళతో షరీకై నన్నిక్కడకు పంపిస్తాడా?"

పార్వతి అనునయ పూర్వకంగా అన్నది. "జరీనా! నువ్వూ, నేనూ కూడా ఇష్టమున్నా లేకపోయినా గతాన్ని మెళ్లో వేసుకుని ఊరేగవలసినవాళ్ళమే. గుండె రాయి చేసుకోడంకన్నా ఇందుకు వేరే మార్గంలేదు"

"కాదక్కా!" జరీనా తల అడ్డంగా తిప్పింది. "నీ సంగతి వేరు, నా సంగతి వేరు"

"ఏవిటిట ఆ వేరు?"

"నువ్వు నరకానికి వచ్చినా నీ తల్లిని నరకంలో పడకుండా కాపాడుకోగలిగావు నువ్వు. నేను నరకానికీ వచ్చాను, నా తల్లినీ కాపాడుకోలేకపోయాను" జరీనా కంఠం రుద్ధమైంది. జాకెట్టు లోపలనుండి అతిభద్రంగా దాచుకున్న ఓ ముడతలు పడ్డ ఉత్తరాన్నితీసి పార్వతికిస్తూ అన్నది. "నేనుకూడా అడ్డులేనుకదా, ఆ తండ్రిగాడికి ఇహ అంతా స్వేచ్ఛ! ఆ మొరటు స్వేచ్ఛకు బలయిపోయింది నా తల్లి. పక్కఇంటి వాళ్ళు రాసారు" మోకాళ్ళమీద కూర్చుండిపోయి, రెండు కాళ్ళమధ్యా తల పెట్టుకుని రోదిస్తోంది జరీనా అత్యంత దీనంగా. ఆమె ఏడుపు మధ్యగా ముక్కలు ముక్కలుగా విని పిస్తున్నాయి మాటలు. "నువ్వు న్యాయం





కోసం, ధర్మంకోసం ఒక హత్యచేశావ్. ఆ సంతృప్తి ఉంది నీకు. కనీసం ఆ సంతృప్తికూడా లేదే నాకు? లోకం నిన్ను ఏమైనా అననీ నువ్వు కేర్ చేయనక్కర లేదు. అవసరంవస్తే, అవును ఇందుకు చేశాను ఆ హత్యను అని మళ్ళీ మళ్ళీ చెప్పగలవు నువ్వు! కానీ నేనేం చెప్పను? నేనేం చెయ్యను?"

'నువ్వు న్యాయం కోసం, ధర్మం కోసం ఒక హత్యచేశావ్ !' జరీనాను చూస్తున్నకొద్దీ ఆ మాటలు పార్వతిచెవుల్లో ప్రతిధ్వనించసాగాయి.

జరీనా ఆమెనుచూసి కళవళపడ్డది.

పార్వతి తనను తాను సంబాళించు కుంది. "జరీనా! ఈ మచ్చ మన మెడల మీదే ఉంటుంది. ఇతరులకు కనిపించ కుండా మన గుండెలమీద తగులుతూ, మనను అనుక్షణం హెచ్చరిస్తుంటుంది. మనం చెయ్యగలిగిందేం లేదు – సర్దుకు పోవడంతప్ప. పద పద. ఏడుస్తూ కూచుని చుట్టుపక్కలవాళ్ళను కూడా ఏడిపించడం దేనికి?"

పార్వతి, జరీనా గది బయటకు వచ్చారు. అంతవరకూ దూరంగా నిలబడి మనపరాల్ని పరిశీలనగా చూస్తున్న నర్సమ్మ ఇహ ఓపికపట్టలేకపోయింది. "పార్వతీ.... ఎట్లా ఉన్నావే? ఎంత పెద్ద దానివయినావ్.నీకడుపుడక. నా ఆయుష్షు, నీ తల్లి ఆయుష్షూ కూడా పోసుకుని పది కాలాలపాటు చల్లగా ఉండు తల్లీ" అంటూ గబగబా పార్వతి దగ్గరకు నడచి ఆమెను అక్కున చేర్చుకుంది.

పార్వతి ప్రశ్నార్థకంగా పుష్పవతివేపు చూసింది. "మీ గ్రాండ్ మదర్ నర్సమ్మ నిన్ను ఇంటికి తీసుకు వెళ్ళిపోవటానికి వచ్చారు"

"ఏ ఇంటికి?" పార్వతి అయో

మయంగా అన్నది. "మా నాన్న ఇంటి లోంచి పారిపోయి దేశాలు పట్టిపోయాడనీ; నన్ను పోగొట్టుకుని, నాన్న లేక బతకడం చేతకాక అమ్మ చచ్చిపోయిందనీ మీరే చెప్పారు కదా మిస్? ఇంటికి ఉత్తరం రాస్తే 'ఎడ్రస్ నాట్ ఫౌండ్' అని ఆ లెటర్ తిరిగివచ్చిందనీ మీరే చెప్పారు"

"మీ అమ్మ పోతే నేనూ పోయాననుకున్నావుటే పిచ్చి మొహవా?" నర్సమ్మ కోప్పడ్డది.

పుష్పవతి నర్సమ్మను, పార్వతిని, జరీనాను తీసుకుని డైనింగ్ హాలుకు వెళ్ళి అక్కడ వాళ్ళకు బ్రేక్‌ఫాస్ట్ ఇప్పించింది. పార్వతి కాఫీ తాగుతుండగా అన్నది.

"నిన్నటితో నీ సెంటెన్స్ పీరియడ్ అయిపోయిందమ్మా! రూల్స్ ప్రకారం నిన్ను డిస్‌ఛార్జ్ చెయ్యాలిప్పుడు..." ఆమె గొంతు వణికింది.

"అవును. గడువు దాటిం తర్వాత ఒక్కరోజు కూడా నేరస్థులు ఇక్కడ ఉండకూడదు"

ఆమె కంటి నుండి ఓ కన్నీటి చుక్క మెల్లగా జారి ఆమె చేతి మీద పడింది. కన్నీటి చుక్క పడ్డ ఆ ప్రదేశాన్ని పార్వతి వంగి తన పెదిమలతో చుంబించింది. మౌనంగా పుష్పవతి కళ్ళల్లోకి చూసింది తల ఎత్తి.

"తల్లి కాని తల్లివి! నన్ను వెళ్ళిపొమ్మంటున్నావా మిస్?"

"నీ శిక్షాకాలం ముగిసింది. నువ్వు ఎడల్ట్ వయినావు. నీ మీద అధికారం ఉన్న నీవాళ్లు వచ్చారు నిన్ను తీసుకుపోవడానికి. పంపించకనేనేంచెయ్యను?"

పార్వతి వెళ్ళిపోతోందన్న వార్త. క్షణాల్లో వ్యాపించింది ఆ కాంపస్ అంతా. ఎవరూ చెప్పకుండానే అందరూ ఒకచోట గుమిగూడారు.

పుష్పవతి అందర్నీ చూసి అన్నది- "మై డియర్ గరల్స్!"

ఎంతగా దాచుకున్నా ఆమె కంఠంలో ఓ చిన్న వణుకు.

"మీ అక్క పార్వతి వెళ్ళిపోతోంది- తన శిక్షా కాలం పూర్తి చేసుకుని, కాదు.. సద్వినియోగం చేసుకుని! ఈ ఆరేళ్లలోనూ పార్వతి మీకో ఐడియల్, ఒక ఆదర్శం-నడవడికలో, మాట తీరులో, మన్ననలో! పన్నెండేళ్ల పసిపిల్లను గ్రాడ్యుయేట్ చేసి బయటికి పంపిస్తున్నది ఈ బోర్‌స్టల్‌స్కూల్! పార్వతి వెళ్ళిపోయినా ఆమె చెప్పిన విషయాల్ని, ఆ ప్రవర్తనని జ్ఞాపకం పెట్టుకోండి. అందరూ ఒక్కసారి అనండి మే గాడ్ బ్లెస్ పార్వతి!"

అందరూ భారంగా అన్నారు "మే గాడ్ బ్లెస్ పార్వతి!"

పార్వతి పేరు పేరు వరుసనా అందరి దగ్గరా సెలవు తీసుకొంటుండగా, నర్సమ్మ అన్నది - "అమ్మాయ్! ఈ కొత్త చీరను మీ ఆఫీసరమ్మకిచ్చి నమస్కారం చెయ్; ఇవిగో ... స్వీట్లు అందరికీ పందారం చెయ్."

స్వీట్లు తింటున్నవాళ్లకెవ్వరికీ అవి తియ్యగాలేవు. వెళ్ళిపోతున్న పార్వతిని చూస్తూ వాళ్ళు బావురుమనకుండా ఉండలేకపోయారు.

* * *

బంగారు బొమ్మలా ఉన్న ఓ అమ్మాయిని వెంటబెట్టుకుని నర్సమ్మ రావడం చూసి ఆ వీధిలో ముగ్గులేసుకుంటున్న ఆడవాళ్ళు ఒక్క క్షణం అప్రతిభులైపోయారు. బొమ్మల్లా ఎవరు చేస్తున్న పనుల్లో వాళ్ళుండిపోయారు. కొందరి కళ్లు విచ్చు

కున్నాయి, చూపులు విప్పు కత్తులైనాయి మరికొందరి పెదిమలు విడివడ్డాయి. నరంలేని నాలుక లల్లాడాయి. చీపుళ్ల పట్టుకున్న చేతులు, పమిట చెంగుల్ని బొడ్లో దోపుకుంటున్న చేతులు, కళ్ళాపి చల్లుతున్న చేతులు, కదులుతున్న కాళ్ల, వంగి ఉన్న శరీరాలు, ముందుకు సాగిన మెడలు – అన్నీ అట్టే ఉండిపోయి,

అంతలోనే నర్సమ్మ కొరడాతో తమను ఝళిపించినట్లయి, కళ్లు కిందికి వాలి పోయాయి, పెదిమలు మూసుకున్నాయి. చీపుళ్ళు చకచక కదిలాయి, పమిట చెంగులు బొడ్లో దూరాయి, చేతులు కళ్ళాపి చల్లాయి, కాళ్లు పరుగులు పెట్టాయి, శరీరాలునిటారుగా నిలబడ్డాయి, మెడలు యథాస్థానాల్లోకి వచ్చేశాయి.

కానీ తులసి మాత్రం అందరిలా బెదరలేదు, అదరలేదు. రెండిళ్ళ అవతల




వరండాలో పిట్టగోడనానుకుని ఇంగ్లీషు నవల చదువుకుంటూ, ఆ ఇద్దర్నీ చూసి పుస్తకం మూసేసి, మెట్లు దిగి వీధిలోకి వచ్చి నర్సమ్మ వెనకాలే వాళ్ళ ననుసరించి నడవసాగింది.

"ఏవే పిల్లా.. నావెంట పడ్డావేమిటి?" అన్నది నర్సమ్మ వీధి మధ్యలో నిలబడి వెనక్కి తిరిగి చూసి.

"ఆ అమ్మాయెవరు మామ్మా?"

ఆ ప్రశ్నకు జవాబు కోసం ఇరవై జతల చెవులు ఆత్రంగా ఎదురుచూశాయి.

"నా మనవరాలే!" నర్సమ్మ గంభీరంగా, పెద్దగా అన్నది అందరికీ వినబడేట్టు.

"పట్నంలో బి. ఏ. చదివింది. తల్లి పోతే నా దగ్గరకు తెచ్చుకుంటున్నా"

ఆ తర్వాత ఆమె తన మనవరాలి చెయ్యిని ప్రేమగా నొక్కి, అమ్మలక్కల



వేపు తిరస్కారంగాచూసి "రావే పార్వతీ! ఇంకా ఇక్కడే నిలబడితే రాత్రికి నువ్వు వణ్ణం తినవ్. నరుడి కంటికి నాపరాయి బద్దలౌతుందంటారు" అంటూ పార్వతిని గుమ్మం దగ్గరకు తొందర తొందరగా నడిపించుకు వెళ్ళింది.

గుమ్మందాకా వచ్చిన పార్వతి ఆశ్చర్యంతో అవాక్కయిపోయింది.

గుమ్మాలన్నీ పసుపు రాసుకుని, బొట్లు పెట్టుకుని కళకళలాడుతున్నాయి. గుమ్మాలకు పైన మామిడి తోరణాలు కట్టారు. ఇల్లంతా రంగుల కాయితాలతో రకరకాలుగా అలంకరించారు. ఇంటి ముందు పువ్వుల రేకులతో 'వెల్‌కమ్' అంటూ ఇంగ్లీషులో డిజైన్ వేశారు నేల మీద. లోపలకు వెళ్ళగానే గోడమీద ఎదురుగ్గా పెద్ద పెద్ద అక్షరాల్లో 'అక్కయ్యకు స్వాగతం' అని రాసి ఉంది.

'మా... మ్మా...!నువ్వు నాతోనే వున్నావుకదా! ఇవన్నీ ఎవరు రాశారు? ఈ అలంకరణ ఎవరు చేశారు? ఇంత అందంగా ఎవరు స్వాగతం ఇస్తున్నారు' అన్నట్టు పార్వతి ముత్తవ్వవేపు తిరిగింది.

"నేనుకాదు. నాకీ పద్ధతులేం తెలీవు. ఉత్త పాతకాలపుదాన్ని! ఇదంతా దాని పనే అయివుంటుంది" అంది.

"ఎవరు?"

"ఇంకెవరూ... నీ చెల్లెలు ఆ కోతి"

"చెల్లెలా!" ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయింది పార్వతి. "ఏదీ? ఎక్కడా?" అన్నది వేయికళ్ళతో అటూ యిటూ చూస్తూ.

"ఇదిగో ఇక్కడ" అంటూ ఓ పద్నాలుగేళ్ళ పిల్ల హారతి తీసుకుని ఎదురైంది.

పార్వతి తనవేపుగా అడుగువేసి తనను దగ్గరకు తీసుకునేటంతలోనే "నీకోసమని గుళ్లో పూజ చేయించొస్తున్నా నక్కా! ప్రసాదం తీసుకో" అంటూ పూలూ-తులసీ చేతికిచ్చి ఓ అరటి పండును వొల్చి 'నీకూ, నాకూ ఫిఫ్టీ-ఫిఫ్టీ' అంటూ సగం పెట్టింది.

"ఆగాగు" అంటూ హడావిడిగా తులసి వాళ్ళమధ్యకు వచ్చింది. శ్యామల వేపు తిరిగి ఆమె తప్పునెత్తిచూపిస్తున్నట్టుగా అన్నది. "నీకూ, మీ అక్కకూ ఫిఫ్టీ ఫిఫ్టీ అయితే నా సంగతేమిటి!" అన్నది.

శ్యామల జవాబు చెప్పటానికి తటపటాయించిది. శ్యామల చేతిలో ఉన్న సహం అరటిపండును లాక్కుంటున్నట్టుగా తీసుకుని దాన్ని రెండు భాగాలు చేసి ఒక భాగం తన నోట్లో వేసుకుని రెండో సగం శ్యామలకు తిరిగిచ్చేసింది. "అర్థమైందా శ్యామలా? ఉయ్‌ఆర్ త్రీ! ఏం మామ్మా.... అట్లా నిలబడిపోయినా వేమిటి ? ఇంట్లోకివెళ్ళి కాళ్లూ చేతులూ కడుక్కుని కాస్త కాఫీగ్లాటా పట్టుకొస్తే మేం ముగ్గురం తాగుతాంకదా?" అన్నది చొరవగా.

పార్వతి శ్యామలవేపు తిరిగి ఎవరన్నట్టుగా కళ్ళతో అడిగింది. అదిచూసి తులసి పెద్దగా నవ్వింది.

"ఈ ధనాధన్ తులసిని గురించి నువ్వు మీ చెల్లెలు శ్యామల్నడగక్కర్లా! నన్నే డైరెక్టుగా అడగొచ్చు. నా పేరు తులసి! నీలాగే నేనూ బి.ఎ. పాసయ్యా! యం.ఎ.కు అప్లయ్ చేశా! నీలాగే నాకూ నాన్నలేడు. అమ్మ ఒక్కత్తే ఉంది. నో సిస్టర్స్ అండ్ బ్రదర్స్! మా అమ్మకేమో నాకు పెళ్ళి చేసెయ్యాలని, నాకేమో చదువుకుని పెళ్లి చేసుకోవాలని!




ఊళ్ళో అమ్మాయిలకు నేనంటే జెలసీ, అబ్బాయిలకు భయం. నా జోలికి ఎవ డొచ్చినాసరే ధనాధన్ వాడి దవడ పగిలి పోవల్సిందే! "ఓసేవ్ నువ్వు మగరాయు డివే' అంటుంది మీ మామ్మ నన్ను. 'మామ్మా, నేను మగరాయుణ్ణయితే మరి నీ సంగతేమిటి? నువ్వన్నా ఈ ఊరూ వాడా దడుసుకుంటారుగదా?' అంటా న్నేను. అంచేత...."

నర్సమ్మ అప్పుడు కలగజేసుకుంది. "ఓసేవ్ తులసీ! ఇంకా మేం ఇంట్లో అడుగైనా పెట్టలేదు. అప్పుడే తగలడ్డావ్ నువ్వు. పార్వతిని కాస్త విశ్రాంతి తీసు కోనీరాదూ?" అంది.

"చిన్న పిల్లలం మాకు విశ్రాంతేవిటి? నువ్వు అలసిపోయుంటావు. పాపం. వెళ్లు వెళ్లు లోపలికి. ఓసేవ్ శ్యామలా–నువ్వూ వెళ్ళవే లోపలకు. వెళ్ళి మామ్మకు సహాయంచెయ్. ఈలోపల నేను పార్వతిని పరిచయం చేసుకుని..."

పార్వతి తల అడ్డంగా తిప్పింది. "మీకు పరిచయం చేసుకోడం అయి పోయిందిగా! ఇహ నాపరిచయం అంటారా, అదేం పెద్ద విశేషం కాదు. అసలు నాలో ఏ ప్రత్యేకతలూ లేవు. అంచేత నన్ను లోపలకు వెళ్ళనివ్వండి. నన్నూ మా మామ్మకు సాయం చెయ్యనివ్వండి!"

"చేస్తే చెయ్! మధ్యలో నాకేం? కానీ అదేవిటే...నన్ను మీరూ మీరూ అంటు న్నావ్? ఏం మామ్మా...అట్లా పిలవడం ఏవన్నా బావుందా?"

"అవునే పార్వతీ! ఎంత నోటి దురుసు పిల్లైనా, అదికూడా నాకు మీవంటిదేనే. అంచేత..."

"ఉయ్ ఆర్ త్రీ సిస్టర్స్! ధనాధన్ నా పాయింట్ నెగ్గింది. సో పార్వతీ..నేను మళ్ళీ వస్తాను. అంతవరకూ సెలవ్" తులసి వెళ్ళబోయింది.

"కాఫీ తాగి వెళ్దువుగాని ఉండవే!" లోపలకు వెళ్తూ నర్సమ్మ అన్నది.

"ఓకే మామ్మా! నే వద్దంటే నీకు కోపం వస్తుంది. నీకు కోపం వస్తే నాకు భయం వేస్తుంది. నాకు భయం వేస్తే మా అమ్మకు బాధ కలుగుతుంది. మా అమ్మకు బాధకలిగితే నీకు కోపం వస్తుంది"

"నోర్మయ్యవే!" అంటూ నర్సమ్మ లోపలకు వెళ్ళిపోయింది.

ఆ తర్వాత కాఫీలు తాగుతూ తులసి, పార్వతి, శ్యామల ఆవిషయాలూ ఈ విషయాలూ మాట్లాడుకున్నారు.

తులసి పార్వతికి మరింత దగ్గరై ఊళ్ళో కబుర్లన్నీ చెప్పింది. అందరి గోత్రాలూ ఏకరువుగా చెప్పింది. పార్వతి మాత్రం తన బోర్‌స్టల్ స్కూల్ విషయం చెప్పలేదు. తులసి మాటల ప్రవాహంలో ఆ అవసరమూ రాలేదు. మాట్లాడి, మాట్లాడి అలిసిపోయి మరో కప్పు కాఫీ తాగి మళ్ళీ వస్తానని చెప్పి తులసి వెళ్ళి పోయింది.

వెళ్తూ వెళ్తూ చేతిలోని నవల పార్వతి ఒళ్ళో పడేస్తూ "చదువుకో. కొంత కాలక్షేపం" అన్నది ఆప్యాయతతో.

"చేజ్, రాబిన్స్ వగైరాల్ని ఇదివరకే చదివేశాను. లేటెస్ట్ ఉంటే పట్టా!"

తులసితెల్ల మొహం వేసింది.

"ఇప్పటికి నాకు సమ ఉజ్జి దొరికింది" అన్నది తెప్పరిల్లి. "వస్తా. దొరికినవన్నీ తెస్తా, నీకిస్తా" అంటూ వెళ్ళిపోయింది.

శ్యామల అక్కను తీసుకుని ఇల్లంతా చూపించింది. బెడ్‌రూంలో తన తల్లి

ఫొటోను చూసి, కొద్ది క్షణాలు నిలబడి పోయింది పార్వతి.

““ఏవే ! అమ్మ నీకు జ్ఞాపకం ఉందిటే! ఆర్ద్రంగా చెల్లెల్ని అడిగింది పార్వతి.

“లీలగా జ్ఞాపకం అక్కా” అన్నది శ్యామల.

‘అమ్మ పోయేటప్పటికి నాకు ఏడేళ్ళగా!’. పార్వతి తనలో తానే అనుకుంది ‘అంటే నేను బోర్‌స్టల్ స్కూలుకు వెళ్లిన ఓ సంవత్సరానికల్లా అమ్మ పోయుంటుంది. బహుశః నా దిగులోనే పోయింటుంది’ అనుకుంటూ కళ్ళలో నీళ్ల చెల్లెలు చూడకుండా తుడుచుకుంది.

నర్సమ్మ తన పెద్ద మనవరాలికి దగ్గరుండి తలంటిపోసింది; “నా కడుపు చల్లగా...నా బొంద, నాకు కడుపు



చలువెక్కడుందీ? తొమ్మిది మందిని కంటే మీ అమ్మ ఒక్కత్తే మిగిలింది! నీ తల్లి కడుపు చల్లగా అననేకూడదు నేను. అయినా అదిమాత్రం ఉంది కనుక, అటు కట్టుకున్నవాడూ దూరమై, ఇటు కన్న వాళ్ల దగ్గర లేక ఎంత నరకం అనుభ వించిందో నా తల్లి. మీ అమ్మ ఆయుష్షు, నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్లు హాయిగా బతుకు తల్లీ" అంటూ నలుగు పెడ్తూ దీవించింది.

బకెట్లో ఉన్న వేన్నీళ్ళలో చన్నీళ్ళను పాళంగా కలుపుతున్న శ్యామల మొహం చిట్లించుకుంటూ అన్నది. "నూరేళ్లు అనకే మామ్మా!"

"అదేమిటే పిచ్చిమొహమా? ఎందుకనొద్దు?"

"నూరేళ్లు బతికినవాళ్ళను చూడు.



కళ్లుపోయి, కాళ్ళు వంగక, చెవులు విన బడక, పళ్ళురాలిపోయి, మాట తడబడి, నీరసంగా మూల్గుతూ మూలుగుతూ మూలనున్న మంచంలో నుంచి లేవలేక... ఎందుకే మామ్మా అట్లా బతకడం?"

"నీదుంప తియ్య. అయితే నన్ను ముందే సాగనంపేట్టున్నావ్ నువ్వు" అంటూ చిన్న మనవరాలిని అవతలకు తరిమేసి, పార్వతికి బుద్ధులు చెబుతూ నీళ్ళుపోసింది నర్సమ్మ.

భోజనాల దగ్గర నర్సమ్మ ఆప్యాయత పార్వతికి మరింత భారం అనిపించింది. చేసిన పదార్థాలన్నీ ఒకటికి రెండుసార్లు వడ్డించింది. కొసరి కొసరి తినిపించింది.

"వద్దే మామ్మా! ఇహ తినలేను. ఇప్పటికే గొంతుదాకానాచేత తినిపించావు"

"ఓసేవ్! నీ నాగరీకం మాటలు నాకు చెప్పకు. 'మూడు కంచాలు తినాలి, ముఫై పుంజీలు వడకాలి ఆడది' అన్నారు. నీ నాజూకు తిళ్లు నాకు పనికిరావు"

"మామ్మా! ఎంత మంది పిల్లల్ని కనాలో చెప్పడం మర్చిపోయారు" శ్యామల ఎగతాళిగా అన్నది.

"ఓసేవ్ కోతీ! ఈసారి పళ్ళికిలించా వంటే నీ నాలుక తెగ్గోస్తా ఏమను కుంటున్నావో" అంటూ శ్యామల తలమీద ఒక్క మొట్టికాయ మొట్టి, "పుస్తకాల్లో నేర్చుకున్న ముక్కల్ని నా ముందరన్నా, నేను చెప్పిందానికి కాదన్నా నాకు బావుండదు. ఆ....! ఇక్కడంతా నా ఇష్టా రాజ్యంగా సాగాల్సిందే! నేను చెప్పినట్టు మీరు వినాల్సిందే! వయసులో ఉన్న ఆడపిల్లలు ఎంత జాగర్తగా ఉండాలో మీకేం తెలుసు? మిమ్మల్నో అయ్యచేతిలో పెట్టేదాకా నాకు ఎంత ఆరాటంగా ఉంటుందో మీరేం ఊహించుకోగలరు?"




ఈ విషయం మీదనే ఆరాత్రి భోజనాలయిపోయింతర్వాత దొడ్లో బాదం చెట్టు నీడలో వెన్నెల గళ్ళల్లో మంచాలు వేసుకుని పడుకున్న తర్వాత, ఆ ముగ్గురి మధ్యనా ఓ వివాదం చెలరేగింది.

"లక్ష చెప్పండి నేవినను. చదివిన చదువు చాలు. త్వరగా ఓ కులమింటి కోతిని తెచ్చి పార్వతికి ముడిపెట్టేస్తాను" అన్నది నర్సమ్మ ఖండితంగా.

"అట్లాగే! ఓ కోతిని తెచ్చే అక్కకు ముడెట్టు. అది మళ్ళీ నాన్నలాగా దేశం మీదకు పారిపోకుండా చూద్దాంలే" అన్నది శ్యామల కోపంగా.

ఆ మాట చురుక్కుమని నిప్పులా తాకింది నర్సమ్మను. "ఓసోసి....కన్న తండ్రినిబట్టుకుని ఎంతలేసి మాటలంటుం న్నావే?" అంటూ బుగ్గలు నొక్కుకుంది.

"కన్నతండ్రయ్యేది, ఆ బ్రహ్మదేవు డయ్యేది-తప్పు తప్పే మామ్మా! మమ్మ ల్నిట్లా గాలికొదిలేసి తన మానాన్నతాను పోయాడే, ఆయన మీద గౌరవం ఎందు కుండాలి మామ్మా? నువ్వే ఆదుకోకపోతే మేం ఏమైపోయేవాళ్ళం" శ్యామల గొంతు వణికింది.

నర్సమ్మ శ్యామలను అక్కున చేర్చు కుంది. "ఏం పర్వాలేదు. అన్నింటికీ ఆ దేవుడే ఉన్నాడు. ఇంతకీ ఏమిటి కథ.




నన్ను మునగచెట్టెక్కిస్తున్నావ్? ఏం కావాలిట?"

"ఏవీ అక్కర్లేదు. నా చదువాపకు. అక్కయ్యను యం. ఏ. చదివించు"

నర్సమ్మ ఖస్సుమంది. "యం.ఏ.లూ వద్దు, గిమ్మేలూవద్దు. చదివింది చాలు. పెళ్ళిచేసి అత్తారింటికి పంపించేస్తే అదే పదివేలు"

పార్వతి చేసిన సంజ్ఞ సందుకుని శ్యామలే అన్నది మళ్ళీ. "ఏం మామ్మా చదువుకుంటే?"

"ఏమా? తిన్ని వూళ్ళో సంగతి వేరూ, బయటకు వెళ్ళి చదువుకోడం వేరూ! లాంటీ వేట్టికి ఉరుకులు పరుగుల్తో రేవు చేరుకోవాలి. ఆలాంచీలో అడ్డమైనవాళ్ళూ ఎక్కుతారు. ఒక్కోసారి నుంచోటానికూడా చోటుండదు. తొడతొక్కిడే అనుకో. సర్దుకుని నుంచోవాలి. ఇహ కాలేజీకి వెళ్ళాంతర్వాత ఆ మగపిల్లల వెకిలి చూపులు, ఎంగిలి మాటలు... వాటిని భరించాలి. ఎందుకీ బాధంతా? హాయిగా పెళ్ళిచేసేసుకుని సంసారంలో స్థిరపడితే పోలా? వచ్చే ఏటికి లక్షణంగా బిడ్డనెత్తుకోవచ్చు"

"అప్పుడు నువ్వు మామ్మమ్మవు కావచ్చు" శ్యామల వెక్కిరించింది.

పార్వతి మాత్రం సీరియస్‌గా అన్నది "మామ్మా ! నువ్వు కలలు కనకు"

"ఏం... ఎందుకనీ?"

"తెలిసినవాడెవడూ నాకు తాళికట్టడానికి ముందుకు రాడు"

"అందుకు తగినవాడే వస్తాడు?" నర్సమ్మ ఖరాఖండిగా అన్నది.

"అట్లా వచ్చేవాడు నాకక్కర్లేదు"

"మరి ఎటువంటివాడు కావాలో?" నర్సమ్మలో ఆతృత.

"వెడద కన్నులవాడు, ఎగుభుజమ్ములవాడు.." శ్యామల గొంతు విప్పింది.

పార్వతి దిండుతో కొట్టబోయింది.

"తెలిసేట్టు చెప్పవే నీ దుంపతెయ్యా" నర్సమ్మ విసుక్కుంది.

"నాలుగంకెల్లో జీతం వుండాలి. కదిల్తే కారుండాలి. కూర్చోడానికిసోఫాలుండాలి. కూరలు తేవడానికో ప్యూను, పిల్లల్నెత్తుకోడానికో ప్యూను, కాలింగ్ బెల్ ఆన్సర్ చేయడానికో ప్యూను – ఇట్లా వేరు వేరు పనులకు వేరే వేరే ప్యూన్లుండాలి. హీటర్, గ్రైండర్, త్రీఇన్ వన్ టేప్‌రికార్డర్, వీడియో – ఇవి సరేసరి. క్రికెట్ ఆడకూడదు కానీ కామెంటరీ అంటే మాత్రం పిచ్చ మోజుండాలి. సైడ్ విస్కర్స్, గురూ షర్ట్, పాయింటెడ్ బూట్స్‌లో స్టైయిల్ చూస్తే హలో అనేట్లుండాలి" శ్యామల అన్నది.

"మామ్మా! అవన్నీ దాని కలలు. ఆ రిక్వైర్‌మెంట్స్ నాక్కాదు" పార్వతి అన్నది.

"అయితే నీకేం కావాలిట?"

"చదువు"

"వెధవ చదువు. దాని సంగతి మర్చిపో!" నర్సమ్మ నిద్రనభినయించి, అటు తిరిగింది.

మర్నాటి పొద్దున్న శరభలింగం రాకతో పరిస్థితే మారిపోయింది. అతనో టిపికల్ విలేజి టౌట్. తనకు నామం పెట్టుకుంటాడు ఇతరులకు కనిపించేట్టు. ఇతరులకు తను నామం పెడతాడు వాళ్ళకే కనిపించకుండా! అతను వస్తూనే విషయంలోకి వచ్చేశాడు కుర్చీ మీద కూడా కూచోకుండా, మంచినీళ్ళైనా పుచ్చుకోకుండా.

 చతుర ... 33

"అమ్మా...నర్సమ్మా! నువ్వు నిన్న వస్తూ ఓ పెళ్ళికూతుర్ని వెంటబెట్టుకుని వచ్చావని తెలిసింది. శుభం! అవునమ్మా శుభం జరిపించటానికే వచ్చాను. లక్షణ మైన సంబంధం" అంటూ సంబంధం వివరాలు చెప్పడం మొదలు పెట్టాడు. మధ్యలో ఆపి, పార్వతిని చూసి కాస్సేపు ఆమె అందాన్ని ప్రశంసించాడు. చివరకు వరుడుకి మూడో పెళ్ళనీ, మొదటి సంబంధానికి ముగ్గురు పిల్లలూ, రెండో సంబంధానికి నలుగురు పిల్లలూ ఉన్నారనీ, పార్వతి గనుక అతణ్ని చేసుకుంటే ఆమె కడుపు పండి తప్పకుండా ఆమె కూడా ఓ అయిదుగురు బిడ్డల తల్లన్నా అవుతుందనీ అన్నాడు. యాభై ఎకరాల లంక పొలం, కొబ్బరి తోటలు, అరటి తోటలు, చెరకుతోటలు ఉన్నాయన్నాడు.

శరభలింగాన్ని అంతా చెప్పనిచ్చింది నర్సమ్మ. "చూడు లింగం! ఆ మూల నున్న దేవిటి?" అన్నది చీపురును చూపిస్తూ.

"చీపురు" అన్నాడు శరభలింగం ఎందుకో అన్నట్టు.

"ఉత్త చీపురు కాదు...కొత్త చీపురు. దేహశుద్ధికి బాగా పనికొస్తుంది" అన్నది పళ్ళు పలుకుతూ.

శరభలింగం భయపడ్డాడు. అయినా మేకపోతు గాంభీర్యంతో అన్నాడు. "పుణ్యానికి పోతే పాపమంటారు దీన్నే!"

"ఇదిటయ్యా పుణ్యకార్యం? దౌర్భాగ్యుడా" నర్సమ్మ విరుచుకు పడింది. "చిదిమి దీపం పెట్టుకోవచ్చు నా చిట్టి తల్లిని! ఏ మూడో పెళ్ళివాడికో ఇచ్చి దాని గొంతు కోయాల్సిన దౌర్భాగ్యం నాకేం పట్టలేదు. వెళ్ళు వెళ్ళు"

"చూడు నర్సమ్మా! కాళ్ళ దగ్గర కొచ్చిన సంబంధాన్ని కాదంటున్నావ్! ఇక ఆ అమ్మాయికి సమ్మంధాలే రాక పోవచ్చు"

"రాక పోతే పోనీవయ్యా! సుబ్బరంగా చదువుకుంటుంది. హాయిగా ఉద్యోగం చేసుకుంటుంది!"

శరభలింగం పెడీపెడీ నవ్వాడు. "చదువా? వయసొచ్చిన ఆడపిల్లకు! హవ్వ! నీకు తెలీదు తల్లీ...నీకు తెలీదు. కాలేజీ అంటే ఏవిటనుకున్నావు? అది ప్రేమ పాఠాల విడిది. ముందు అబ్బాయిలూ, అమ్మాయిలూ సిగ్గుపడుతూ ఒకరి వేపు మరొకరు చూసుకుంటారు. తర్వాత సన్నగా నవ్వుకుంటారు. ఆ తర్వాత కొంటె మాటలతో జోల పాటలు పాడుకుంటారు. ఆ పాటలు ఆటల్లోకి దారి తీస్తాయి. ఆటలు కౌగిలింతలుగా మారుతాయి. కౌగిలింతలు వెవిళ్ళకు దారితీస్తాయి. ఆ తర్వాత ఏముందీ – ఇంతే సంగతులు!!"

"నా పిల్ల అటువంటిదేం కాదు. పుటం పెట్టిన బంగారం అది"

"అందరి పిల్లలూ బంగారమే తల్లీ! ఇత్తడి అవునో కాదో తెలిసేది ఇరుకున పడ్డప్పుడు కదా?"

నర్సమ్మ ఖయ్యిమంది. "నా పిల్ల సంగతి నాకు తెలీదటయ్యా శరభలింగం? పెద్దమనిషివి కదా అని ఇంత సేపూ మాట్లాడాను. వెళ్ళు వెళ్ళు. ఇటుపై నా గుమ్మం తొక్కకు. వెధవ సంబధాలు తీసుకురాకు!"

శరభలింగం ఇంకా ఏదో మాట్లాడ బోయాడు. "అది కాదు నర్సమ్మా! నా మాట విను. లంకంత కొంప, వెనక రెండు మూడు ఎకరాలు...."

"నీ కొంప వద్దు, లకారాలూ వద్దు

ఇప్పుడసలు మా అమ్మాయికి పెళ్ళే చెయ్యనయ్యా! వెళ్ళు వెళ్ళు. అది లక్ష ణంగా చదువుకుంటుంది. అంతే. ఆ!"

శరభలింగానికి నెత్తిన గుడ్డ వేసుకుని వెళ్ళక తప్పలేదు. శరభలింగం చేసిన మేలుకు, "థాంక్యూ మిస్టర్ లింగం!" అంటూ పార్వతిని కౌగిలించుకుని "మా అక్కయ్య యం. ఏ. స్టూడెంటు అయెనే" అంటూ శ్యామల పాట మొదలు పెట్టింది.




అప్పుడే విచ్చిన విరజాజులను మాలగా కట్టి జడలో తురుముకుని, నొసటన అందంగా తిలకం దిద్దుకుని, సోగకన్నుల చివర సుతారంగా చిటికెనవేలి గోరుతో కాటుక సద్దుకున్ని, దూమెరుగ్గా పౌడరు రాసుకుని, కట్టుకున్న నైలెక్స్ చీర కుచ్చెళ్ళు మరొక్కసారి సవరించుకుని, అద్దంలో చూసుకుంటూ "మామ్మా! వెళ్ళొస్తా" అంటూ కేకేసింది పార్వతి.

"జాగర్తమ్మా! క్షేమంగా వెళ్ళి లాభంగా రా! చెప్పినవన్నీ జ్ఞాపకం ఉంచుకో" దొడ్లో నుంచి నర్సమ్మ కంఠం జవాబుగా వినిపించింది. "అటూ ఇటూ దిక్కులు చూస్తూ నడవకు" అంది మళ్ళీ.

"అట్లాగే" పార్వతి చెప్పుల్లో కాళ్ళు పెడుతూ అన్నది.

"మాష్టర్లు చెప్పేది బుద్ధిగా విని జాగర్తగా నోట్సు రాసుకుని, లాస్ట్ బెల్ కొట్టగానే సరాసరి ఇంటికొచ్చేసెయ్. అక్కడా ఇక్కడా తిరుగుతూ తాత్సారం చెయ్యకు. బాంపీ తప్పిపోయిందంటే మళ్ళీ నానాబాధా పడవలసి వస్తుంది"

"చెయ్యను" చీర చెంగు భుజంనిండా కప్పుకుంటూ బయటకు నడవబోయింది పార్వతి.

"బయట రోడ్డు మీద పోకిరీ వెధవలుంటారు. రకరకాలుగా మాట్లాడు తుంటారు. వెకిలి వేషాలు వేస్తుంటారు. నువ్వు ..."

పార్వతి వెనక్కు తిరిగివిసుగ్గా అన్నది- "ఏవిటి మామ్మా... ఈ అప్పగింతలు! నేనేమన్నా అత్తాల్లో బిడ్డనా?"

వంటింటి తలుపు వెనగ్గా కిలకిలమని నవ్వు. "ఓడిపోయింది...ఓడిపోయింది. మా అక్కయ్య ఓడిపోయింది. నన్ను కనుక్కోలేక పోయింది" అంటూ పుస్తకాల సంచీ భుజాన తగిలించుకుని, చప్పట్లు కొడుతూ బయటకు పరుగెత్తు కుంటూ వచ్చి పార్వతిని వాటేసుకుని గిరగిరాలు తిరిగింది శ్యామల. ఆమెతో పాటు ఆ అమ్మాయి పొడుగైన జడా గిరగిరాలు తిరిగింది. గాలికి ఆ అమ్మాయి కట్టుకున్న అద్దాల పరికిణీ ఎగురుతూ, వెలుగు పడినప్పుడల్లా అద్దాలు తళతళ లాడుతున్నాయి. యౌవనం అంకురిస్తున్న ఆమె వక్షస్థలం మీద పమిట సరిగా అమరక కిందకు జారిపోతోంది.

పార్వతి తన చెల్లెల్ని భుజం పట్టుకుని ఆపింది. "చూడూ, కుచ్చెళ్ళన్నీ ఎట్లా నలిపేశావో" అంటూ చిరుకోపం ప్రదర్శించి మరోసారి వాటిని సరి చేసుకుంది. శ్యామలకు పమిట చెంగు సరిచేసి, ముంగురులు సర్దింది. "పెద్ద దానివవుతున్నావ్, ఈ అల్లరేటే?"

అంటూ ప్రేమగా అని, "సరిగ్గా మామ్మ లాగే మాట్లాడావు కదుటే! ఎక్కడో దొడ్లో వున్న మామ్మ వంటింట్లో నుంచి ఎట్లా మాట్లాడుతుందా అని ఆశ్చర్య పడ్డాననుకో" అని చేతినున్న గడియారం వేపు చూసుకుని, "పదపద. ఇంకా అలస్యం చేస్తే నువ్వన్నట్టు ఆ లాంచీ అందకపోయినా అందకపోవచ్చు" అంటూ శ్యామల చెయ్యి పుచ్చుకుని, గుమ్మం దాటి బయటకు వచ్చి, వీధి వాకిలి తలుపులు రెండూ దగ్గరకు వెయ్య బోయింది. "నేనేస్తాలెండి, మీరు నడవండి" అన్నది అప్పుడే చేతులు తుడుచుకుంటూ అక్కడకు వచ్చిన నర్సమ్మ. నడుస్తున్న ఆ ఇద్దర్నీ చూస్తూ ఒక్క క్షణం ఆమె అక్కడే నిలబడింది. పార్వతి సన్నగా, శలాకలా మెరుపు తీగలా ఉంది. శ్యామల బొద్దుగా, ముద్దుగా ముద్దమందారంలా తన అక్క భుజాల వరకూ వస్తోంది.

నర్సమ్మ వెనక్కు తిరిగి ఆ పిల్లల తల్లి పటం ఉన్న గదిలోకి వచ్చింది. ఆ పటం వేపు చూస్తూ కళ్ళు తుడుచుకుంటూ అన్నది—"ఓ సేవ్ జానకీ! బతికినన్నాళ్ళూ నీ జీవితం బండల పాలే అయింది. కనీసం నీ పిల్లల్నయినా చల్లగా చూడమని ఆ దేవుడితో అక్కణ్ణుంచే మొర పెట్టుకోవే!"

వీధిలో నడుస్తున్నంత మేరా వెలుగులు విరజిమ్ముతూ నడుస్తున్న వాళ్ళి ద్దర్నీ చూస్తూ గడప ఇవతల గుట్టుగా కాపరం చేసుకునే ఆడవాళ్ళు గుసగుస లుగా చెవులు కొరుక్కున్నారు.

"ఎవరంటావ్ ఆ అమ్మాయి? ఆ నడకా, ఆ షోకూ.... పెళ్ళయితే ముగ్గురి పిల్లల్ని నెత్తికెత్తుకొనేది" అంటూ దీర్ఘం తీసింది నలుగురు బిడ్డల ఓ నడి వయసు ఇల్లాలు.

"నర్సమ్మ పెద్దమనవరాల్ట! పట్నంలో నుంచి వచ్చిందట! కాలేజీలో చదువుకోడానికి వెళ్తున్నదట!" అన్నదో వృద్ధనారి.

"ఇన్నాళ్ళూ లేనిది ఇప్పుడెందుకు తీసుకొచ్చిందో ఆ నర్సమ్మ ఈ గజ్జెల గుర్రాన్ని?" అన్నది ఓ అత్తగారు.

"ఏదో ఒక కారణం ఉంటుంది. అమ్మో ఆ నర్సమ్మా... ఉట్టి పుణ్యానికి ఏపనీ చెయ్యదు. అయినా ఆవిడ సంగతి మనకెందుకులెండి, ఆవిడ నోట్లో నోరు పెట్టలేం" అన్నది రెండు మూడేళ్ళయి కాపురానికి వచ్చినా ఇంకా పిల్లా పాపా కలగని ఓ కోడలు. ఆ వీధిలో ఉన్న ఆడ వాళ్ళు ఆవిధంగా నోటికి పనిజెపితే, వయసులో వున్న కోడెకారు కళ్ళకు పని జెప్పారు.

"ఆ అక్కా చెల్లెళ్ళలో ఎవరు బావుంటుందంటావ్?" మర్రిచెట్టు కింద, రచ్చబండమీద పేకాడుతున్నారు కొందరు. వాళ్ళలో ఒకడు చార్మినార్ కాలుస్తున్నాడు. వాడి మెడలో పులిగోరు పతకం ఉంది. వాడి కళ్ళలో కైపు.

"దేనికి? వంట గదికా— పడగ్గదికా?"

సీక్వెన్స్ ఆడుతున్నవాళ్ళు నవ్వారు. కొడమీద గడ్డితో తాడు పేనుకుంటూ దూరంగా కూచున్న ఓ గడ్డపాయన అన్నాడు. "సమూకొనే ఆడపిల్లల్ని అట్టా గంటే కళ్ళుపోతాయొరే!"

"ఓస్సోసి! ఆ ముసిల్దాని పడుసు సంటల్మీద అంత సొసుభూతేంట్రో నీకు?" ఓ బట్టతలవాడు వెక్కిరించాడు. "ఆళ్ళమీద పేణంగాని సిపసివ లాగ తుందేటి?"

"ఛూక్! నోటికెంతొత్తే అంతనేయ
తమే... ఏం జన్మరా మీది? ఆళ్ళద్దర్నీ
చూత్తంటే అపరంజి బొమ్మల్లానేరంట్రా-
మీ నోట్లో పురుగులు పడిపోను" అతను
పనినంత వరకూ తాడూసు పోగేసుకుని
అక్కడనుంచి లేచి వెళ్ళిపోయాడు.

"అబ్బో! సత్తెకాలపు సత్తెయ్యా"
రెక్కిరిస్తూ వాళ్ళు తమ ఆటలో తాము
మునిగిపోయారు.

పార్వతీ, శ్యామలా సందుదాటి, చెరువుదాటి, వేణుగోపాలస్వామి ఆలయం దాటి, అమ్మవారిగుడిదాటి మలుపు తిరిగారు. అప్పుడన్నది శ్యామల-"విన్నావా అక్కా ఆ కుక్కల మొరుగులు!"

"మొరిగే కుక్కలు కరవ్వులే. పద" చెల్లెలి తలను నిమురుతూ ప్రేమగా అన్నది పార్వతి. "అదిగో, మీ స్కూలు దగ్గరకు వచ్చేశాంగా, ఇహ నువ్వు




వెళ్ళిరా. నేను రేవు దగ్గరకు వెళ్తా!"

శ్యామల సరేనని వెళ్తూ వెళ్తూ టాటా చెప్పింది అక్కయ్యకు. "టా టా" అన్నది పార్వతి చిరునవ్వుతో.

"చెల్లెలికి టాటా చెప్పడం చాలు కానీ, కాస్త ఇటుకేసి కూడా చూడు" వెనగ్గా వచ్చి పార్వతి భుజాల మీద చేతులు వేస్తూ అన్నది తులసి.

"హలో– నువ్వా?!" పార్వతి తొట్రుపాటు పడుతూ అన్నది.

"ఆహా నేనే... తులసిని! ఎవరనుకున్నావేమిటి? ఎనీ బోయ్ ఫ్రెండ్?"

"యూ సిల్లీ" తులసి చెంప మీద ఓ చిన్న దెబ్బ వేసింది పార్వతి.

"మనం వెళ్తోంది కాలేజీకి" అన్నది హెచ్చరికగా.

"కళాశాలకూ, ప్రేమశాలకూ నాట్ మచ్ డిఫరెన్స్" తులసి చాలా తేలిగ్గా



అన్నదా మాటను. ఆమె చేతిలో ఓ ఇంగ్లీష్ నవలా, నోట్లో చూయింగ్ గమ్, పెదవులకు లిప్‌స్టిక్! కనుబొమ్మల్ని ట్రిమ్ చేసుకుంది. కాళ్ళకు ఇంతెత్తున హైహీల్స్‌తో టక్‌టక్‌మంటూనడుస్తోంది.

"ఎందుకే తులసీ... ఎప్పుడూ ఆ ఇంగ్లీష్ పుస్తకాలూ, ప్రేమను గురించిన ఆలోచన్లూ?" పార్వతి మందలింపుగా అన్నది.

"అమ్మా! నాకు జీవితమంటేనే ఓ బెడ్ ఆఫ్ డ్రీమ్స్! కాలేజీ అంటే నాకు ఓ ప్లెజర్ హౌస్"

"వెరీగుడ్! కలలు కనడం నీ వంతైతే, నువ్వు కాలుజారకుండా కాపాడుకోవడం నా వంతు అన్నమాట!"

తులసి గభాలున పార్వతి చెంపమీద ఓ చిన్న ముద్దు పెట్టింది. "దట్ మీన్స్-యూ ఆర్ మై కేర్ టేకర్ నంటావ్! ఓ.కే. ఒప్పేసుకున్నాను. ఇహ నుంచీ నా బరువు బాధ్యతలు నీవే! అమ్మా... కేర్ టేకరమ్మా! వినబడలేదా మరో ప్రపంచపు లాంచీకూత. తమరు తొందర తొందరగా అడుగులేసి మమ్మల్ని లాంచీ ఎక్కిస్తారా?"

పార్వతి అట్లాగేనన్నట్లుగా తలవూపి తొందర తొందరగా అడుగులేయ బోయింది. చీర కుచ్చెళ్ళు అడ్డం వచ్చి ముందున్న ఓ చిన్నరాయి తగిలి తడబడి తూలి పడబోయింది.

తులసి ఆమెను పట్టుకుని పకపక నవ్వింది. "కేర్ టేకరమ్మా.. టేక్ కేర్ ఆఫ్ యువర్‌సెల్ఫ్. నిన్ను చూస్తుంటే మా ఇంటికి వచ్చిన డాక్టర్తో నేనన్న మాటలు జ్ఞాపకం వస్తున్నాయి."

"ఏవిటే ఆ మాటలు?"

"నాకు జ్వరం వచ్చింది ఒకసారి. వద్దు వద్దంటున్నా మా డాడీ ఓ డాక్టర్ను తీసుకు వచ్చాడు. పిలకజుట్టూ, నామాలూ, తమాషాగా ఉన్నాడులే ఆయన. దగ్గుతూ వచ్చాడు. దగ్గుతూనే 'అమ్మాయ్! చెయ్యి ఇట్టా ఇయ్యి. నాడిచూడాలి?' అనబోయాడు. ఆ దగ్గులో మాటరాదే ఆయనకు. చివరకు దగ్గలేక దగ్గలేక ఏదో అనబోతుంటే– 'డాక్టరుగారూ! ముందు మీరు మందు వేసుకుని తగ్గిం తర్వాత రండి. పొండి' అంటూ నేను అవతల గదిలోకి పారిపొయ్యాను. ధనాధన్! ఆ డాక్టరుగారికి మనం ఇచ్చిన డోసు ఎంత స్ట్రాంగ్ అంటే, ఇంతవరకూ మళ్ళీ ఆయన మన గుమ్మం తొక్కితే ఒట్టు. దట్ ఈజ్ ధనాధన్ తులసి"

"పోవే, కబుర్ల పోగా" పార్వతి సర్దుకుని ముందుకు నడిచింది. తులసి నవ్వుతూ తన స్నేహితురాల్ని లాంచీ దగ్గరకు అనుసరించింది.

లాంచీ బొంయ్‌మంటూ కూత పెట్టింది. ఇంజన్ ధడ్ ధడ్ మంటూ చప్పుడు చేసింది. పొగ గొట్టంలో నుంచి గుప్పు గుప్పున పొగ వచ్చింది. గొలుసు అటూ యిటూ కదిలింది. తిప్పేవాడి చేతిలోకి చుక్కాని వచ్చింది. నీళ్ళలో గెడ వేసేవాడు లాంచీ అంచున నిలబడ్డాడు. లాంచీ కూతకు పక్షులు ఉలిక్కిపడ్డాయి. ఇంజనుమోతకు నీళ్ళలో చేపలు పరుగులు పెట్టాయి. గొట్టంలో నుంచి పైకి వచ్చిన పొగ గోదావరి నీళ్ళలో నీడలు సాగింది. గొలుసు కదలికతో పాటు నది అలలలలుగా కదిలింది. రేవులోకి పరుగు పరుగునవచ్చి జనం లాంచీ ఎక్కుతున్నారు. నడవలేక నడుస్తూ నడుస్తూ, తడబడుతూ, తడబడుతూ కిందపడి, కిందపడి పైకి లేవలేక అప్పుడప్పుడే





జూన్ మాసపు ఎండకు కొద్ది కొద్దిగా వేడెక్కుతున్న ఇసకలో చేతులు కాలి, అరికాళ్ళు కాలి అపసోపాలు పడుతున్నారు బావుసోటి ఇద్దరు ఆడవాళ్ళు. లాంచీ టాపుమీద కూచున్న మన్మధ మరి కొందరు విద్యార్థులతో కలిసి గోలగా అరుస్తున్నాడు. "క్రేన్ కావాలి! క్రేన్ కావాలి!"

"ఎందుకు?"

"మిసెస్ హిడింబనూ, మిస్ శూర్పణఖనూ పైకి లేవనెత్తడానికి!"

"అలాగా పాపం! మరి వాళ్ళుమంచాల మీద పడుకుంటే..?"

"మంచాల నడ్డి విరుగుతుంది!"

ఓ విద్యార్థి పాట అందుకున్నాడు. "పాతమంచం విరిగిపోతే కొత్తమంచం తెచ్చుకుందాం. కొత్త మంచం లేకపోతే పాతదే సరిచేసుకుందాం!" వాళ్ళ మాటలు, పాటలు, ఈలలు అన్నీ కింద ఆడవాళ్ళకు ప్రత్యేకించిన కంపార్టుమెంటులో కిటికీకి దగ్గరగా కూచున్న పార్వతికీ, తులసికీ కూడా వినిపిస్తూనే ఉన్నాయి. వాళ్ళతో కలిసి తులసికూడా నవ్వుతోంది. పార్వతికి నవ్వు రావడం లేదు.

"రైట్" అంటూ టిక్కెట్లు కోస్తున్న కాకిప్యాంటువాడు విజిల్ వేశాడు. ఆ విజిల్ వింటూనే, "ఆగవో" అంటూ దూరంనుంచి పరుగెత్తుకుంటూ వచ్చింది రత్తి. ఆమె చేతిలో ఓ ఖాళీ కూరలగంప ఉంది. అసలే జాకెట్ లోపల ఇమడలేని ఆమె స్తనద్వయం ఆయాసంవల్ల ఎగిరి ఎగిరి పడుతోంది.

"స్టాప్...స్టాప్!" అంటూ అరిచారు ఒకరు.

"తమరు స్టాపంటే స్టాపే!" కండక్టరన్నాడు వెటకారంగా. "దాని తాతగోరు వేయించిన లాంచీగందా ఇది. ఆకక్కపోతే తమకు కోపం రాదా మరి?"

ఇంతలో రత్తి వచ్చింది లాంచీలోకి రొప్పుతూ. "ఏం రత్తీ బావున్నావా?" అంటూ పలకరించాడు అతను ఆమె గుండెలవేపే సూటిగా చూస్తూ. అతని పేరు మన్మధరావు.

"ఏటోలే బాబూ, ఇట్టా ఉన్నా!" అన్నది రత్తి 'ఇట్టా' అన్నమాట వత్తి పలుకుతూ.

"మనువాడావంటగా... ఇట్టా ఉండక ఎట్టా ఉంటావులే?"

"ఆడదానికి మనువేకద బాబూ బతుకుపంట!"

మన్మధ వోరచూపుచూస్తూ అన్నాడు "బతుకుపంటో, కడుపు పంటోలే!"

ఆ మాటవిని రత్తి సిగ్గుపడ్డా అందరూ పెద్దగా నవ్వారు.

"పోండి బాబూ, మీరెప్పుడూ ఇంతే. ఆ ఇసయంమీదే తమకు మనసు" అంటూ రత్తి పార్వతి, తులసి ఉన్నచోటుకి వచ్చి వాళ్ళపక్కనే చతికిలబడింది. రత్తినే అనుసరిస్తూ వచ్చిన మన్మధ చూపులు పార్వతి వరకూ వచ్చి అక్కడ ఆగిపోయి ఆమెను నఖశిఖపర్యంతం చూశాయి. తర్వాత తులసివేపు తిరిగాయి. తులసిని క్యాజువల్‌గా, "మీ ఫ్రెండా?" అని ప్రశ్నించాయి.

"నర్సమ్మగారి మనవరాలు" ముక్తసరిగా పరిచయం చేసింది తులసి.

మన్మధ పార్వతివేపే చూశాడు తదేకంగా. "నైస్ టు మీట్ యూ!" అన్నాడు.

"ఊ" అంటూ ఉదాసీనంగా ఊరుకుంది పార్వతి.

"ఏవిటి మీ ఫ్రెండుకు ఇంగ్లీషు రాదా?" తులసిని అడిగాడు మన్మధ

హజం దెబ్బతిని.

"మా పార్వతి చదివిన బుక్స్ మీరూ, నేనూ కూడా చదివిఉండం ఇంగ్లీషులో, తెలుగులో ! మీ ఇష్టం, దేంట్లోనయినా సరే అడగండి– ధనాధన్‌మంటూ సమాధానం చెప్పేస్తుంది" తులసి గర్వంగా అన్నది.

పార్వతి ఆ సంభాషణ రుచించనట్టుగా అవతలి మొహమయి "తులసీ! ఇటు చూడూ" అంటూ నీళ్ళలో కదులుతున్న చేపల్ని చూపించింది. కదులుతున్న నీళ్లలో తెల్లగా, స్ప్రింజీల్లా ఉన్న చేపలు ముద్దలు ముద్దలుగా పైకివచ్చి ఆక్టోపస్‌లలాగా విచ్చుకుంటూ మళ్ళీ నీళ్ళ అడుక్కు వెళ్ళిపోతున్నాయి. దూరంగా నీళ్లల్లోనుండి బయటపడ్డ ఇసకపర్రల్లో తెల్లపూల రెల్లుగడ్డి మొలిచి ఉదయపు ఎండలో రాగి కలిపిన బంగారంలా మెరుస్తోంది. ఆకాశంలో రకరకాల రంగుల్లో, భంగిమల్లో దగ్గరవుతూ దూరమవుతున్న మబ్బులు, వాటి నీడలకింద రెక్కలు విప్పుకుని స్వేచ్ఛగా ఎగురుతూ పాటలు పాడుకుంటున్న పాలపిట్టలు. ఈ మనోహర దృశ్యాన్ని చూస్తున్నాయి పార్వతి కళ్లు.

ఇంతలో దూరంగా గెడవేసేవాడు ఓ పాటనందుకున్నాడు. ఆ పాట అర్థం ఇట్లా ఉంది–

"పల్లకీ మోసేది ఒకడు, పల్లకీలో కూచుని ముందుకుసాగేది మరొకడు. గెడవేసేది ఒకడు, రేవులో దిగిపోయేది వేరొకడు; భూమిని దున్నేది ఒకడు, ఫలసాయం పొందేది మరొకడు; భవనాలు నిర్మించేది ఒకడు, ఆ భవనాల్లో సుఖభోగాలనుభవించేది మరొకడు; పట్టు పురుగులునేసేది ఒకడు, వాటిపై పవళించేది వేరొకడు; వర్షం కురిసేది ఒకచోట, నీళ్ళుపారేది వేరొకచోట–ఈ ప్రపంచమే ఇంత. స్వేదం, నిర్వేదం ఒకడిదీ–భోగం, యోగం మరొకడిదీ!"

ఈ పాట వింటూ పడవ పూసుకెళ్తోంది. అలలు వెనక్కు జరుగుతూ లాంచీ ముందుకు కదులుతోంది.

"లంక రేవొచ్చింది. దిగండెహ!" పల్లెవాడొకడు తోటివారిని హెచ్చరించాడు. చింతపండు బుట్టలతో, చేపల తట్టలతో కొందరు దిగిపోయారు. కూరగాయల జంగిడీలతోమరికొందరు లోపలకు వచ్చారు. వాళ్ళకు వెనగ్గా తిలక్ వచ్చాడు.

పాయింటెడ్ షూస్‌లో, స్టెప్‌కట్ హెయిర్‌స్టయిల్‌లో, కళ్ళకు గాగుల్స్‌తో, గుండీ వొదిలేసిన గురూ షర్టుతో, చేతికి రేడియంతో షోగ్గా లోపలకు వచ్చాడతను. మన్మధనూ, మిగిలినవారినీ హలో అంటూ పలకరించాడు. తులసిని చూడగానే సంతోషంతో 'హౌడూయూడూ ?' అంటూ దగ్గరకు వచ్చాడు. పార్వతిని చూస్తూనే విష్‌చేస్తూ, "మీరు మా తులసి ఫ్రెండు అవునా?" అన్నాడు.

పార్వతి తలాడించి ఊరుకుంది.

"ఓ చిన్న సీక్రెట్ ! అంతదాకా రాకూడదూ? ప్లీజ్!" అన్నాడు తిలక్ తులసితో. తులసి పార్వతివేపు చూసి 'ఇప్పుడే వస్తా' అన్నట్టు కళ్ళతో సంజ్ఞచేసి డెక్‌మీదకు వెళ్ళింది.

"ఎక్స్‌క్యూజ్‌మి మన్మధా! జస్ట్ ఎ మినిట్. ఇప్పుడే వచ్చేస్తా" అంటూ తిలక్ తులసితో వెళ్ళాడు అవతలకు.

మన్మధ పార్వతివేపే చూస్తున్నాడు. పార్వతి నీళ్ళవేపే చూస్తున్నది. రత్తి మాట "ఆడదానికి బతుకుపంట మనువే కదు బాబూ?" అనేది ఆమె హృదయం





మీద మెత్తని సుతిలావచ్చి తాకుతోంది. ఆమె మనోదర్పణంలో ఆమె తల్లి జానకమ్మ బొమ్మ ఒక్కక్షణం ప్రతిఫలించి మాయమైంది.

"ఎక్స్‌క్యూజ్ మీ మిస్ పార్వతీ! అవును మీరు మిస్సేకదూ.. మిస్సేలెండి. మిమ్మల్ని చూస్తేనే తెలుస్తోంది. మిమ్మల్ని ఇదివరలో ఎక్కడో చూశానండీ! ఎక్కడ చూశానా అన్న లింక్ మిస్ అయిపోతోంది నా మైండ్‌లో. ఇందాకటినుంచి చచ్చిపోతున్నాను గుర్తుచేసుకోలేక! ఎక్కడబ్బా? మద్రాసులోనా? విశాఖపట్నంలోనా? తిరుపతిలోనా? హైదరాబాద్‌లోనా?"

పార్వతి ఉలిక్కిపడింది. ఆమె ఉలికిపాటును గమనించి కూడా గమనించనట్లుగా, "ఎక్కడో జ్ఞాపకం రావడం లేదండీ! ఎన్నో ఊళ్ళు తిరుగుతాను కదా? ఎంతమందో ఫ్రెండ్స్ నాకు!! ఎందర్నో చూస్తుంటాను. అయితే ఒకసారి చూసినవాళ్ళను తొందరగా మర్చిపోను. పైగా మీ వంటి అందమైనవారిని..."

పార్వతికి మొహం చెమటపట్టింది. పమిట కొంగుతో మొహం తుడుచుకుంటూ "లేదులేదు. నా మొహం మీకు తెలీదు. మనం ఎక్కడా కలుసుకోలేదు" అంటూ హాండ్‌బాగ్‌లోనుంచి ఓ నవల తీసి సీరియస్‌గా చదువుకొంటున్నట్టుగా అవతలకు జరిగి, మొహం పక్కకు తిప్పుకుంది.

"నిజంగానా...?" మన్మథ మెల్లగా అన్నాడు "మనం కలుసుకోలేదేమో! కానీ కలుసుకునుంటే మాత్రం ఇవ్వాళ రాకపోతే రేపైనా జ్ఞాపకం వచ్చి తీరుతుందిలెండి"

లాంచీ పట్నం రేవు చేరడానికి మూడో అడంకు దగ్గరకు వచ్చింది. ఏలల్లాడుతూ మరికొందరు వచ్చి ఎక్కారు. వాళ్ళందరి చేతుల్లోనూ పుస్తకాలున్నాయి. వాళ్ళల్లో శంకర్ పొడుగ్గా, బలంగా, నార్త్ ఇండియన్ కట్‌లో ఉన్నాడు. "దారియ్యండి బాబూ" అంటూ ఓ ముసలాయన వణుకుతూ, ఓ కర్రనాధారం చేసుకుని అడ్డబల్ల మీదగా కిందకు దిగబోయాడు. కాలు జారింది. 'అయ్యో' అంటూ ఆర్తనాదం చేసాడు.

ఆ ఆర్తనాదం విన్న పార్వతి ఒక్కసారిగా లేచి అడ్డబల్ల మీదుగా రెండడుగులు వేసి ఆ ముసలాయనను అందుకోబోయింది.

పైకెక్కుతున్న శంకర్ "ప్చ్‌ప్చ్!" అనుకుంటూ తన పాంటు తడుస్తున్నా లెక్క పెట్టకుండా నీళ్ళలోకి అడుగు వేసి ఆ వయోవృద్ధుణ్ని పడకుండాపట్టుకోబోయాడు.

అదే సమయంలో అతణ్ని పట్టుకోబోయిన పార్వతి చెయ్యి శంకర్ చేతిని పట్టుకుంది. ఒక చేత్తో ఆ ముసలాయనను, మరో చేత్తో పార్వతిని పట్టుకున్నాడు శంకర్. ఆ ఇద్దరి చేతుల్నీ ఒకేసారి పట్టుకుని పైకి లేచాడు ఆ ముసలాయన. "నా ఆయుష్షు కూడా పోసుకుని పదికాలాలపాటు చల్లగా ఉండండి మీ ఇద్దరూ" అంటూ ఆశీర్వదించి ఆయన వెళ్ళిపోయాడు.

శంకర్ నవ్వి, ఆమె చేయి వదిలి, మన్మథ పక్కకు వచ్చి చూస్తున్నాడు. అప్పుడే అక్కడకు వచ్చిన తులసి అన్నది ప్రశంసగా.

"ధనాధన్! అట్లా ఉండాలి యంగ్ మాన్స్ అంటే" అంటూ తిలక్‌తో "నువ్వూ ఉన్నావు తిండికి పెద్దవు, పనికి చిన్నవు" అన్నది కవ్వింపుగా.

"నా పనితనం అప్పుడే ఏం తెలిసింది నీకూ?" తిలక్ కన్ను కొడుతూ అన్నాడు.

అతణ్ని "యూ... నాటీ" అంటూ కొట్టబోయినట్టు నటించింది తులసి.

అతను వెళ్ళి మన్మథ, శంకర్‌ల వెనుక దాక్కున్నాడు.

పట్నం వచ్చేసిన సూచనగా పడవలో కలకలం ఎక్కువైంది. ముందుగా మగ పిల్లలు దిగబోయారు. "లేడీస్ ఫస్ట్" అంటూ శంకర్ వాళ్లని ఆపడానికి ప్రయత్నం చేస్తూ "మీరు దిగండి తులసి గారూ!" అన్నాడు సందుచేసి.

తులసి పార్వతిని తీసుకుని కిందకు దిగింది. రెండడుగులు వేసిం తర్వాత స్నేహితురాలితో అన్నది - "మంచి వాడులా ఉన్నాడు కదూ?"

పార్వతి నోటి ముత్యం రాల్చకుండా తల మాత్రం వూపింది అవునో కాదో తెలీనట్టు.




కాలేజీలో పి. జి. సెంటర్ వింగ్‌లో ప్రిన్సిపాలుగారి గది ముందు రెండు వరుసల్లో వేర్వేరుగా విద్యార్థినీ విద్యార్థులు నుంచుని వున్నారు.

"ఇక్కడ కూడా ఈ సెపరేషన్ ఏం బావోలేదు" అన్నాడు మన్మథ లేడీస్ లైన్‌వేపు చూస్తూ. మన్మథ ముందు శంకర్, వెనకాల తిలక్, ఆ వెనకాల సురేష్, జగదీష్, నరేష్, ప్రతాప్, ప్రసన్న – వగైరాలు మరో ఇరవైమంది ఆ వయసులో వాళ్ళే వున్నారు. విద్యార్థినుల వరుసలో పార్వతి, శ్యామలాంబ, రీటా, జాస్మిన్, హెలెన్, జగదీశ్వరి ఇంకో పదిమంది ఉన్నారు.

వాళ్ళ ముందు స్ప్రింగు డోర్స్ ఉన్నాయి. ఆ తలుపుల వెనక, రవంత దూరంలో ఓ టేబిల్ వుంది. ఆ టేబుల్ వెనకాల ఒక కుషన్ రౌండ్ ఛెయిర్ ఉంది. అందులో లావుగ, ఫ్రెంచి కట్ మీసాల్తో, బట్టతలతో, గోల్డ్ ఫ్రేం కళ్ళజోడుతో ప్రిన్సిపాలు కూచున్నాడు. టేబిలుకు ఇటు వైపున ఓ సింగల్ ఛెయిర్ వుంది. ఆ కుర్చీలో ఇంకా ఎవరూ లేరు.

"శంకర్‌ని రమ్మను" ప్రిన్సిపాలు గారు ప్యూన్‌తో చెప్పిచెప్పగానే ప్యూన్ వచ్చి శంకర్‌తో చెప్పాడు. శంకర్ ఒణకువగా లోపలకు వచ్చాడు.

"టేక్ యువర్ సీట్" ప్రిన్సిపాల్ తలెత్తకుండానే అన్నాడు.

"యస్ సార్" శంకర్ హుందాగా కూర్చున్నాడు.

"సో, లిటరేచర్ చదువుతానంటావ్?" ప్రిన్సిపాల్ అప్లికేషన్ చూస్తూ అడిగాడు.

"తెలుగూ లిటరేచర్ సర్!"

"అదే...ఎందుకూ?"

శంకర్ నవ్వాడు. "అది నా మాతృ భాషయినందుకు సార్! తల్లిపాలూ, తల్లి భాషా, తల్లి నేలా-ఎందుకనేముంది సార్! మా నాన్నకు వ్యాపార భాష తప్ప తెలుగుబాష రాదు. మా పిన్నిగారు వచ్చి రాని ఆ బట్లర్ ఇంగ్లీషు తప్ప తెలుగులో మాట్లాడరు. నాకు చదువు చెప్పిన కాన్వెంటులో తెలుగంటే చిన్న చూపు.




అందుకనే సార్ ఏదైనా తెలుగు చదివి తీరాలని ఓ నిర్ణయం చేసుకున్నాను"

అతని మాటలు బయట నుంచున్న వాళ్ళకూ్కడా వినబడుతున్నాయి.

"తెలుగులో ఎవరంటే నీకు ఇష్టం?" ప్రిన్సిపాల్ తన ప్రశ్నల వేటను ఇంకా మానలేదు.

ప్రాచీన కవిత్వంలో అయితే కవి త్రయం, పెద్దన్న, శ్రీనాథుడు; ఆధునిక పద్య కవిత్వంలో అయితే దేవులపల్లి, విశ్వనాథ, వానమామలై, గడియారం గార్లు; గేయ కవిత్వంలో అయితే సండూరి, కొనకళ్ళ ప్రభృతులు; అభ్యుదయ కవిత్వంలో అయితే శ్రీశ్రీ,ఆరుద్ర, సినారే, దాశరథి, తిలక్‌లు; నవలల్లో అయితే గోపీచంద్, బుచ్చిబాబు, చలం; కథల్లో అయితే రాచకొండ, కొడవటిగంటి మొదలైనవాళ్ళు..." అతని వాక్ ప్రవాహాన్ని ఆపాడు ఆ ప్రిన్సిపాల్.

"నాయనా! నీకు సీటిచ్చాను.వెళ్ళిరా!"

శంకర్ నవ్వుకుంటూ బయటకు వచ్చాడు.

అతను బయటకు వస్తుంటే పార్వతి లోపలకు అడుగు పెట్టింది. స్ప్రింగ్ డోర్స్ సగం తెరుచుకుని ఉన్నాయి. శంకర్ కాళ్ళు ఇటు, పార్వతి కాళ్ళు అటు, శంకర్ మొహం—పార్వతి మొహం ఎదురెదురుగా!

ఒక జత కళ్ళు మరో జత కళ్ళల్లోకి చూశాయి. ఒక జత కళ్ళు కిందికి వాలిపోయాయి. మరో జత కళ్ళు చిలిపిగా అర్థమైనట్టు నవ్వాయి.

పార్వతి వేపు చూస్తూ ఆ ప్రిన్సిపాల్ అడిగాడు—"ఫాదర్?"

పార్వతి మౌనంగా ఊరుకుంది.

"ఇదేమిటమ్మా— ఫాదర్స్ నేమ్ రాశావ్! గార్డియన్‌గా గ్రాండ్ మదర్ పేరు రాశావ్?"

ఈ మాటలు వింటూ బయట నిలబడ్డ మన్మథ 'తెలిసింది అసలు కథ' అన్నట్టుగా మొహం పెట్టి స్నేహితుల వేపు చూస్తూ అన్నాడు. "కోకిల తన గుడ్లను తీసుకుని వెళ్ళి కాకిగూట్లో దాచి పెడుతుందిట! ఇక్కడ కోకిల్లేదు. పెంచే కాకి తన గుడ్లను ఓ గుడ్లగూబ గూట్లో పడేసింది!" కిసుకిసుమని నవ్వారు మిత్ర బృందంలో సభ్యులు.

తులసికి ఆ మాటలు విని ఒళ్ళు మండిపోయింది. "కాకులకు కోకిల సంగతేం తెలుస్తుంది?" అన్నది పెద్దగా. తనను పిలవకుండానే లోపలకు వెళ్ళింది. తలుపులను పడేలున తెర్చింది. విసవిసా వెళ్ళి ప్రిన్సిపాల్ ముందు నిలబడింది.

"అప్లికేషన్‌లో తల్లి పేరడగకుండా తండ్రి పేరడగడం ఏమిటి సార్" అన్నది రోషంగా.

"ఎవరు నువ్వు... హూ ఆర్ యూ?"

"ఓ అ ప్లి కెం టు ను... పార్వతి ఫ్రెండును!"

"అయితే ఏమిటి? వాట్ డూ యూ సే? నువ్వేమంటావ్?"

"ఐ వాంట్ టూ సే... నేనేమంటానంటే, మాతృత్వం అన్నది యదార్థం. ఎవరు తండ్రి అన్నది ఓ స్టేట్ మెంట్, ఓ కంజెక్చర్, ఒక ఊహ, తనంత తానుగా ఒక స్త్రీ వెల్లడి చేస్తే తప్ప తెలుసుకోలేని నిజం!"

"అమ్మా ... మహాతల్లీ! మీరంతా న్యూ జనరేషన్ మనుషులు! మీ మాటలు, ఊహలు వేరు. ఓకే!" అంటూ సంతకం పెట్టేసి "వెళ్ళేసి జీతం కట్టండి" అంటూ వాళ్ళిద్దర్నీ బయటకు పంపించేశాడు.

మన్మథ ఇంటర్వ్యూకి వచ్చాడు. మరింత కొరకరాని కొయ్యగా కనిపించాడు. "నీకేంఇష్టవయ్యా! వాడ్డూయూ లైక్?" అన్నాడు ప్రిన్సిపాల్.

"రసగుల్లా ఇష్టం! అది దొరక్కపోతే బందరు లడ్డూ అండి!"

"తిండికాదు తండ్రీ!"

"అయితే ఏక్టర్స్‌లోనా సర్! ఇంగ్లీషులో అయితే లారెల్ అండ్ హార్డీ సార్. హిందీలో అయితే జానీవాకర్, మహమూద్ వగైరా సార్. మన తెలుగులో సార్....హాస్యానికి రేలంగి, రాజబాబు, అల్లురామలింగయ్య; యాక్షన్‌కు యన్.టి.ఆర్., ఎ.యన్.ఆర్., కృష్ణ, శోభన్‌బాబు, చిరంజీవి, చంద్రమోహన్; డాన్సర్స్‌లో అయితే జ్యోతిలక్ష్మి, జయమాలిని, సిల్క్‌స్మిత...."

"నా తండ్రే నా తండ్రే.ఏమి చేస్తూ,



ఏమి అభిరుచీ! యాక్టర్స్‌లో కాదు నాయనా, బుక్స్....బుక్స్...పుస్తకాలు ఏవి ఇష్టమూ అని?"

"పుస్తకాలా సార్! చిన్నప్పుడైతే చందమామ, బాలమిత్ర...."

"అవి పుస్తకాలు కాదు నాయనా పత్రికలు! పుస్తకాలకూ, పత్రికలకూ కూడా భేదం తెలీకుండా యం.ఏ. కొస్తున్నావే.... షేమ్, సిగ్గుచేటు" ప్రిన్సిపాల్ తల పట్టుకున్నాడు.

"పుస్తకాలా సార్! అయితే వినండి. హైస్కూల్లో ఉండగా 'చీర విడిచిన వీర వనిత', 'స్నానాల గదిలో మూడు హత్యలు', 'ఢనాఢన్-ఫటాఫట్' మొదలైనవిసార్! కాలేజీకి వచ్చిం తర్వాతసార్.. లాడ్జింగులో ఒక రాత్రి, అబ్బ సిగ్గేస్తోంది నన్ను వదలండీ, కిస్ మీ మిస్ వగైరా క్లాసిక్స్ సార్!"

"నీకు తెలుగెమ్మే ఎందుగ్గానీ ఆవతలకు తగలడు. ఏ మెడికల్ షాపు ముందో, లాడ్జింగుముందో నిరోధ్‌లు అమ్ముకుంటూ బతుకుపో!" ప్రిన్సిపాల్ కోపంగా అన్నాడు.

మన్మథ ఆయన కోపంచూసి నవ్వే శాడు. "కోపం వద్దుసార్! నేను చదివి నవి మీరు చదవలేదు. మీరు చదివినవి నేను చదవలేదు. ఇప్పుడిక్కడకు ఎందుకు వచ్చానో తెలుసా సార్... మీరు చెప్పేవే చదవడంకోసం. వాటిల్లో ఏముందో తెలుసుకోడం కోసం!"

"ఇట్ ఈజ్ నాట్ ఎ స్ట్రాంగ్ రీజన్! అదంత గట్టి కారణం కాదు నాయనా!"

"ఇది వెరీ స్ట్రాంగ్ పాయింట్ సార్! తిన్నవాణ్ణే పిలిచి కడుపునిండా అన్నం పెట్టడం లోక రీతి. కానీ అది వేస్ట్‌కదా సార్! లేనివాడికి పెట్టాలి. అవునా? అట్లాగే సబ్జెక్ట్ రానివాడికే, తెలియని వాడికే మీరు సీటు ఇవ్వాలి"

మన్మథ వాదాన్ని భరించలేనట్టుగా తల రెండు చేతులతోనూ పట్టుకుని "నాయనా..పో పోయి జీతం కట్టు. ఇహ నా బ్రెయిం తినకు" అన్నాడు ప్రిన్సిపాల్.

మన్మథ "థాంక్యూ సార్" అన్నాడు. లేచి నుంచున్నాడు. వెనక్కు తిరిగి పోబోతూ అన్నాడు "నాకు తిలక్ అని ఓ ఫ్రెండున్నాడు సార్! వాడన్నాడు 'వొరేయ్ మన్మథా-నువ్వుఎందులో చేరినా ప్యాసు కావురా, ఒక్క తెలుగులో తప్ప. అంచేత తెలుగు యం. ఏ.సే చదువు' అని. సరేకాని సార్ ఇందులో కొంచెం శృంగారం పాలు ఎక్కువటకదా! ఎంజాయ్ అని చెప్పొచ్చాడు. వాడు అందుకని కూడా చేరుతున్నానండి"

ప్రిన్సిపాల్ తల ఎత్తి "ఏమిటేమిటి" అనేటంతలోనే అతను వెళ్ళిపోయాడు. మిగిలినవాళ్ళ విషయంలో ప్రిన్సిపాల్ ఇంటర్వ్యూ పొడిగించలేదు. తిలక్, రీటా, మనోహర్, జాస్మిన్, పద్మలత వగైరా వగైరా అందరూ పెద్ద ఇబ్బందేం లేకుం డానే చేరిపోయారు. వాళ్ళందరూ ఫీజు కట్టటానికి ఆఫీసు కౌంటరు దగ్గరకు చేరు కునేలోపునే మన్మథ తనకు సంబంధించిన ఫార్మాలిటీస్ పూర్తిచేసుకున్నాడు. ఆ తర్వాత పీజీ వింగ్ ఎదురుగ్గా ఉన్న ఫౌంటెన్ దగ్గరకు వచ్చాడు. ఫౌంటెన్ మధ్యలో అర్ధనారీశ్వర విగ్రహం ఉంది. అదో అద్భుతమైన శిల్పం. ఆ శిల్పానికి దగ్గరగా పిట్టగోడమీద శంకర్, తిలక్, మనోహర్‌లతో కలిసి కూచున్నాడు. ఆ కబురూ ఈ కబురూ చెబుతున్నాడు. ఇంతలో సతీష్ ప్లేగ్రౌండుకు వెళ్తూ అటువేపుగా వచ్చాడు. షార్ట్స్‌లో ఉన్నాడు. చేతిలో ఓ రాకెట్ ఉంది.

"హలో మన్మథా ... నువ్వెప్పుడు చేరావు?"

"ఇవ్వాళే!"

"ఇంత లేట్ చేశావేం? సెకండ్‌బ్యాచ్ దాకా ఎందుకాగావ్?"

"ఎప్పుడు చేరితే ఏం..చేసేదొకటేగా?" మన్మథ తిరస్కారంగా అన్నాడు. "ఇంతకీ నువ్వేం పొడిచేశావో చెబుదూ ముందు చెరి?"

"ఇదిగో ఇదీ!" అతను తన రాకెట్ చూపించాడు. "గేమ్స్ కోసమే చేరా నోయ్ కాలేజీలో. నీకు గేమ్స్ ఏం రావు గదా! ఐయామ్ సారీ" సతీష్ వెళ్ళి పోయాడు.

అతని వేపే చూస్తూ తల ఎగరవేస్తూ అన్నాడు తిలక్ "పెద్ద తనో మెక్రోనో,




బొజారస్ బోర్లో అయిపోతాను అనుకుంటు న్నాడు. పూర్ ఫెలో!"

శంకర్ తన చేతిలో ఉన్న 'వెన్నెల్లో ఆడపిల్ల' పుస్తకాన్ని అవతల పెట్టాడు. తిలక్ మాటలకు వ్యాఖ్యానంగా అన్నాడు– "ఏం కాకపోతే? ట్రై అండ్ ట్రై. ఆటల్లో ఫెయిలవుతాడూ .... చదువులకు మార్చి – సెప్టెంబరు–మార్చి ఉండనే ఉంది కదా! ఇదో రంగుల చక్రం. అట్లా తిరుగుతూ ఉంటుంది. కావలసినవారు కావలసిన రంగుకు గురి చూసి కొడతారు. తగిలిందీ...సక్సెస్! మనీ, పవర్, ఫేమ్ అన్నీ వస్తాయి. లేదూ, మళ్ళీ ట్రై చేస్తారు. దీనికి టైం వారంటూ ఏం ఉంది?"

ఈ మాటలని ఆతను మళ్ళీ 'వెన్నెల్లో ఆడపిల్ల'ను పరిశీలించడం మొదలెట్టాడు.

"గురూ...గురూ! అటు చూడు" శంకర్‌ను మన్మధ మోచేతితో పొడిచాడు.

అటు తులసి, పార్వతి, జాస్మిన్, రేటా కలిసి వస్తున్నారు. వాళ్ళ చేతుల్లో పుస్తకాలున్నాయి. శంకర్ పార్వతి వేపు చూశాడు. ఆశ్చర్యం! ఆమె చేతుల్లోనూ 'వెన్నెల్లో ఆడపిల్ల' ఉంది. ఆమె కూడా ఆ పుస్తకాన్ని చదువుతూ ఒకానొక తన్మయ భావాన్ని అనుభవిస్తూ నడుస్తోంది. మన్మధ తిలక్‌తో అంటున్నాడు– "పోజు గురూ...తనకే పెద్ద ఇంటరెస్ట్ ఉన్నట్టు!"

తిలక్ అన్నాడు– "గురూ...ఓ కథ చెప్పనా?"

"కాపీయా, సొంతమా?" మనోహర్ వెటకారంగా అన్నాడు.

"సొంత కథలంటూ ఎక్కడున్నాయ్ గురూ! మనుషులకే మనుషులు కాపీలు. తండ్రికి కొడుకు కాపీ. టీచరుకు స్టూడెంటు కాపీ. లవర్‌కు లవర్ కాపీ"

మన్మధ వాడి వీపు మీద ఒక చపేటా ఇచ్చాడు. "ఫిలాసఫీ చెప్పకు. కథ చెప్పు"

తిలక్ దగ్గాడు. ఇకిలించాడు. కాలరు సర్దుకున్నాడు.

"ఓ పెళ్ళయిన అమ్మాయుందట!"

"పెళ్ళయిన అమ్మాయిల కథలు మన కెందుకురా?" మన్మధ విసుక్కున్నాడు.

మనోహర్ రహస్యంగా మన్మధ చెవుల్లో అన్నాడు– "పెళ్ళయినాసరే ఆ రత్తిని సెట్ అప్ చేస్తానన్నావుగా? ఎడ్వాన్సు కూడా పుచ్చుకున్నావ్. నన్ను డిసప్పాయింట్ చెయ్యవు గదా?"

మన్మధ వాడి అరచేతిలో గిల్లి అన్నాడు "మనం ప్రామిస్ అంటే ప్రామిస్సే! రత్తి కాకపోతే మరో రంగి. డోన్ట్ వర్రీ!"

మళ్ళీ తిలక్ అన్నాడు – "పెళ్ళయితే ఏం గురూ? ఆ అమ్మాయి పిటపిటలాడి పోతోంది. ఓరోజు ఉదయం ఓ కవిగారు వీధిలో పోతున్నాడు. ఆ అమ్మాయిని చూశాడు. ఎట్లాగూ....? అద్దంలో చూసుకుంటూ తల దువ్వుకుంటుండగా. మొగుడన్న శాల్తీ వెనగ్గా నిలబడి ఉంది. ఇంతలో ఆ ఇంటి ఎదుట వున్న బాదం చెట్టు మీద చేరిన కాకులు కావు కావు మంటూ గొడవగా అరవడం మొదలెట్టాయి. ఆ అరుపులు విన్నదామె. అద్దం కింద పడేసింది. అమాంతం వెళ్ళి మొగుణ్ని కౌగిలించేసుకుంది.

'ఏమైంది ... ఏమైంది?' అన్నడా మొగుడిశాల్తీ.

'భయపడ్డాను' అన్నదావిడ.

'కాకుల అరుపులకే' అంటూ ఆ మొగుడు తన పెళ్ళాం వీపు మీద

రాశాడు. జుట్టు సవరించాడు 'భయంలేదు. నేనున్నాగా!' అన్నాడు ఆర్చేవాడిలా.

ఆ కవిగారికి ఇదంతా ఆశ్చర్యం అని పించింది. దీని సంగతేమిటో తేల్చేసు కోవాలనుకున్నాడు. ఆ ఇంటి ఎదుట బైఠాయించాడు. బెడ్ రూముల్లో కూడా దీపా లారిపోయిం తర్వాత ఆ భార్యామణి తలుపులు తెరుచుకుని బయటకు వచ్చింది. సదురులేదు, బెదురులేదు. చేతిలో ఓ పొట్లం ఉంది. చకచక నడుస్తూ ఆ ఊరి పక్కన వున్న నది దగ్గరకు వచ్చింది. ఆ నదిలో ఎన్ని మొసళ్ళో! చేతిలో ఉన్న పొట్లంలోంచి మాంసం ముక్కలు తీసి విసిరేస్తోంటే, వాటికోసం మొసళ్లు వస్తుంటే - వాటిమీద మొసళ్ళ వంతెన మీద నడిచినట్టుగా, ఒక్కో మాంసం ముక్క విసురుతూ ఒక్కొక్క మొసలి మీద ఒక్కొక్క అడుగువేస్తూ అట్లా అవతలిగట్టు చేరుకుంది. అక్కడున్నది ఆవిడగారి లవర్! ఉండదల్చుకున్నంత సేపు వున్నతర్వాత, మళ్ళీ ఇంటికి తిరిగి వచ్చేయడానికి కూడా అదే పద్ధతి. ఇంట్లో అంతా గప్‌చిప్.

ఆ కవిగారు ఇదిచూసి, గుండెలమీద చెయ్యేసుకుని 'ఔరా! ఎంతటి నెరజాణలీ ఆడవాళ్లు?!' అనుకున్నాడు...."

తిలక్ కథనం అయిపోతున్నదనగా- రేటా, పార్వతి, తులసి, జాస్మిన్ వాళ్ళ దగ్గరకు వచ్చారు. దగ్గరకు వచ్చిందాకా ఊరుకొని అప్పుడు మన్మథ తిలక్‌తో అన్నాడు-

"నేనయితే ఆ కవిగారిలా గుండెల మీద చెయ్యేసుకోను"

"మరి...?" మనోహర్ రెట్టించాడు. ఓ క్షేత్రయ్య పదాన్ని వికృతంగా పాడాడు మన్మథ "పచ్చి వొం డానినిరా-పాలంటును చేతులకు" అని ఆ నెరజాణ అంటున్నా సరే, "గబ్బి గుబ్బల దాన, కౌగిలింతకు రావె!" అంటూ.

అతని అసహ్యకర ప్రవర్తనకు పార్వతి, మిగిలినవాళ్ళూ మన్మథ వేపు కోపంగా, ఎర్రగా చూశారు. ఆ ఎర్ర దనం చూసి అతను మరింత పేట్రేగి పోయాడు. "వాడెవడో మునిగాడు కోపంగా ఓ కాకివేపు చూశాట్ట. ఆ కాకి పక్షిమని కింపపడి చచ్చిందట. ఎవరా మునిపత్ని ఇచట ?"

"పోన్లే ఇక్కడ కాకులున్న సంగతి స్పష్టమైంది" తులసి పెద్దగా అన్నది.

"తిలక్-నువ్వూ ఉన్నావా ఇక్కడే?" అన్నది మళ్ళీ బాధగా.

తిలక్ నీళ్ళు నమిలాడు.

పార్వతి శంకర్ మీదకు చూపు మర లించింది. వెనగ్గా వాళ్ళకు అర్ధనారీ శ్వరుడు. శంకర్ సిగ్గుతో తలదించు కుంటూ అన్నాడు "అయామ్ సారీ, రియల్లీ సారీ మిస్ తులసీ!"

"మీరెందుకు సారీ చెబుతారు?" తులసి విసుగ్గా అన్నది. "చిత్తకార్తె రాకుండానే చీరకొంగు గాలి తగిలితే చాలు, చిత్తై పోతాయి కొన్ని కుక్కలు! వాళ్ళు చెప్పాలి సారీ!"

మన్మథ రోషంగా ముందుకు రాబో యాడు. శంకర్ అతణ్ని ఆపాడు.

"రోషం కాదు. రేపు ఫంక్షన్‌లో చూపించండి మీ ప్రతాపం! స్టేజి ఎక్కితే చాలు, మీకు శృంగభంగం అయిపోతుంది. ఘనాథన్!" స్నేహితురాండ్రను వెంట బెట్టుకుని తులసి వెళ్ళిపోయింది.

తులసి వేపే చూస్తున్నాడు తిలక్.

పార్వతి వేపే చూస్తున్నాడు శంకర్. వాళ్ళు వెళ్ళిపోయింతర్వాత తెప్పరిల్లి,




కుని శంకర్ అన్నాడు మన్మథతో "ఎందుకురా పార్వతినట్లా ఇన్‌సల్ట్ చేశావ్?"

"ఇన్‌సల్టూ లేదు, గాడిద గుడ్డూ లేదు. అట్లా అనిపించింది అన్నాను. అంతే!"

"మరి నాకట్లా అనిపించడం లేదే?"

"మరి ఎట్లా అనిపిస్తోందీ? ప్రేమించా లనిపిస్తోందా? పెళ్ళాడాలనిపిస్తోందా?"

"ఎగ్జాట్లీ! యూ ఆర్ రైట్! ఏదో ఆత్మీయత స్ఫురిస్తోంది. భాషకందని ఒక ఆత్మీయత"

"ఆ నర్సమ్మ....ఆవిడ కూతురు జానకమ్మ...ఆ జానకమ్మ కూతురు ఈ పార్వతి"

"ఇంకేం అనకు. వాళ్ళ కథ ఏదైనా, ఆ కథ వెనక ఓ మగవాడు తప్పకుండా ఉండి తీరతాడు. చేతనైతే మగవాణ్ని పండించు. ఆడదాన్ని ప్రేమించు, జాలి పడు, అర్థం చేసుకో"

అతను వెళ్ళిపోయాడు.

మన్మథ అతని వేపే చూస్తూ "వీడికి ప్రేమరోగం పట్టుకుందిరోయ్. అది మనం వదలకొట్టాలి" అన్నాడు.

"అట్లాగే! నీది ఐడియా, మాది యాక్షన్" అన్నాడు మనోహర్.

ముగ్గురూ అక్కణ్ణుంచి రేవు వైపు కదిలారు.




కాలేజీలో విద్యార్థి సంఘ ప్రారంభోత్సవం రోజున వాతావరణమంతా కోలాహలంగా ఉంది. రంగుల తోరణాలు, దీపాలు, కొత్త చీరల గరగరలు, పాలిష్ బూట్ల నిగ నిగలు, హలోహలోలు, హౌడుయూడులు, రకరకాల ప్రశ్నలు, వింతవింత జవాబులు– వీటన్నిటి మధ్యా స్టేజీ మీదకు వచ్చారు ప్రిన్సిపాల్ డాక్టర్ మూర్తి.

"మై డియర్ స్టాఫ్ మెంబర్స్, మై డియరెస్ట్ స్టూడెంట్స్ అండ్ రెస్పెక్టెడ్ గెస్ట్స్....నా ప్రియమైన ఉపాధ్యాయ సహచరులారా, ప్రియాతి ప్రియమైన విద్యార్థులారా..."

"మరి విద్యార్థినులలో?" జనంలో నుంచి ఓ కేక.

"అవునవును. ప్రియాతి ప్రియమైన విద్యార్థినీ విద్యార్థులారా, గౌరవనీయులైన అతిథులారా..."

"అనువాదం వొద్దు... అనువాదం వొద్దు" ఆడియన్సులోనుంచి కేకలు.

"అట్లాగే...అట్లాగే! ఇప్పుడు మీ ప్రెసిడెంటు ఇనాగరల్ సాంగ్ పాడతాడు"

ఆ ప్రెసిడెంటు గొంతు విప్పేసరికి ప్రేక్షకుల్లోంచి గాండ్రుగాండ్రుమంటూ కొన్ని పెద్దపులులు గాండ్రించాయి. మరి కొన్ని గార్దభాలు ఓండ్రపెట్టాయి. అసలే ఆ పాటగాడి గొంతు అపస్వరాల పుట్ట. దానికి తోడు ప్రేక్షక ఘీంకృతులు దాన్ని మరింత అభాసుపాలుజేశాయి. దాంతో అతనికి కోపం వచ్చింది. "నన్ను ఇన్‌సల్టు చేయడం కాదు. దమ్ములుంటే మీలో ఎవరన్నా వచ్చి పాడండి" అంటూ పణుకుతున్న కంఠంతో ఛాలెంజ్ చేశాడు.

"ధనాధన్! తిలక్...ఆ ఛాలెంజ్

యాక్సెప్ట్ చేసెయ్!" తులసి ఎంకరేంజ్ చేసింది.

పార్వతి శంకర్ వేపు చూసింది. నువ్వు పాడగలవా అన్న భావం ఉన్నది అందులో.

తిలక్ దిగాలుగా లేచాడు.

"ఎక్కడికిరా?" మన్మథ కంగారుగా అడిగాడు.

"పాట పాడమంటోందిరా తులసి"

"కాలవలో దూకమంటుంది, దూకుతావా? అయినా ఏమిటి నీ ధైర్యం? మీ వాళ్ళల్లో ఎవరితోనైనా చెప్పుల షాపు పెట్టిద్దామనుకుంటున్నావా?" మన్మథ కోప్పడ్డాడు.

"ధైర్యే సాహసే తులసీ—గో" మనోహర్ అతణ్ణి ముందుకు నెట్టాడు.

"ఒద్దొద్దు. నువ్వొద్దు. మన శంకర్ పాడతాడు. శంకర్... ప్లీజ్" మన్మథ అతన్ని అర్థించాడు. శంకర్ పార్వతి వేపు చూశాడు. 'నే వెళ్తున్నా' అన్న సూచన.

పార్వతి పెదవులపై దరహాసం. కళ్ళలో మెరుపు.

జాస్మిన్ అంటోంది "ఏమే పార్వతీ- ఆలస్యం అయితే ఇంటిదగ్గర మీవాళ్ళూ, మావాళ్ళూ ఊరుకోరు. ఉందామా, పోదామా?"

తులసి విసుక్కున్నది. "ఒసేవ్.... కాసేపు నోర్మూసుకో!"

శంకర్ అంటున్నాడు—"నేపాడతాను. నువ్వు ఆడతావా?"

"బై ఆల్ మీన్స్" మన్మథ లేచి నిలబడ్డాడు.

తులసి మెచ్చుకోలుగా అన్నది - "వెరీ ఫైన్ ! ఇపుడు కథ పాకంలో పడ్డది. శంకర్ పాట, మన్మథ ఆట..."

జాస్మిన్ లేని నిలబడి, పార్వతిని కూడా లేచి రమ్మంటోంది. పార్వతి అయిష్టంగా లేచి నిలబడింది. ఆ లైన్లో చివరగా ఉన్నది ఆమె. శంకర్ అప్పటికే ఆమె పక్కగా వచ్చాడు. మళ్ళీ వాళ్లిద్దరి చూపులూ కలుసుకున్నాయి. పార్వతి చూపులు వాలిపోయాయి. కాళ్ళు కదలనని మొరాయించాయి. ఆమె తన సీట్లో కూచుండిపోయింది.

శంకర్ ఎంతో శ్రుతిపక్వంగా పాడుతున్నాడు. వింటున్నవాళ్ళను ఆ పాట రసలోకాలకు తీసుకువెళ్లింది.

మన్మథ ఆ పాటకు తనకు తోచినట్లు గంతులు వేశాడు. అయినా పాట వెంట కొట్టుకుపోయిన శ్రోతలు అతన్నంతగా పట్టించుకోలేదు.

పాట ముగిసిం తర్వాత చప్పట్ల వర్షంలో శంకర్ తడిసిపోయాడు. పార్వతి కళ్లు మూసుకుని ఇంకా ఇంకా చప్పట్లు కొడుతూనేఉన్నది. రంగస్థలం నుంచి కిందకు దిగివచ్చిన శంకర్ పార్వతిని చూశాడు.

"ఒసేవ్ పార్వతీ! పాట అయిపోయింది" తులసి ఆమెను కుదుపుతూ ప్రకృతంలోకి తీసుకువస్తోంది.

మగపిల్లలందరూ శంకర్‌ను చుట్టుముట్టేశారు. అందరి మధ్యా సందు చేసుకుని అతను పార్వతిని అన్వేషించసాగాడు. పార్వతి, తులసి ఉన్న చోటుకు వచ్చి "ఎట్లా ఉంది నా డాన్స్?" అనడిగాడు మన్మథ

"ఏడ్చి మొహం కడుక్కున్నట్టుంది" తులసి తక్కున జవాబు చెప్పింది.

"పదవే పోదాం" అంటూ స్నేహితురాండ్రను తీసుకుని బయటకు వచ్చేసింది.

అక్కడ చంద్రుడు తారకల్తో





సరాగాలాడుతున్నాడు. గాలిబాల గోదావరి అలల మీద పరుగులు తీస్తోంది. ఇళ్ళల్లో నుంచి మినుకు మినుకుమంటోన్న ఆశాదీపాలు!

విద్యార్థులు లాంచీ టాపు మీదకు ఎక్కారు. విద్యార్థినులు లోపలి గదుల్లో సర్దుకుని చలిగాలికి పమిట చెంగులు భుజం నిండుగా కప్పుకున్నారు.

శంకర్ టాపు మీద అంచునే నడుస్తున్నాడు. పార్వతి, తులసి కూచున్న చోట తలవంచి కిందకు చూసి దిగి వాళ్ళకు దగ్గరగా వచ్చాడు.

"ఎట్లా ఉంది నా పాట?" అని అడిగాడు పార్వతి వేపు చూస్తూ తులసిని.

పార్వతి తల్లో వున్న గులాబీ పువ్వును తీసుకుని ఒక్కొక్క రేకే విడదీస్తూ కదులుతున్న నీళ్ళల్లో వేస్తోంది.

"ఫస్ట్‌క్లాస్" అన్నది తులసి. "అవును గానీండి. మీ పాటలో ఎందరి ప్రేమల్ని గురించో చెప్పారు. ఆ పార్వతీ శంకరులు ఆదిదంపతులు కదా... వాళ్ళ ప్రేమ గురించి చెప్పలేదే?"

"శంకరుడిలో సగం పార్వతేగా! ఇహ ప్రత్యేకం పాటెందుకూ?"

పార్వతి చురుక్కున శంకర్ వేపు చూసింది. శంకర్ తన మొహాన్ని ఆకాశంలో వున్న చంద్రుడి వేపు తిప్పాడు.

అప్పటివరకూ దూరంగా కూచున్న జాస్మిన్ అప్పుడు దగ్గరకు వచ్చింది. "అబ్బ! ఆ చంద్రుని చూడండి ఎంత బావున్నాడో!" అంది.

"చంద్రుడి దగ్గర వున్న తారక ఇంకా బావుంది"

"ఎందుకు?"

"వాళ్ళిద్దరిమధ్యా వున్న రాగబంధంలో ఉన్న గట్టిదనం మూలంగా"

"ఏం... ప్రేమంటే అంత లైకింగా మీకు?"

"ప్రేమ లేకపోతే జగత్తేలేదు. గాడ్ లవ్స్ నేచర్. అందుకే సృష్టి! మేన్ లవ్స్ ఉమన్. అందుకే సంతుష్టి!"

"రేవొచ్చింది ... రేవొచ్చింది" అంటూ కలకలం.

"గుడ్‌నైట్! రేపు కలుద్దాం" శంకర్ పార్వతివేపు చూస్తూ కిందికిదిగిపోయి చెయ్యి ఊపాడు.

తులసి జవాబుగా మళ్ళీ చెయ్యూపింది.

ఏవండీ కేర్‌టేకరమ్మగారూ! అతను టాటా చెప్పింది మీకే. మళ్ళీ టాటా అంటే నేరమా?"

"ఈ టాటాలు, బైబైలు పైపై మెరుగులే. నాకు నచ్చవు"

"పోవే...నువ్వో సినిక్‌వి!"

వీళ్ళిట్లా మాట్లాడుకొంటున్నారు లోపల. పైన టాపుమీద మన్మథ బాటిల్ ఓపెన్ చేశాడు. "వేసుకోండోయ్!" అంటూ తిలక్, మనోహర్ వేపుచూసి వాళ్ళకు కూడా తన సీసానందించబోయాడు.

"వద్దొద్దు" తిలక్ వారించాడు.

"మన్మథా! వాడికి తులసి అంటే భయం" అన్నాడు మనోహర్ ఆ సీసాను తను అందుకుంటూ.

రెండు పెగ్గులు వేసుకున్న మన్మథ ముద్దముద్దగా మాట్లాడసాగాడు. "ఇదే బ్రదర్ అసలుసిసలు తోడు. దానినోటికి మనం తాళం తీస్తే, మన నోట్లోపడగానే అది మన మనసుకు తాళం తీస్తుంది. అప్పుడు ఆ హాయి, ఆ ప్లెజర్, ఆ జాయ్..."

మన్మథ లేచి శంకర్ పాడిన పాటను తానే పాడుతూ అటూ ఇటూ గెంత సాగాడు.

"సదూకొనే బాబులు.. ఈ సిందులేటి, ఆ పాటలేటి? ఊరుకోండూరుకోండి" అంటూ లాంచీవాళ్లు వాళ్ళను కసురుకో సాగారు.

ఆ చిందుల్లో, పిచ్చిగంతుల్లో, గందర గోళంలో లాంచీ రేవు చేరుకోగానే తులసి, పార్వతి, మిగిలిన అమ్మాయిలు చివాలున కిందకి గెంతి, ఇంటివేపు అడుగులు వేశారు.

"గాడ్ బ్లెస్ యూ ఫ్రెండ్స్...గాడ్ బ్లెస్ యూ" టాపుమీద పడుకుని మన్మథ, మనోహర్ వాళ్ళకు వీడ్కోలు చెప్పడం మొదలెట్టారు.

''దిగండెహె...రేవొచ్చేసినాది'' గెడ




వేసేవాడు విసుక్కున్నాడు.

"ఉండవయ్యా బాబూ, తొందర పడకు" తిలక్ కాసిని చన్నీళ్ల వాళ్ళ మొహాలమీద చిలకరించాడు. బలవంతంగా వాళ్లు కళ్లు తెరిచినతర్వాత, తన కర్చీఫ్‌తో వాళ్ళ మొహాలు తుడిచి మెల్లగా రెక్క పట్టుకుని వాళ్ళను కిందకు దింపాడు.

"ఏవీ మన సిలకలు...ఎగిరిపోయి నయ్యా?'' మన్మధ అటూ ఇటూ చూస్తూ అడిగాడు.

"ఎప్పుడో వెళ్ళిపోయినారు వాళ్లు! నువ్వే వాళ్ళకు గుడ్‌నైట్ చెప్పావు కూడా" అన్నాడు తిలక్.

"అట్లాగా. పోన్లే రేపుకలుస్తాంగా..." అన్నాడు మన్మధ.

కానీ ఆ రేపును గురించి మాత్రం నర్సమ్మ ఆ రాత్రి పార్వతికి చాలా ఘాటుగా పాఠం చెప్పింది.



"చీకట్లో నువ్వు రావడం చూసి ఏ దొంగచచ్చినాడికయినా ఏ పాడుబుద్ధైనా పుడితే, రేపు నేను తలెత్తుకు తిరగలేనే తల్లీ! చీకటికీ, ఆడదానికీ అనాదిగా శతృత్వం" అన్నది నర్సమ్మ పార్వతికి కంచంలో అన్నం పెడుతూ.

అప్పటికే శ్యామల అన్నం తినేసి మంచంమీద మూడంకెవేసి పడుకుంది తన గదిలో దొడ్లో బాదం చెట్టుమీద పక్షి ఒకటి ఉండి వుండి దీనంగా అరుస్తోంది. వీధిలో బిచ్చగాడి పాట, దేవాలయంలో నుంచి వినవస్తున్న గంటలు వాతావరణం లోకి ఒక విచిత్రమయిన విషాదాన్ని ప్రవేశపెడుతున్నాయి.

"అయితే ఏమంటావ్ మామ్మా? ఒక్కోసారి ప్రయివేట్ క్లాసులుంటాయి, గేమ్స్ వుంటాయి, ఫంక్షన్స్ ఉంటాయి. చీకటి పడకుండా ఇంటికి రమ్మంటే ఎట్లా? అయినా నాకు తోడుగా అనేకమంది ఆడ పిల్లలుంటారు, మగపిల్లలుంటారు"

'మగపిల్లలు' అన్నమాట వినగానే నర్సమ్మ ఇంకా ఖస్సుమన్నది. "ఆ మగ స్నేహాలే నీకు పనికి రావద్దన్నది! వయసులోఉన్న ఆడపిల్లను ఎట్లా చేజిక్కించుకొందామా అని ప్రతి అంట్ల వెధవా ఎత్తులు వేస్తుంటాడు. అవతలి వాడు పళ్ళికిలిస్తే చాలు మీకు పండగ అయిపోతుంది. నువ్వు ఎవడివేపూ చూడ టానికి వీల్లేదు. ఎవ్వడూ నీవేపు కన్నెత్తి చూడటానికి వీలులేదు. తెలిసిందా?"

మంచాలమీద పడుకున్న తర్వాత, దీపం తగ్గిస్తూ అన్నది నర్సమ్మ—"ఏవిటి ఆలోచిస్తున్నావ్?"

"ఏంలేదు. నీ మాటల అర్థాన్నే!" అన్నది పార్వతి.

"బాగా ఆలోచించు. పరిచయాలు పెరిగితే పాతసంగతుల్ని తవ్వి బయటకు తీస్తారు. ఇక్కడ గుట్టుచప్పుడుగా కాలం గడుపుతున్నాం! నీ చిన్నతనం ఎట్లా గడిచిందో ఎవ్వరికీ తెలీదు. నువ్వు ఎక్కణ్ణించి వచ్చావో ఎవ్వరికీ తెలీదు. నీ నాయనేవిటో, నీ అమ్మేవిటో అసలు ఎవ్వరికీ తెలీదు. ఈ తెలికపోవడం అన్నది నీకు కవచంలాంటిది. వాళ్లా వీళ్ళూ నీకు దగ్గరసుకుని ఆ కవచాన్ని వదుల్చుకున్నావో — ఆ క్షణం నువ్వు చులకనయిపోతావు''

"నిజమే మామ్మా! నేనెవరినో తెలిస్తే నిజంగానే నేను చులకనయిపోతాను. అందరికీ దూరంగా ఉండడంలోనే నాకు క్షేమం ఉంది'' అన్నది పార్వతి ఖారంగా.

"నా తల్లే! చదువుకున్నదానివి గనుక ఇట్టే అర్థం చేసుకున్నావు?'' అంటూ నర్సమ్మ తృప్తిగా నిట్టూర్చి గాఢంగా నిద్రపోయింది. కానీ పార్వతికి ఆ రాత్రి సరిగా నిద్రపట్టలేదు. కలత నిద్ర. తనను తనవారే చీదరించుకుంటున్నట్టు పిచ్చి పిచ్చి కలలు.

''నువ్వు నేరస్థురాలివి.. నేరస్థురాలివి! హంతకురాలివి.... హంతకురాలివి !'' మన్మథ వికటంగా నవ్వుతున్నాడు.

''బోర్స్టల్ స్కూల్ ప్రోడక్టువా? గెట్ అవుట్ ఫ్రం మై ప్రెజెన్స్!'' శంకర్ ఆమెను బయటకు నెట్టివేస్తున్నాడు.

ఆడపిల్లలు ఏడిపిస్తున్నారు. మగ పిల్లలు చుట్టూరా చేరి చప్పట్లు చరుస్తూ ''సుందరీ-నీకెందరే ?'' అంటూ పగల బడి నవ్వుతున్నారు.

''నేను నేరస్థురాల్ని కాదు. హంతకు రాల్ని అసలే కాదు. మీలాంటిదాన్నే




నేను కూడా ! ప్రేమ, అభిమానం, వాత్సల్యం అన్నీ కావాలి నాకు. నన్ను... నన్ను...లెట్ డౌన్ చెయ్యకండి ప్లీజ్!'' అంటూ కంగారుపడుతూ నిద్రలేచింది పార్వతి.

ఎదురుగ్గా శ్యామల బెదురు కళ్ళతో నుంచుని ఉంది. ''ఏవిటక్కా... ఆ కలవ రింతలేమిటి? తెల్లగా తెల్లారింతర్వాత ఇదేమిటి... ? ఎవరన్నా ఏమన్నా అన్నారా నిన్న కాలేజీలో?"

పార్వతి సిగ్గుపడుతూ మంచం దిగింది. కుచ్చెళ్ళు సవరించుకుంది. ''ఏదో పీడ కల... ఏమన్నానో, ఎందుకన్నానో తెలీదు'' అంటూ దొడ్లోకి వెళ్ళబోయింది.

బయట వీధిలోనుండి నర్సమ్మ కేకలు వినిపిస్తున్నాయి. ఇరుగు పొరుగువాళ్ళ మీద ఆమె ధాష్టీకం చూపిస్తూ అరుస్తోంది.

''బహుశ మామ్మ కేకలు నిన్ను నిద్దట్లో కూడా కంగారు పెట్టే స్తుంటాయి'' అన్నది శ్యామల చిరు నవ్వుతో.

''అయిఉండొచ్చు'' అంటూ పార్వతి కిటికీదాకా వెళ్ళి అక్కడ నిలబడి వీధిలోకి చూసింది. వీధంతా ఎర్రని పూల కింద తెల్లని ముగ్గులో కళకళలాడుతోంది. పైన ఆకాశం మేఘాల తోరణాలతో అందంగా ఉంది. పొడలు పొడలుగా ఎండ.

నర్సమ్మ బిగ్గరగా అంటున్నది. "ఏవే వెంకటసుబ్బమ్మా ... మా మనవ రాల్ని నువ్వేదో అన్నావట కాలేజీకి వెళ్తుంటే? మా మనవరాలు ఎట్లా నడిస్తే నీకేం? ఏ షోకు చేసుకుంటే నీకేం? పెళ్ళయితే ముగ్గురి బిడ్డల తల్లయ్యేది అని కూడా అన్నావుట కదా? ఒసే సుబ్బమ్మా... నలుగుర్ని కన్నావ్- దేశం మీదపడి బతకమన్నావ్. ఈసురో మంటూ మొగుడిచేత ప్రతిరోజూ దెబ్బలు తింటూ, పక్క మీద పడువు దానిలా బతుకుతున్నావ్! ఇంకా ఎందుకే నీకు ఇతరుల్ని గురించిన సూటిపోటి మాటలు? ఈసారి నువ్విట్టా అన్నావని ఒక్క మాట విన్నా, నీ అంతు తేలుస్తా ఖబడ్దార్!!'' ఆ తర్వాత నర్సమ్మ కొంచెం దూరంగా వున్న ఇంట్లోవున్న ఓ వృద్ధ నారిని పెద్దగా కేకవేసి పిలిచింది. ''ఓ వెంకుబాయమ్మా.. ఇట్రా- ఇట్రా!''

ఆ వెంకుబాయమ్మ భయపడుతూ భయపడుతూ వచ్చింది. "నువ్వా ఏదో అన్నావుట ఏవిటి?" అన్నది నర్సమ్మ మీది మీదికి వెళ్తూ.

"నేనేం అనలేదే నర్సమ్మా! నీ పెద్ద మనమరాలు పట్నంలో నుంచి వచ్చిందట, కాలేజీలో చదువుకోడానికి వెళ్తోందట అన్నా. అంతే!" అన్నది వెంకుబాయమ్మ నెత్తి మీదకు కొంగు లాక్కుంటూ.

"అంతకన్నా ఎక్కువ ఒక్కమాట అన్నా నేనూరుకునేది లేదు"

"ఎందుకంటానే నర్సమ్మా? నాకు మాత్రం పిల్లాపాపా లేరూ? నా మనమలూ, మనవరాళ్ళూ..."

ఇహ నర్సమ్మ ఆవిడను వదిలి పార్వతిని గజ్జెలగుర్రం అన్న ఓ అత్త గార్ని పట్టుకుంది.

"ఏమే ! నీ కోడల్ని నువ్వు సరిగా చూసుకోలేవు కానీ, నా మనవరాలు నీకు గజ్జెల గుర్రంలా కనిపించిందీ? కోడలికి తిండి పెట్టవు, కూతురికి పెళ్ళిచేయవు, కొడుకుల్ని దేభ్యాల్లా చేసి ఆడిస్తున్నావు. నా మనవరాల్ని అంతలేసి మాటలన దానికి నీకు ధైర్యం ఎట్లా వచ్చిందే ? వేసుకో రెండు చెంపలూ ముందు. లేక పోతే నిన్నిక్కడే పాతిపెడతాను!"

ఆ అత్తగారు వణికిపోతూ రెండు చెంపలూ వేసుకుని, ఇంట్లోకి పరుగెత్తుకు పోయి తలుపు వెనకాల నుంచుని మెటి కలు విరవసాగింది – లోలోపల తిట్టు కుంటూ.

ఆ తర్వాత నర్సమ్మ మళ్ళీ పెద్దగా అన్నది – "ఏమే గొ్రడాలుదానా ! ఓ గొ్రరెలవారి కోడలు పిల్లా....నా నోట్లో నోరు పెట్టలేవా? నా నోట్లో ఎందుకే? ముసలి నోరు వాసనేస్తుంది. నీ మొగుడు నోట్లో నోరుపెట్టవే – ముద్దులెట్టు కుంటాడు. ఆ యోగం ఎట్లాగూ లేదు కదా అని ఇష్టం వచ్చినట్టు మాట్లాడు తావా ... నాలిక చీరేస్తాను ఏమను కున్నావో?"

ఆ గొ్రరెలవారి కోడలుపిల్ల ఇంట్లో నుంచి బయటకు రానేలేదు. తలుపులు వేసుకుని ఇంట్లోనే ఉండిపోయింది.

అరిచి అరిచి నర్సమ్మ లోపలకు వచ్చేసరికి పార్వతి టాయిలెట్ పూర్తి చేసుకుని కాలేజీకి బయల్దేరబోతున్నది.

"ఇవ్వాళ తులసి కాలేజీకి రాదట. నువ్వూ మానేయరాదూ?" అన్నది నర్సమ్మ అధికార కంఠంతో.

"అమ్మో! కాలేజీ మానేస్తే ఇంకేమైనా ఉందా? అందమైన పడవ ప్రయాణం, అంతకన్నా అందమైన స్నేహితుల కాల క్షేపం, అంతకన్నా క్లాసుల్లో లెక్చరర్లను ఏడిపించే సరదాలు" శ్యామల అన్నది.

శ్యామల చెవిపట్టుకుని నులిమింది పార్వతి. "అల్లరిదానా! కాలక్షేపంకోసం కాదే నేను కాలేజీకి వెళ్తున్నది. నా కాళ్ళ మీద నేను నుంచోడానికి"

నర్సమ్మ అయిష్టంగా అన్నది "సరే అయితే వెళ్ళక తప్పనిసరయితే తొంద





రగా వెళ్ళి తొందరగా వచ్చేయ్!"

రేవులోంచి దిగుతూ ఉండగా మన్మథ ఆమెను చూసి తిలక్‌తో అన్నాడు –

"పార్వతిని ముట్టుకొనిరానా?" అని. అతనిలో ఇంకా ఆ లక్షణం పోలేదు.

"పార్వతి నిప్పురాబాబూ! దగ్గరకువెళ్తే నిన్ను కాలుస్తుంది. ఆ తర్వాత నీ ఇష్టం" తిలక్ హెచ్చరికగా అన్నాడు.

మన్మథ తల ఎగరేసి పార్వతికి దగ్గరగా వెళ్ళాడు. ఆమె మొహంలోకి చూస్తూ అన్నాడు – "మిమ్మల్నెక్కడో చూసినట్టుందండీ! ఎక్కడంటారు?"

పార్వతిలో కంగారు. "ఎక్కడా లేదు" అంటూ భుజంనిండా కొంగు కప్పుకుని దూరంగా వెళ్ళిపోబోయింది.

"అరెరె! మీ భుజంమీద సాలీడు" అంటూ దాన్ని విసిరివేస్తున్నట్టుగా ఆమె భుజం మీద ఓ చరుపు చరిచాడు. పార్వతి అతనివైపు నిప్పుల కళ్ళతో చూసింది.

"యూఆర్ ఎ బ్రూట్!" అంటూ అవతలకు తప్పుకుంది.

ఆవిడ ఆ మాటలంటుంటే మన్మథ "ఆఁ జ్ఞాపకం వచ్చింది ... జ్ఞాపకం వచ్చింది. మిమ్మల్ని మద్రాసులో చూశాను టీ నగర్‌లో", అన్నాడు. "అప్పుడు మీరు సిటీ బస్ దిగుతున్నారు. కాలుజారింది. పడబోయారు. పడకుండా పట్టుకున్నాను. అవునా?"

"మీ మొహం!"

అప్పుడే అక్కడకు వస్తున్న శంకర్ ఆ మాటలు విని నవ్వాడు. అతని నవ్వు చూసి సిగ్గుపడి పార్వతి గబగబా వెళ్ళి పోయింది కాలేజీ వైపుగా.

"పార్వతి తిడితే నీకు నవ్వులాటగా ఉందా?" మన్మథ శంకర్ వేపు కోపంగా చూస్తూ అన్నాడు.

"ఇంకా నయం. నువ్వు చేసినపనికి కొట్టిందికాదు" శంకర్ నవ్వుతూ నే అన్నాడు.

"ఆ పనే చేస్తే దాని అంతు చూసే వాణ్ణి" మనోహర్ కర్కశంగాఅన్నాడు.

"పార్వతిని అదీ ఇదీ అనకు. మన క్లాస్‌మేట్. అంతేకాదు మీరిట్లా అమ్మాయిలను ఏడిపించడం మానుకోబోతే నేను మీ ఫ్రెండ్‌షిప్ మానేయాల్సి వస్తుంది"

"ఆ పార్వతికోసం మా ఫ్రెండ్‌షిప్‌ను మానుకుంటానంటావా?" మన్మథ నమ్మలేనట్లడిగాడు.

"అవసరమైతే మానుకుంటాను" శంకర్ ఆ మాటలని తనూ అక్కడనుండి వెళ్ళిపోయాడు.

"ఒరేయ్ తిలక్! శంకర్ వాలకం ఏమిటి ఇట్లా వుంది? కొంపతీసి ప్రేమ జబ్బులో పడ్డాడా?"

తిలక్‌ను సమాధానం చెప్పనీయకుండా మనోహర్ అన్నాడు–"వాడు ఏ జబ్బులో పడితే ఏంగాని గురూ..నా సంగతేంచేశావ్! రంగి కూడా కుదరలేదా?"

"రంగి కాకపోతే మంగి.. ఐసే దోస్త్ ఫ్రీ! మన జేబులో వందలమంది అప వాళ్ళున్నారు"

"వందలక్కర్లేదు. ఒక్కత్తి చాలు గురూ!" మనోహర్ కంఠంలో అభ్యర్థన.

"ముందు క్లాసుకు పదండి. నీ సెటప్ గురించి అక్కడ ఆలోచిస్తాను" మన్మథ కమాండింగ్‌గా అన్నాడు.

క్లాసులో పార్వతితోపాటు జాస్మిన్, రీటా, పద్మప్రియ మొదలైనవారందరూ కనిపించారు.

"తులసి రాలేదేం?" తిలక్ పార్వతిని అడిగాడు.

"తెలీదు" పార్వతి ముభావంగా జవాబు చెప్పింది.

"మీ క్లోజ్ ఫ్రెండుకదా, ఆమాత్రం తెలీదా?" మళ్ళీ తిలకే అడిగాడు. పార్వతి జవాబు చెప్పలేదు. మొహం తిప్పేసుకుంది.

ఇంకా లెక్చరరు రాలేదు. తిలక్ గబగబా బ్లాక్‌బోర్డు మీద ఓ కోతిబొమ్మ వేశాడు. ఆ బొమ్మ కళ్ళ మీద అడ్డంగా ఓ పట్టీ పెట్టాడు. ఆ పట్టీ మీద 'చూడకు' అని రాశాడు.

"మాష్టారు..మాష్టారు..." విద్యార్థినీ విద్యార్థుల్లో గుసగుసలు. శఠగోపం సూటువేసుకు వచ్చాడు. పాత సూటు, వదులు వదులుగా ఉన్న సూటు, కాళ్ళకు పాత కిర్రుచెప్పులు, కళ్ళకు పాత జోడు, ఫ్రెంచి కట్ మీసం.

"తెలుగు మాష్టారా... జూలో నుంచి పారిపోయొచ్చిన చింపాంజీనా ఈయన?"

ఘొల్లున నవ్వులు.

శఠగోపం అందరి వేపు ఒక్కసారి చూసి, కళ్ళజోడు తీసి తుడుచుకుని అటెండెన్స్ పిలవసాగాడు నంబర్ల వారీగా.

"వన్, టూ, త్రీ, ఫోర్, ఫైవ్..."

"యస్‌సార్, ప్రెజంట్‌సార్, హియర్ సార్..." ఎవరూ ఆబ్సెంట్ కాలేదు. శఠగోపం క్లాసువంక చూశాడు. కొన్ని కుర్చీలు ఖాళీగా ఉన్నాయి. బోర్డువంక చూశాడు. కోతిబొమ్మ కనిపించింది. మెల్లగాలేచాడు. ఏం చేస్తాడా అని క్లాసులో ఉత్కంఠ. బ్లాక్‌బోర్డు దగ్గరకు వెళ్ళి ఆ కోతికి చెరో వైపూ మరో రెండు కోతి బొమ్మలు వేశాడు. ఒక కోతి నోటిమీదా, మరో కోతి చెవుల మీదా పట్టీలు పెట్టాడు. మూడు కోతులమీదా ఉన్న మూడు

పట్టీలమీదా 'చెడుకు' బదులు ''మంచిని వినకు – మంచిని చూడకు – మంచిని మాట్లాడకు'' అని రాశాడు.

''సార్ సార్...తప్పు రాశార్ సార్!'' ఒక విద్యార్థి మెల్లగా అన్నాడు.

శఠగోపం జాలిగా నవ్వాడు. ''నేను రాయాలని మీరనుకున్నది ఇదే కదుటోయ్ ! అదే రాశాను. ఇప్పుడు కాలం ఎట్లా ఉందీ ? టీచర్లు కాదు స్టూడెంట్స్‌ని నడిపిస్తోంది. మీరు మమ్మల్ని ఎటు నడవమంటే అటు నడుస్తున్నాం. అవునా? బండి ముందూ, గుర్రం వెనకా! అంచేత మన ఉభయులం కూడా ఇటుపైన మంచినీ చూడొద్దు, మంచిని గూర్చి మాటాడొద్దు, మంచిని చెయ్యొద్దు. సరేనా?''

''మరి క్లాసెందుకు సార్?'' ఒక విద్యార్థి అరిచాడు.

''అటెండెన్స్‌కు!''

''ఒరేయ్ తిలక్! ఆయనే అన్నాడుగా ఇంకేం...మొదలెట్టు'' మన్మథ అతణ్ని మోచేత్తో పొడిచాడు.

''తులసీ!'' శఠగోపం పిలిచాడు.

''యస్ మాష్టర్!'' తిలక్ తులసి గొంతుతో పలికాడు. పార్వతి ఉలిక్కి పడింది. తులసి క్లాసుకు రాలేదు కదా? ఈ గొంతు ఎక్కడిదీ? కళ్ళు ఓరగాతిప్పి చూస్తే తిలక్ ముందు వరుసలో మధ్యగా కనిపించాడు. అతనికి వెనగ్గా, మూడో లైన్లో చివరగా శంకర్. ఆమెను చూసి శంకర్ స్నేహపూర్వకంగా చిరునవ్వు నవ్వాడు. పార్వతికి నవ్వుదామని పించినా నవ్వలేకపోయింది. మొహాన్ని లెక్చరరు వైపునకు తిప్పేసుకుంది. తిలక్ కొంటెతనం బయట పడిపోయింది. శఠగోపం ప్రశాంతంగా, చిరునవ్వుతో అన్నాడు. ''మంచిని చూడొద్దు అని తవరే కథా ఉద్బోధించింది. అంచేత తిలక్ మహాశయా – తవరు బయటికి నడుస్తారా!''

తిలక్ కర్చీఫ్‌తో కన్నీళ్ళు తుడుచు కుంటున్నట్టుగా నటించాడు. ''బయటికి నడిచి నేనెలా బతకగలను ? నా కేవరు దిక్కు ?'' ఆ గొంతులో ఒక నటీమణి అనుకరణ.

''తూర్పుకు తిరిగి దణ్ణం పెట్టు. గెటవుట్!'' శఠగోపం కోపంగా అరిచాడు. ఇంకా తిలక్ క్లాసులోనే నిలబడ్డాడు.

''ఓకే.నువ్వు వెళ్ళొద్దు. నేనే వెళ్తాను. ప్రిన్సిపాల్ను పిల్చుకు వస్తాను''

శఠగోపం బయటకు వెళ్ళగానే మనోహర్, తిలక్, ఇంకా మరికొందరు శంకర్‌ను చుట్టుముట్టారు. ''మనకు భయ పడి చింపాంజీ పారిపోయింది. ఆ పారి పోవడాన్ని వర్ణిస్తూ శంకర్ ఓ పాట పాడతాడు''

వాళ్ళ క్లాసు తలుపులు మూసేశారు.

శంకర్‌కు పాడక తప్పలేదు. పాడుతూ వుంటే మిగిలినవాళ్ళు ఆట. ఆడపిల్లలు మాత్రం ఓ వెపుగా కూచున్నారు. పార్వతికి అదంతా చిరాకుగా ఉంది. తలనొప్పిగా ఉందంటూ లేచిపోబోయింది. ఆమె లేచిపోబోవడం చూసి శంకర్ తన పాటను తక్కున ఆపేశాడు.

బయట నుంచి ప్రిన్సిపాల్ అరుస్తున్నాడు. ''ఓ పెన్ ది డోర్స్.... తలుపులు తెరవండి!''

''ఒరేయ్! ప్రిన్స్ ఒచ్చాడోయ్. మనం చచ్చాం'' ఇద్దరు ముగ్గురు విద్యార్థులు కీచుగా అరిచారు. ఏం చేద్దామా అనుకుంటూ వాళ్ళు తలుపులు తెరవలేదు.

''వాళ్ళు తలుపులు తెరవరు సార్!''





శఠగోపం అసహనంగా అన్నాడు.

"డోన్ట్‌వర్రీ—విచారపడకు. లోపలకు వెళ్ళడానికి తలుపులే కావాలా, కిటికీలు లేవూ?" ప్రిన్సిపాల్ డాక్టర్ మూర్తి, శఠగోపాన్ని బయటనే ఉండమని,ఆ గదికి ఉన్న ఓ పెద్ద కిటికీ ద్వారా లోపలకు దూరి,క్లాసులోకి చెంగున గెంతి, పార్వతిని చూసి

"పార్వతీ ! ఓపెన్ ది డోర్స్! అన్నాడు ఆజ్ఞాపూర్వకంగా.

"నేతెరుస్తాను సార్" శంకర్ వెళ్ళి ఆ గది తలుపులు బార్లా తెరిచాడు.

ప్రిన్సిపాల్ మూర్తి బ్లాక్‌బోర్డుమీద వున్న కోతిబొమ్మల్ని చూశాడు. "ఎవరు డ్రా చేశారు వీటిని?"అని అడిగాడు మళ్ళీ.

తిలక్ లేచాడు. "మధ్య బొమ్మను, నేను వేశానండీ!"

"మరి మిగిలిన రెండింటినీ?"

"మాష్టారే వేశారు సార్!"

"ఏవిటీ?మిష్టర్ శఠగోపం దిస్..ఈజ్ టూ మచ్! ఈ బొమ్మలు, ఈ రైటింగ్స్, మీరూ, మీ స్టూడెంట్స్ గో టు హెల్!" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

విద్యార్థులముందు మరోసారి తనకు అవమానం జరగడంతో శఠగోపానికి కోపం నసాళానికి అంటింది. "నిజంగా మీరు కోతులే ! కాలేజీకి మీరు రావడం స్టడీస్‌కోసం కాదు, ఎంటర్‌టెయిన్‌మెంటు కోసం! మీకు టెక్స్ట్‌బుక్స్ ఉండవ్, నోట్స్ రాసుకోరు" అంటూ "తిలక్...ఏదీ నీ టెక్స్ట్?" అంటూ అతని పుస్తకాలు వెతికి, "ఇది గైడ్ కదా...నీకు తోడు ఓ గైడు కూడానూ!" అంటూ దాన్ని బయటకు విసిరివేశాడు. అప్పుడే వరండా చివరదాకా వెళ్ళి అక్కడికి తిరిగివస్తు న్నాడు ప్రిన్సిపాలు. సరిగ్గా ఆయన గది వాకిలి దగ్గరకు రావడమూ, ఆ పుస్తకం వెళ్ళి సరాసరి ఆయన బట్టతలమీద ఎవరో అమర్చినట్టు కూర్చో డమూ ఒక్కసారే జరిగాయి.

అదిచూసి శఠగోపం వణికిపోయాడు. కిటికీలోనుండి ఒక్క అంగలో బయటకు దూకి, ఆయన రెండుచేతులూ పట్టుకుని, "ఇవి చేతులు కావు. తమర్ని చూసుకో లేదు నేను" అంటూ ప్రాధేయపడ సాగాడు.

"నో నో. ఐ కాన్ట్ టాలరేట్ దిస్ ! ఇది నేను సహించలేను" అంటూ ప్రిన్సి పాల్ చిందులు వేయసాగాడు. ఆయన మండిపడుతున్నకొద్దీ శఠగోపం మరింత నీళ్ళుకారిపోవడం మొదలెట్టాడు.

అతని అవస్థచూసి క్లాసంతా ఏక గ్రీవంగా జాలిపడింది.

"ఆయనదేం తప్పులేదు సార్!'' రీటా అన్నది.

"ఆ సమయంలో అటువేపుగా మీరు రాకుండా ఉండవలసింది" మన్మథ అన్నాడు.

"క్లాసుకు గైడ్లు తీసుకురావడం మాదే తప్పు సార్" తిలక్ అన్నాడు తల వంచుకుని.

ప్రిన్సిపాల్ వాళ్ళవేపు అయోమయంగా చూశాడు. "స్ట్రేంజ్ పీపుల్! తమాషా మనుషులు" అనుకుంటూ వెళ్ళిపోయాడు—బొప్పికట్టిన తలను సవరించు కుంటూ.

తనకు తప్పిన పనిష్‌మెంటును చూసి, నీళ్లు నిండిన కళ్ళతో విద్యార్థులవేపు చూసి, పేలవంగా నవ్వి, బ్లాక్‌బోర్డు దగ్గరకు నడిచి 'మంచిని' అన్నమాట చెరిపేసి 'చెడును' అని రాసి "అవును కదూ?" అన్నాడు శఠగోపం.

"అవునవును!" క్లాసంతా వంత పలికింది.

ఇంతలో లాంగ్ బెల్ మోగింది. అందరూ బిలబిలమంటూ బయటకు వచ్చేశారు.

"పార్వతీ! రేవుకు రావా?" రీటా అడిగింది.

"తర్వాత లాంచీకి వస్తాను. లైబ్రరీలో పనుంది" అంది పార్వతి నడుస్తూ.

"హలో శంకర్...నువ్వెక్కడికి?" తిలక్ అడుగుతున్నాడు అతణ్ణి.

"లైబ్రరీకి"

ఆ మాట విన్న పార్వతి గుండె గుబ గుబలాడింది. మొహానికి చిరుచెమట పట్టింది. లైబ్రరీలో 'ఎంకిపాటలు' పుస్తకం తీసుకొంటుండగా పక్కకువచ్చి నిలబడ్డాడు శంకర్.

"ఏం కావాలి మిష్టర్ మీకు?"

"ఎంకి పాటలు!"



"సారీ, ఒకటే కాపీ వుంది. అది మిస్ పార్వతికి ఇష్యూ చేస్తున్నాం"

పార్వతి ఆ పుస్తకాన్ని లైబ్రేరియన్‌కు తిరిగి ఇచ్చేసింది. "అక్కర లేదులెండి. తీసేసుకోండి"

"ఎందుకనీ? కావాలని మరీ మరీ చెప్పి రిజర్వ్ కూడా చేయించుకున్నారుగా?" ఆశ్చర్యంగా అడిగింది లైబ్రేరియన్.

"వద్దులెండి. నాకన్నా అవసరం వున్నవాళ్ళకు ముందు ఇవ్వండి. నే తరువాత చదువుతాను"

"పోనీ ఇంకేమన్నా ఇవ్వమంటారా?"

"తర్వాత తీసుకుంటాలెండి!"

పార్వతి వడివడిగా రేవు దగ్గరకు వచ్చింది. అప్పటికే లాంచీనిండా జనం క్రిక్కిరిసిపోయారు. పట్టణంలో పగలు పనిపాటలు చూసుకుని, సాయంకాలం చీకటిపడేవరకు గూడు చేరుకోవడానికి

ఆత్రుతపడే పిట్టలు వాళ్ళు. లాంచీ నిండా గంపలు, ఇంటికి కొనుగోలు చేసిన వస్తువులు, డబ్బున్న మహారాజులు కోరి ముచ్చటపడి తీసుకువెళ్తున్న ఫర్నిచర్ సామగ్రి, ఆయిల్ డబ్బాలు, కుకింగ్ గ్యాస్ సిలెండర్లు – వీటితో లాంచీ నిండి పోయింది. సామాన్లకుతోడు మనుషులు కూడా చేరి మహారద్దీగా వుంది.

"హాయ్ పారూ! రారా, నీ కోసమే స్పేస్ ఉంచా!'' రీటా తన స్నేహితురాలికి స్వాగతం పలికింది. పార్వతి వచ్చి కూచుంది. ఆమె వదనం మీద స్వేద బిందువులు.

పై డెక్ మీద మన్మధ, మనోహర్ మౌత్ ఆర్గన్ వాయిస్తున్నారు. శంకర్ లాంచీ అంచుమీద నుంచుని ఓ ఎంకి పాటను హమ్ చేస్తున్నాడు. అతనిచేతుల్లో ఎంకి పాటల పుస్తకం. మౌత్ ఆర్గన్ ఆగిపోయింది. మన్మధ పార్వతికి దగ్గరగా వచ్చాడు.

"మిస్–ఇప్పుడు జ్ఞాపకం వొచ్చింది. మిమ్మల్ని హైదరాబాదులో చూశాన్నేను!" అన్నాడు పెద్దగా కొలంబస్‌లా మొహంపెట్టి.

"హైద్రాబాదులోనా?'' పార్వతి నీరసంగా అడిగింది. ఆమె కంఠం వణికింది.

"నేను చార్మినార్ ఎక్కుతున్నాను. మీరు దిగుతున్నారు. మీరు పడబోయారు తూలి. నేను పడకుండా పట్టుకున్నాను. జ్ఞాపకం వొచ్చిందా?''

"రాలేదు!'' సంభాషణ పొడిగించడం ఇష్టంలేనట్టు ఓ పుస్తకాన్ని చేతిలోకి తీసుకుంది పార్వతి.

"గురూ! ఎప్పుడూ ఆడవాళ్ళు కింద పడిపోతూ వుంటారు. నువ్వు పట్టుకుంటూ ఉంటావు. అదెట్లా గురూ?'' తిలక్ అడిగాడు సందేహపడుతున్నట్లుగా.

"వాళ్ళు వీకర్ సెక్స్ కదా, అదంతే''

పార్వతి అతని వేపు కోపంగా చూసింది. రీటా, జాస్మిన్ ప్రొటెస్ట్ చేశారు.

"ఎవరు ప్రొటెస్ట్ చేసినా, ఎవరు కోపంగా చూసినా ఫాక్ట్ ఈజ్ ఫాక్ట్! కాదూ,నేను తప్పుగా మాట్లాడాననుకుంటే, మిమ్మల్ని ఇన్‌సల్టు చేశాననుకుంటే మీలో ఎవరైనా సరే పురాణాల్లో పతివ్రతల్లాంటి వాళ్ళుంటే, నా వేపు మూడో కన్ను తెరవండి. నన్ను బుగ్గి చెయ్యండి"

"ఇది పతివ్రతల కాలంకాదు గురూ, కలికాలం! ఆకలి కాలం!!" మనోహర్ అన్నాడు.

"ఏ రకమైన ఆకలిరా?"

తన మాటల చమత్కారానికి తనే పెద్దగా నవ్వుకున్నాడు మన్మధ. ఆ నవ్వు చూసి సూర్యుడి మొహం ఎర్రబడింది. అప్పుడే ఉదయిస్తున్న చంద్రుడి మొహం తెల్లబడింది.

తమ దగ్గరకే వస్తున్న మన్మధ, మనోహర్, తిలక్‌లను చూసి పార్వతి లేచిపోబోయింది.

"కూచోవే పారూ! ఎవరో వస్తే మనం ఎందుకు లేవడం?" రీటా అంటున్నది.

"మిస్! కాస్త జరుగుతారా మేమూ కూచుంటాం" మన్మధ అడుగుతున్నాడు. లాంచీ శబ్దం ఝుక్... ఝుక్... ఝుక్... మంటూ. నీళ్ళు గలగల. ఊళగా గాలి.

"పోనీ నువ్వు కిటికీ వైపు కూచో. నేనిటు పక్కన కూచుంటాను" రీటా స్థలం మారింది. జవాబుగా పార్వతి బయటకు వెళ్ళి, లాంచీకి చుక్కాని ముందు వైపు




గొలుసును చుట్టేసే చోట ఉండే ఖాళీ ప్రదేశంలో నుంచుంది. తలఎత్తి చూస్తే శంకర్ కనిపిస్తున్నాడు. శంకర్ కళ్ళు కోపంగా జ్వలిస్తున్నాయి మన్మధ వేపు చూసినప్పుడల్లా. ఇంతలో రేవు వచ్చింది. శంకర్ దిగవలసిన రేవు. దిగిపోతూ దిగిపోతూ పక్కవాడితో అంటున్నట్టుగా అన్నాడు – "మంచి మనిషికో మాట, మంచి గొడ్డుకో దెబ్బ. కానీ కొన్ని పశువులకు మాటలే చాలు. కొందరు మనుషులకు దెబ్బలు కూడా చాలవు"

తిలక్ మన్మధ చెవిలో అన్నట్టుగా అన్నాడు– "వాడి చూపులు చూశావా గురూ . . . ఆ మాటలన్నది నీ గురించే అనుకుంటాను"

మన్మధ కసిగా పళ్ళు కొరుక్కున్నాడు. "అవునవును. కొందరు మనుషులకు దెబ్బలు కూడా చాలవు"

ఇంతలో వాళ్ళు దిగే రేవు వచ్చింది. పుస్తకాలు తీసుకుని మిగిలిన ఆడపిల్లలతో కలిసి ఇంటివైపుగా నడక సాగించింది పార్వతి. మన్మధ బృందం డెక్ మీద నుంచే లైన్లో నిలబడి–"గుడ్‌నైట్-స్వీట్ డ్రీమ్స్" చెబుతున్నారు.

పార్వతి ఇంటికి వెళ్లే దారిలో వేణుగోపాలస్వామి ఆలయం ఉంది. ఆ పక్క వీధిలోనుంచి ఓ శవం, ఆ శవం వెనకాల బాష్పనేత్రాలతో, దీన వదనాలతో కొందరు మనుషులు ఎదురయ్యారు. ఆ మనుషుల మొహాలు పరిచితమైనవిగా అనిపించి తలెత్తి వాళ్ళవైపు ఆసక్తితో చూసింది. వాళ్ళతో పాటు ఆ శవం మొహం కూడా ఆమెకు స్పష్టంగా కనిపించింది.

ఆ మొహాన్ని చూడ్డం తోటే ఆమెకు గుండె ఝల్లుమంది. "అయ్యో సరళా!" అంటూ ఆమె హృదయం మూగగా రోదించింది.

ఆలోచించుకుంటూ వస్తున్న పార్వతిని ఆమె ఇంటికి ఇవతలగా తులసి నిలేసింది. "ఇందాకట్నుంచీ చూస్తున్నా, నీ కోసం వెయిట్ చేస్తున్నా. ఇంతాలస్యం చేశావేం ?" అంటూ అసహనంగా అడిగింది.

"లాంచీ రావద్దూ? అది సరేకాని పాపం సరళ... చూశావుగా.... ఎందుకని చచ్చిపోయిందీ?"

"ఓ దుర్మార్గుడు చేసిన పాపానికి" తులసి కసిగా అన్నది.

ఇంట్లోకి లాక్కుపోతూ, "దుర్మార్గుడెవడే? పాపమేమిటే?" అంటూ ప్రశ్నలు వేసింది పార్వతి.

ఆ మాటలు విన్న సర్వమ్మ లోపల్నుండి దూకుడుగా బయటికి వచ్చింది. "ఎవడా....? ఓ లెక్చరర్ వెధవట! చదువు చెప్పే మాష్టరు తండ్రి లాంటివాడే. వాడే స్టూడెంట్సును పాడుజేస్తే, ఛీ...ఛీ! అమాయకమ్మొహం. దానికి ఏం మాయ మాటలు చెప్పాడో ముగ్గులోకి దింపాట్ట!"

"అంతే కాదు మామ్మా! ఎన్నో సార్లు వాళ్ళిద్దరూకలిసి సినిమాలకని చెప్పి లాంచీ ఎక్కి వెళ్ళిపోవడం నేను కళ్ళారా చూశాను" అన్నది శ్యామల చేతులు తిప్పుకుంటూ.

"వేటిని చూసినా, చూడకపోయినా, ఇటువంటివి ముందు మీ కళ్ళ పడతాయి! అవునే తులసీ . . . కలిసి తిరిగింది తాళి కట్టమని పట్టుపట్టలేదా?" సర్వమ్మ జాలిగా అన్నది.

"ఎందుకనలేదూ ? తనకు మూడో నెల అని తెలియగానే వాడి ముక్కు



పట్టుకుంది. అయితే ఏం లాభం? ఆ లెక్చరరుకు అప్పటికే ఓ పెళ్ళాం, రెండు నెలల ఆడపిల్ల ఉన్నారు. ఇంకేం చేస్తుందా పిచ్చిది? నిద్రమాత్రలు మింగేసింది! నేనైతేనా ధనాధన్‌మంటూ ఈ చెంపా ఆ చెంపా వాయించేదాన్ని ఆ స్కౌండ్రల్ని!''

"అంతపని చేయకు తల్లీ! నీకా రకం మగ వెధవల సంగతి సరిగా తెలీదు. వాళ్ళకు నిలువెల్లా విషమే, కాటు వేద్దామన్న బుద్ధే! సరేగాని లోపలకు పద. ముగ్గురికీ వడ్డిస్తాను. కబుర్లాడుతూ తిందురుగాని!''

"కాదులెండి మామ్మగారూ! ఇంటి దగ్గర మా మమ్మీ ఎదురు చూస్తుంటుంది. గుడ్‌నైట్!" అని వెళ్ళబోయింది తులసి.

వెళ్ళబోతున్న తులసిని భుజం పట్టుకు ఆపి పార్వతి అన్నది "తులసీ! వచ్చేవారం నుంచీ సైన్స్ వింగ్‌లో ఎగ్జిబిషనట!"

"మన ఆర్ట్సులో ఏం వచ్చింది కానీ సైన్స్ ఎగ్జిబిషన్ బావుంటుందేవ్! మిస్ కావొద్దు" తులసి అన్నది. అని వెళ్ళిపోయింది.

తులసి వెళ్ళిపోయిం తర్వాత ఇద్దరు మనవరాళ్ళకూ అన్నం వడ్డించి, వాళ్ళు తింటుంటే కొసరి కొసరి వడ్డిస్తూ, వేయించుకోకపోతే కసురుతూ, మధ్య మధ్యలో ఏవేవో ప్రస్తావనలు తీసుకు వస్తూ, చివరగా మజ్జిగ పోస్తూ అన్నది- "అవునుగానీ ఒసే పారూ...మీ కాలేజీలో అటువంటి పగుల్బాజీవాళ్ళెవరూ లెక్చరర్లుగా లేరుకదా?"

పార్వతి కళ్ళ ముందు ప్రిన్సిపాల్ డాక్టర్ మూర్తి, శఠగోపం వగైరాల మొహాలు మెదిలాయి సన్నగా నవ్వుకొంది. "లేరు మామ్మా!"

"పోకిరీ వెధవలెవరూ నిన్ను దార్లోనూ, కాలేజీలోనూ ఏడిపించడం లేదుకదా?"

పార్వతికి కళ్ళముందు మన్మథ, మనోహర్ మొహాలు మెదిలాయి. వాళ్ళ పేర్లు చెబుదామా అని ఒక్క క్షణం అనిపించింది. మళ్ళీ తనను తనే నిగ్రహించుకుని "నన్నెందుకు ఏడిపిస్తారూ? నాలో ఏం ప్రత్యేకత ఉందని" అన్నది లోగొంతుకలో.

"ఆ ప్రత్యేకతలేవీ ప్రత్యేకంగా లేకపోవడమే మా అక్కయ్య ప్రత్యేకత" శ్యామల అన్నది.

"సరేలే ... సరేలే! నే చెప్పేది జాగ్రత్తగా వినండి. ఆ సరళ బతుకు చూశారుగా! ఏమాత్రం తప్పటడుగు వేసినా, వయసులో ఉన్న ఆడపిల్లకు అదేగతి. మీరు నర్సమ్మ మనవరాళ్ళు అన్న సంగతి మర్చిపోకండి. మీ సంగతేమో చదువేమో, అంతే. మరో వ్యాపకం మీకు వద్దు. మీ వైపు ఎవడన్నా కన్నెత్తి చూశాడా చెప్పండి-వాడి పెడ రెక్కలు విరిచికట్టి, గుండు గీయించి, మొహం మీద సున్నం బొట్లు పెట్టించి, గాడిదమీద ఊరల్లా వూరేగిస్తాను"

పార్వతి కళ్ళల్లో శంకర్ మొహం మెదిలింది ప్రేమగా, దీనంగా, జాలిగా. ఒత్తుగా వున్న గిరజాల జుట్టు కరిగిపోయింది. గుండుతో, సున్నం బొట్లతో, గాడిదమీద శంకర్....! "వద్దు వద్దు" అన్నది భయంతో అన్నం ముందు నుండి చేయికడుక్కుని లేచిపోతూ.

శ్యామల మామ్మ మాటలు, పార్వతి పణుకు చూసి ఫెడీఫెడీ నవ్వసాగింది.








పి.జి. వింగ్‌లో ఆర్ట్సు సెక్షన్స్‌కు అల్లంత దూరంలో వున్నాయి సైన్సు సెక్షన్లు. ఆ రోజు సైన్సు సెక్షన బ్లాకుముందు, లోపల ఎగ్జిబిషన్‌లో ఏర్పాటు చేసిన మినీ ప్లానిటోరియం చూడడానికి బారులు తీరి నుంచున్నారు విద్యార్థినీ విద్యార్థులు. లోపలకు వెళ్ళి చూసొచ్చిన వాళ్ళు, బయట నిలబడ్డ వాళ్ళకు లోపలి విశేషాల్ని గోరంతలు కొండంతలు చేసి వర్ణిస్తున్నారు. బయట నుంచున్న వాళ్ళకు లోపలకు ఎప్పుడెప్పుడు వెళ్ళుదామా అన్న ఉత్కంఠ. కానీ వాళ్ళను మందలు మందలుగా లోపలకు పోవడాన్ని గేట్ల దగ్గర వున్న గైడ్స్ ఎలౌవ్ చెయ్యడం లేదు. ఇద్దరి ద్దరుగా ఒక జట్టు చేసి లోపలకు పంపిస్తున్నారు. ఇంతలో బయట ఉన్న లౌడ్‌స్పీకర్ లోంచి ఒక ఎనౌన్స్‌మెంట్ వినిపించింది–

"నేటికార్యక్రమంలో ఒక ప్రత్యేకత.. ప్లానిటోరియం చూడడంతో పాటుగా స్పేస్ ఎక్స్‌పీరియన్స్ కూడా!"

విద్యార్థుల్లో సంతోషం. కేకలు... ఈలలు... హోయ్ హోయ్ అంటూ చిలిపి గంతులు. ఈసారి ఓ హెచ్చరికను కూడా అందజేసింది ఆ ఎనౌన్స్‌మెంటు–

"వీక్‌హార్ట్స్ వాళ్ళు,బ్లడ్ ప్రెషర్ వాళ్ళు, ధైర్యం లేనివాళ్ళు దయచేసి ఇందులో పార్టిసిపేట్ చెయ్యవద్దు. ఫలితాలకు మేము బాధ్యులంకాము."

విద్యార్థులందరూ ఆ ఎనౌన్స్‌మెంట్ వింటూనే మేమంటే మేము అంటూ ముందుకు వచ్చారు. "మా గుండెలు గట్టివి. మా రక్తంలో ప్లెజర్ తప్ప ప్రెషర్ లేదు. ధైర్యం మా ఊపిరి. సాహసం మా పేరు" వాళ్ళు గట్టిగా అరుస్తున్నారు.

"నాకసలే భయం బాబూ ఇటువంటి వంటే. నేను రాను. మీరు వెళ్తే వెళ్ళండి" పద్మలత అన్నది. ఆమె కంఠంలో నిజంగానే వణుకు.

"మగపిల్లలకు లేని భయం మన కెందుకే? నే రెడీ" అన్నది రీటా నిశ్చయ కంఠంతో.

"అట్లా ఉండాలి మోడర్న్‌గర్ల్స్. పార్వతీ..నువ్వూ రడీయేనా ?" తులసి అడిగింది.

పార్వతి అవును కాదు అని తేల్చి చెప్పక ముందే తులసి రీటాను, పార్వతిని తీసుకుని క్యూలోకి వెళ్ళి నుంచున్నది. ఇటు పక్కగా ఆడపిల్లల క్యూ. అటు పక్కన మగపిల్లల క్యూ. ఓరగా తెరచిన తలుపులోంచి లోపలకు పోవ టానికి కుమ్ములాట. ఆ తొక్కిడిలో ఒకే సారి శంకర్, పార్వతి లోపలకు నెట్ట బడ్డారు. వెనక్కు తిరిగి చూసేసరికి ఓరగా వున్న తలుపు దగ్గరకు మూసుకు పోయింది. ప్లానిటోరియం లోపల డిమ్ లైట్.

"రెండడుగులు ముందుకు వెయ్యండి" ఓ కంఠస్వరం సూచనచేసింది.

పార్వతి గుండె వేగంగా కొట్టు కొంటోంది. అడుగు ముందుకు పడటానికి

తటపటాయిస్తోంది. మసక వెలుతురులో, బంగారు తీగలా వున్న పార్వతి మంచులో తడిసిన సూర్యకిరణంలా కనిపిస్తోంది. ఆముదం దీపాల వెలుగులో, అత్తరు కడ్డీల పొగల్లో, మసకబారిన శివలింగంలా కనిపిస్తున్నాడు శంకర్ పార్వతి కంటికి.

"రా పార్వతీ!" శంకర్ చనువుగా ఆమె చెయ్యి పట్టుకుని ముందుకు నడిపించాడు. ఆమె ఒళ్ళు ఝల్లుమంది. తడుముకుంటూ వెళ్ళి అక్కడ వున్న కుర్చీల్లో కూచున్నారు.

"ఆకాశంలో వున్న నక్షత్ర గమనాన్ని చూడండి" ఎనౌన్సర్ కంఠస్వరం. ఇద్దరూ గభాలున తలలు ఎత్తారు. రంగు రంగుల నక్షత్రాలు...మిణుకుమిణుకుమంటూ, కొన్ని వెలతెలబోతూ, కొన్ని ఎర్రగా, కొన్ని తెలవెల కాంతుల్లో దూరంగా కనిపిస్తూ, దూరంగా కనిపిస్తూనే దగ్గరకు వస్తూ వాళ్ళను సంభ్రమపరుస్తున్నాయి. ఆ ఎనౌన్సర్ మరికొద్ది క్షణాల్లో అష్టగ్రహాల్ని చూపించాడు. సూర్యుడికీ, చంద్రుడికీ పట్టే గ్రహణాల్ని ప్రదర్శిస్తూ వర్ణించాడు. సంపూర్ణ సూర్యగ్రహణ సమయంలో భూమినుండి చూస్తే సూర్యబింబం ఎన్ని సౌందర్య శకలాలను ప్రసవిస్తుందో, సూర్యకాంతి ఎంత చల్లగా స్పర్శిస్తుందో చూపెట్టాడు. ఆ అద్భుత వీక్షణంలో శంకర్, పార్వతి క్షణంసేపు తమనుతాము మర్చిపోయారు.

వాళ్ళను ప్రకృతంలోకి తీసుకుని వస్తూ మళ్ళీ ఎనౌన్సర్ కంఠం వినిపించింది. "గ్రహ దర్శనం అయింతర్వాత ఇప్పుడు ఆకాశ గమనం! మీరు లేచి మీకు ఎదురుగా వున్న గ్లాస్‌డోమ్‌లోకి రండి"





శంకర్, పార్వతి ఎనౌన్సర్ చెప్పినట్లే చేశారు. గ్లాస్‌డోమ్‌లోకి వాళ్ళు రాగానే దాని అద్దాల తలుపులు మూసుకుపోయాయి. కిందా, పక్కనా, పైనా అంతా మందపాటి అద్దాలే. లోపల పట్టుకోడానికి రెండు రబ్బరు గొలుసులున్నాయి. వాళ్ళు ఆ గొలుసుల్ని పట్టుకుని నుంచున్నారు.

ఆ గ్లాసుడోమ్ కొద్ది క్షణాలకల్లా గిరగిరా తిరగడం మొదలు పెట్టింది. గిరగిరగిరగిర. అది ఒక్కసారిగా పైకి లేచినట్లయింది. విపరీతమైన వేగంతో ఎక్కడికో దూసుకుపోతున్నట్లనిపిస్తోంది. వేగం...వేగం....ఒళ్ళు తట్టుకోలేనంత వేగం, మనసు తూలిపోయేటంత వేగం, ఝుంయ్‌మన్న శబ్దం. ఒక్కసారిగా వాతావరణం ఘనీభవిస్తోంది, అంతలో వేడితో ఆవిర్లెత్తుతోంది. మహాపర్వతం ఏదో మీద పడ్డట్టుగా నల్లని చిక్కని చీకటి. అంతలో ఆ చీకటి పల్చనౌతోంది. వెలుగుముద్దలేవో దూరంగా కనిపిస్తున్నాయి. మంటల సెగళ్ళేవో మండుతున్నాయి. వాటి మధ్యగా గ్లాస్‌డోర్డ్ డోమ్‌వైపుకు మహావేగంతో ఉల్కలు, తోకచుక్కలు దూసుకు వస్తున్నాయి. ఆ దృశ్యం అత్యంత భయావహంగా ఉంది. అతిలోక రమణీయంగా ఉంది. మానవుడి అస్తిత్వాన్నే అపహాస్యం చేస్తున్నట్లుగా ఉంది.

"ఓయి పిచ్చి మానవుడా? ఈ అనంత విశ్వంలో నీ విజ్ఞానపు అవధి ఎంత? నీ శాస్త్ర పరిజ్ఞానం ఎంత? నీ బతుకు కొలత ఎంత? నీ గుండె దిటవు ఎంత? మహాసముద్రాన్ని ఉద్ధరిణతో కొలిచి, 'చూశావా ఎన్ని నీళ్ళు పట్టేశానో ఈ ఉద్ధరిణలో? ఇంకెంత సముద్రం? ఆఫ్టర్ ఆల్ కొన్ని ఉద్ధరిణలు మాత్రమే!'

అంటున్న అహంకారం నీది. సూర్యుణ్ణి కొవ్వొత్తిలో చూపించే అహంభావం నీది" అని ఎవరో అంటున్నట్టుగా వాళ్ళ అంతరలోకాల్లో ఆ సమయంలో ప్రతిధ్వనించాయి. ధ్వని...కాంతి.... వాళ్ళను అతలాకుతలం చేసేశాయి. ఆ తాకిడికి తట్టుకోలేక పార్వతి శంకర్ భుజాల మీద తలవాల్చేసింది. గ్లాస్‌డోమ్ తిరగటం ఆగిపోయింది. ప్రపంచం మళ్ళీ తన యాక్సిల్ మీద నిలబడినట్లయింది.

పార్వతి మొహమంతా చెమట పట్టింది. ముత్యాల్లా మెరుస్తున్నాయి ఆ స్వేద బిందువులు. నొసటిమీద వున్న చెమటకు అతుక్కున్నది వంకీల జుత్తు. నాళాల్లో ప్రవహిస్తున్న రక్తం తెల్లని చర్మంగుండా బయటకు కనిపిస్తోంది. సంభ్రమ స్థితికి లోనైన పార్వతికి అడుగుతీసి అడుగు వేయడమే కష్టమైపోయింది. బరువుగాఉన్న ఉఛ్వాసం. ఆమెను దాదాపుగా ఎత్తుకున్నంత పనిచేసి శంకర్ బయటకు తీసుకురావలసి వచ్చింది.

"ఏవిటేవిటి?" అంటూ చుట్టూ మూగారు ఆమె స్నేహితులూ, పరిచితులూ. అపరిచితులు దూరంగా నిలబడి ఆసక్తితో చూడడం మొదలుపెట్టారు.

"నథింగ్ స్పెషల్! జస్ట్ కంపౌండెడ్!" శంకర్ ఆమెను కాస్త గాలి తగిలే చోటుకు తీసుకు వచ్చాడు. ఒంటికి చల్లని గాలి తగిలి ఆమె సేద తీరింది. కళ్ళు తెరచి జరిగింది గ్రహించి సిగ్గుపడింది.

"గురూ! పార్వతిని మనవాడు ఎత్తుకు వస్తున్నప్పుడు అతని మొహం, ఆమె మొహం దగ్గర దగ్గరగా ఉన్నయ్ కదూ?" సురేష్ అడిగాడు మన్మథను.

మన్మథ బదులు మనోహర్ సమాధానం చెప్పాడు – "ఆహా! ముద్దుపెట్టుకునేటంత దగ్గర!"

మన్మథ కళ్ళు ఎరుపెక్కుతున్నాయి.

"కిస్ చేశాడంటావా?"

"చేసే ఉంటాడు"

"అవకాశం వస్తే ఎవడూ వదులుకుంటాడు?"

"శంకర్ ఋష్యశృంగుడు కాదుగదా!"

వాళ్ళంతా రకరకాలుగా కామెంట్స్ చేస్తున్నారు. ఆ వ్యాఖ్యలన్నీ పార్వతి సుతిమెత్తని మనస్సును స్పృశించీ స్పృశించకుండా గాలిలో తేలుకుంటూ గడుసు దయ్యాల్లా దూరంగా వెళ్ళిపోతున్నాయి. పార్వతి శంకర్‌కు థాంక్స్ చెప్పి ఇంటికి బయల్దేరింది. ప్లానిటోరియమ్ అనుభవం కోసం మన్మథ, అతని స్నేహితులూ వెనుకే ఉండిపోయారు. మిగిలినవాళ్ళు మాత్రం ఎవరి రేవు వస్తే వాళ్ల దిగిపోతున్నారు.

గలగల పారే గోదావరి నీళ్ళు, కలకల పలికే పికిలి పిట్టల కలకూజితాలు, తాడును భుజాన వేసుకుని గాలికీ ఏటికీ ఎదురీదుతూ పడవను ముందుకు లాగుతూ హైలెస్స పాటను పాడుతున్న జాలరుల జాలిగీతం, మధ్య మధ్యలో రేవుల్లో ఉన్న దేవాలయాల్లో సుఖభోగాల్లో తమ సృష్టినే మర్చిపోయిన దేవుళ్ళను మేల్కొల్పడానికి భక్తులు మోగించే ఘంటానినాదాలు– అన్నీ కలిసి పార్వతిని మామూలు మనిషి చేశాయి.

తులసి అడిగింది టీజింగ్‌గా– "ఏమిటి పారూ...లోపలి విశేషాలు?"

"నీకే విశేషాలు కావాలో అడుగు, అవే చెబుతాను"

"అట్లా డైరెక్టుగా అను. అడిగేస్తా. ఫస్ట్ క్వశ్చన్. శంకర్ ఎట్లా బిహేవ్ చేసాడు?"

"హి ఈజ్ ఎ జెంటిల్‌మన్" పార్వతి గొంతులో మొట్టమొదటిసారిగా ప్రశంస.

"వ్హాట్?" రీటా, హెలెన్‌ల కళ్ళు రేకు మందాగాల్లా విచ్చుకున్నాయి. తులసి పెదవి విరిచింది. "ఎగోల్డెన్ ఆపర్ చూనిటీ వేస్టెడ్ ఎవే!"

"ఏమిటే అంటున్నావ్ ?" పార్వతి కసిరింది.

"ఏంలేదు" తులసి కన్ను కొట్టింది చిలిపిగా.

"ఈ ధనాధన్ తులసికీ, ఆ ఫటాఫట్ తిలక్‌కే గనుక ఈ అవకాశం వచ్చివుంటే, నా సామిరంగ, వాళ్ళ హనీమూన్ ఆ గ్లాస్ డోమ్‌లోనే కానిచ్చేసి ఉండేవారు" అందొకామె.

"ఛీ - పో - పాడు బుద్ధులూ, పాడు మాటలూనూ" పార్వతి కొట్టబోయింది

ఆ పిల్లని.

ఎత్తిన ఆ చేతిని పట్టుకుంది తులసి. "ఆగాగు. గుర్రాన్నికట్టేయ్! మేం ఇద్దరం వచ్చేనెల్లో రిజిష్టరాఫీసులో పెళ్ళిచేసుకో బోతున్నాం" అంది దర్జాగా.

ఈసారి ఆశ్చర్యపోవడం పార్వతి వంతయింది "నిజంగానా? ఇంట్లో చెప్పావా ఈ సంగతి?"

అంతవరకూ చిలిపిగా ఉన్న తులసి మొహం క్షణంలో సీరియస్‌గా మారి పోయింది. ఆమె ఆ లాంచీ అంచుమీదకు వెళ్ళి పారుతున్న గోదావరీ నీళ్ళలో కాళ్ళాడిస్తూ కూచుంది.

"అట్టా కూకోకండమ్మాయ్‌గోరూ! బేలన్స తప్పితే బహూ సెడ్డ ప్రమాదం" పడవ సరంగు గొడవ చేశాడు.

"బాలన్స తప్పన్లులే! కంగారుపడకు" ఆమె సరంగు వేపు తిరిగి పెద్దగా అన్నది.



తర్వాత పార్వతి కూచున్న వేపు వెనక్కు మొహం తిప్పి అన్నది- "నిజంగానా అని కదూ నువ్వడిగింది? ఇంట్లో చెప్పావా అని కదూ నువ్వు ఎంక్వయిరీ చేసింది? నేను చెప్పేసమాట నూటికి నూరుపాళ్ళు నిజం! నా హీరోతో అన్నాను మొన్న. 'మై హీమాన్! నిన్ను నేను లైక్ చేస్తున్నానన్న నా మనసు నీకు తెలుసు. నేనంటే ఇష్టమన్న నీ మనసు నాకు తెలుసు. ఎందుకూ ఇంకా ఈ దాగుడుమూతలు? లెటజ్ మారీ అండ్ ఎంజాయ్'. అతనూ ఓ.కె. అన్నాడు. ఇంక ఇంట్లో చెప్పడం అంటావా... దట్ ఈజ్ ఎ ఫార్మాలిటీ!"

పద్మలత భయం భయంగా అన్నది- "సరళను మోసం చేసిన లెక్చరరు కూడా అట్లాగే అన్నాట్ట. ఓ.కె. అని"

"పోవే పిరికిగొడ్డా! అందరు మగ వాళ్లూ దగుల్బాజీలు కారే. బ్లాక్ షీప్ మన లోనూ ఉన్నారు. మగవాళ్ళల్లోనూ ఉన్నారు. నేను ప్రేమించిన తిలక్ ట్వంటీఫోర్ క్యారెట్ గోల్డు, ప్యూర్ డయమండ్, ఎ రేర్ జెమ్!"

"ఇట్లా అనుకునే ప్రతి ఆడదీ యుగ యుగాలుగా బోల్తా పడుతోంది" జగదీశ్వరి అన్నది – ఆ జగద్రహస్య సిద్ధాంతం తనకొక్కదానికే తెలుసు నన్నట్టుగా.

"ఇట్లా అనుకోడం చేతకాకే అనేక మంది మిస్‌లు పెళ్ళి బస్సు మిస్సవు తున్నారు" రీటా సన్నగా పలికింది.

పార్వతికి ఓ పద్యం గుర్తొచ్చింది అసు కోకుండా. ఒక వెర్రి మిస్సమ్మనుగూర్చి రాస్తూ కవి అంటాడు శ్రీనీ, పువ్వునూ పోల్చి చెబుతూ "వాడినను వాడకున్నను వాడు పూవు!"

స్త్రీ పురుషులిరువురూ తమ తమ యవ్వనాన్ని పరస్పరం అంకితం చేసు కోవాలి. అప్పుడే వాళ్ళ జీవితాలకు సార్థ కత. అట్లా కాకుండా ఒంటరి బతుకుల్లో వేగిపోతే వేడి నిట్టూర్పులు తప్ప మరేం మిగులుతాయి?

ఆ ఊహ పార్వతికి ఛెళ్ళున కొరడా దెబ్బలా తగిలింది. తానూ తన యవ్వన పుష్పాన్ని శంకర్‌కు అర్పించవలసిందేనా? తను ప్రేమించినవాడు శంకర్. తనను ప్రేమిస్తున్నవాడు శంకర్. ఆ శంకర్‌ను కాదంటే, తులసిలాగా తనూ తొందర పడకపోతే తన జీవితం వ్యర్థంకాక తప్పదా?

కానీ ఆమెను లోలోపలినుండి ఎవరో హెచ్చరించారు. 'ఓసి పిచ్చి పార్వతీ! ఎందుకే ఆ వెర్రిమొర్రి ఊహలు? నువ్వో బోర్‌స్టలు పిల్లవు. హంతకు రాలివి. నీ గతం తెలిస్తే నిన్నెవడు కట్టు కోడానికి సాహసం చేస్తాడు? అయినా నీ ఇష్టమొచ్చినవాడికిచ్చి కట్టబెట్టడానికి నీ బామ్మ అంగీకరిస్తుందనుకుంటున్నావా? కల్లోమాట! అంచేత పిచ్చి పిచ్చి కలలు కనకు. ఒకవేళ వయసు పోడిమి చేత కలలుకన్నా వాటిని ఎవరికీ చెప్పకు. నవ్విపోగలరు!'

కానీ తన తీపి కలల్ని గురించి పార్వతి ఎంత గుంభనగా ఉన్నా, ప్లానిటోరియంలో ఆమె తెలివితప్పడమూ, శంకర్ ఆమెను బయటికి మోసుకు రావడమూ చిలవలు పలవలుగా నర్సమ్మ చెవులను ఎంత త్వరగానో చేరుకు న్నాయి. స్నానం చేసివచ్చి తడి కురులకు అగరుపొగ వేసుకుంటున్న మనవరాల్ని ఆ వృద్ధురాలు నిగ్గదీసింది. ఆ నిగ్గదీయటం లోనూ అట్లా ఇట్లా కాకుండా కుండ




బుద్ధులుకొట్టినట్టు మాట్లాడింది.

"ఏమిటే.. కాలేజీకి వెళ్తోంది చదువుల కోసమా? కంటికి నచ్చినవాడి వొళ్లో కళ్ళు మూసుకుని వాలిపోవడం కోసమా?"

ఆ మాట విని శ్యామల ఖస్సుమని లేచింది. అక్కా తరపున వకాల్తా తీసు కుంది.

"నోటికెంతొస్తే అంత మాట్లాడకు మామ్మా.. బావుండదు! మా అక్కలాంటి అమ్మాయి కంచు కాగడాపెట్టి వెతికినా దొరకదు తెలుసా?"

"ఆహా...తెలుసుతల్లీ తెలుసు! నీ సంగతీ తెలుసు, మీ అక్కా సంగతీ తెలుసు, మీ అమ్మ సంగతీ తెలుసు, మీ నాన్న సంగతీ తెలుసు! అందరి సంగతీ తెలుసు. ఇంతకూ ఎవడే ఆ శంకర్?"

పార్వతి ఏమాత్రం ఎక్సయిట్ కాకుండా నెమ్మదిగా అన్నది-"మా క్లాస్ మేట్!"

"అతని కులం?"

"తెలీదు"

"ఆస్తిపాస్తులు... ?"

"తెలీదు"

"తలిదండ్రులెవరో, ఏమిటోనన్నా తెలుసా?"

"తెలీదు."

"అయితే ఏం తెలుసు? ప్రేమించడం ఒక్కటేనా? అతని గుండెల మీద వాలి పోవడమేనా? నలుగురి ముందూ నవ్వుల పాలు కావడమేనా?"

అప్పుడు అన్నది పార్వతి గంభీరంగా ఒక్కొక్క మాటా వొత్తి పలుకుతూ - "నేనతన్ని ప్రేమిస్తున్నానని ఎవరు చెప్పారు మామ్మా నీకు? ప్రేమలూ, పెళ్ళిళ్లూ, కలలుకనడాలూ ఈ జీవితంలో లేవని నీకూ తెలుసు, నాకూ తెలుసు! నేను కాలేజీకి వెళ్తున్నది చదువుకుని బాగు పడటానికి మామ్మా! మళ్ళీ మళ్ళీ చెబు తున్నాను-నా కాళ్ళ మీద నేను నిలబడ డానికి!! ప్లానిటోరియమ్‌లో ఉండగా కళ్ళు తిరిగాయి. అతని మీద పడిపోయాను. కళ్ళే తిరిగి పడిపోయాను కానీ మనసు చెదిరి పడిపోలేదు మామ్మా! ఈ నీ మనవ రాలు అంత వెర్రిబాగుల పిల్లకాదు. అనవసరంగా ఆందోళన పడకు"

ఆ మాటలకు నర్సమ్మ తెల్లబోయింది. క్షణం వూరుకుని, "అయితే అట్లా చెప్పారేం ఆ పాపిష్టి చచ్చినోళ్లు ?" అన్నది నొసలు ముడిచి.

"పాపిష్టి చచ్చినోళ్లు కదా-అందు కని!" అన్నది శ్యామల ఎగతాళిగా.

నర్సమ్మ వంటపని చూసుకోడానికి లోపలకు వెళ్ళిపోవడం చూసి శ్యామల అక్కా గడ్డం ఎత్తి, ఆమె కళ్ళల్లోకి చూస్తూ – "అతను...అతనంటే నీకు నిజంగా ఇష్టం లేదా అక్కా?" అన్నది నాకు తెలుసులే నీ రహస్యం అన్నట్టుగా.

పార్వతి పేలవంగా నవ్వింది. "తెలుసుకుని ఏం చేస్తావుట?"

"పార్వతీ కళ్యాణం సినిమా తీస్తా!"

"పార్వతి తపస్సే ఇంకా పూర్తి కాలేదు. ఇంకా కళ్యాణం ఎక్కడ? వెళ్లు వెళ్లు. నువ్వు తీసే సినిమా ఇప్పుడప్పుడే పూర్తి కాదులే ! కళ్యాణం సంగతి కట్టి పెట్టి నువ్వు కాలేజీకి వచ్చే సంగతి ఆలోచించుకో!"

మర్నాడు తులసి పార్వతి కోసం ఆమె ఇంటికి వచ్చేసరికి - ఎన్నడూలేనిది సమయంకాని సమయంలో పార్వతి మంచం మీద పడుకుని ఉండటం చూసింది. "ఏమిటే ఇది?"

పార్వతి కళ్ళు ఎర్రగా ఉబ్బి ఉన్నాయి.

తులసి ఆశ్చర్యంగా అడిగింది. "ఏడుస్తున్నావా నువ్వు?"

"ఆడదానికి భగవంతుడు ఇచ్చిన వరం ఏడుపు" పార్వతి లేచి కూచుంది. గబగబా కాలేజీకి తయారు కావడం మొదలెట్టింది.




శరభలింగం చిందులేస్తున్నాడు ఆ గదిలో. పల్లెటూళ్ళో స్వాతంత్ర్యానంతరం సిద్ధించిన నడమంత్రపు సిరికి తార్కాణంగా ఉంది ఆ ఇల్లు. నలభై ఏళ్ళ క్రితం పండిన పంటకు గిట్టుబాటు ధర పలికేది కాదు. ఇప్పుడు ఆ ఇంటి యజమాని సంవత్సరానికి మూడు పంటల్ని వేసుకుని పండిన పంటను లాభసాటి వ్యాపారంగా మార్చుకోగలుగుతున్నాడు. పొగాకు అతని ఇంటి ఫ్లోరింగ్‌ను మొజాయిక్ చేసింది. పసుపు అతనింటి గోడలకు డిస్టెంపర్లు వేసింది. చెరకు అతని గదుల్లో ఎయిర్ కండిషనర్లనమర్చింది.

ఆ గదిలో నాలుగువేపులా నిలువెత్తు అద్దాలున్నాయి. అద్దాల మీద ఉన్న దుప్పికొమ్ములూ, ఏనుగుదంతాలూ ఎదుటి వేపు ప్రతిఫలిస్తున్నాయి. నేలంతా కాశ్మీరు తివాచీ. ఓ పెద్దమెత్తటి సోఫాలో కిందకు కూరుకునిపోయి కాలుమీద కాలు వేసుకుని త్రీఫైవ్స్ కాలుస్తున్నాడు అప్పారాయనింగారు.

ఓ మూలగా నుంచుని వున్నది నర్సమ్మ. శరభలింగం చిందులకూ, అప్పారాయని మొహంలో కదులుతున్న క్రౌర్యానికీ అర్థం ఏవిటా అని ఆలోచిస్తున్నది ఆ వృద్ధురాలు.

"కొత్త చీపురుతో నాకు దేహశుద్ధి చేస్తుందట బాబూ ఈ ముసిల్ది" శరభలింగం కసిగా అన్నాడు. "నాకు జరిగిన అవమానానికి దొరవారు దీనికి బుద్ధి చెప్పాలి!" అని కలిపాడు.

ఆ మాటలు విని నర్సమ్మ తోక తొక్కిన తాచులా, కళ్ళల్లో నుండి విస్ఫులింగాలను ప్రసరించింది. "దేహశుద్ధి కాదురా శరభయ్యా—నీవంటివాడికి మెడకు ఉరి తగిలించినా ఆడకూతుళ్ళ ఉసురు పోదు" అన్నది పెద్దగొంతుతో.

అప్పారాయనింగారు పెదవుల చివర నుండి వంకరగా నవ్వారు. "అంత నేరం ఈ పంతులేం చేశాడు నర్సమ్మగారూ?" అని నిదానంగా ప్రశ్నించేరు.

"మూడో పెళ్ళికి నా మనమరాల్ని ఇయ్యమని రాయబారం చెయ్యడం నేరం కాదూ?"

"ఎవరుట ఆ మూడో పెళ్ళి వరుడు?"

"ఎవడో ఓ భ్రష్టుడు" నర్సమ్మ విసుగ్గా అన్నది. "ఇప్పుడదంతా ఎందుకుగానీండి. తమరు పిలిపించారంటే తమ మీద వున్న గౌరవంతో, పొయ్యిమీద బియ్యం అలాగే వదిలేసి ఇట్లావచ్చాను. ఇంటికి పిల్లలొచ్చే వేళయింది. పిలిపించిన పనేమిటో చెప్పండి. వినేసి వెళ్ళిపోతాను"

"చెప్తాను. తొందరపడకు. లోగడ మా శరభలింగం ఏం చెప్పాడు నీకూ?"

యాష్‌ట్రేలో సిగరెట్టు నుసిరాల్చాడు. దానితోవే మరో కొత్త సిగరెట్టు వెలి




గించాడు. పక్కనేవున్న బెల్ నొక్కాడు. 'బాబుగోరూ!' అంటూ పిటపిటలాడే ఓ పనిపిల్ల వచ్చింది. గోడగడియారం వేపు చూశారాయన.

"అర్థమయినాది బాబూ" అంటూ ఆ పిల్ల అవతలకు వెళ్ళింది. ఓ సీసా మూత తీసిన చప్పుడు. సోడా కుంయ్ మన్న శబ్దం. ఆ అమ్మాయి వైట్ హార్స్‌ను గ్లాసులో నింపుకుని తీసుకుని వచ్చి ఆయనకు ఇచ్చింది. ఆయన కళ్ళల్లో ప్రశంస. మెచ్చుకోలుగా ఓ ఐదు రూపాయలనోటు ఆ పిల్ల మీద విసిరేశాడు. ఆ పిల్ల నవ్వుకుంటూ ఆ నోటును జాకెట్లో దాచుకుంటూ అవతలకు వెళ్ళిపోయింది.

నర్సమ్మకు ఆయన ప్రవర్తన దుస్సహంగా ఉంది. అయిదురూపాయలకోసం నవ్వును పెదాలకంటించుకున్న ఆ పనిపిల్లను చూస్తే జాలివేసింది.

"ఏదో చెప్పాడు" అన్నది అప్పారాయనింగారి ప్రశ్నకు విలువయిన సమాధానం ఆదేనన్నట్టు.

"ఏదో కాదు బాబూ! యాభయి ఎకరాల లంకపొలం అన్నాను. కొబ్బరి తోటలన్నాను. అరటితోటలన్నాను. చెరకుతోటలన్నాను. మొదటి సంబంధానికి ముగ్గురు పిల్లలన్నాను. రెండో సంబంధానికి నలుగురు పిల్లలన్నాను. పార్వతే గనుక ఇష్టపడితే అయిదుగురు బిడ్డల కన్నా ఆ పిల్ల తల్లవుతుందన్నాను!"

శరభలింగం మాటలకు అప్పారాయనింగారు మీసం మెలేశారు. మెడలో వేలాడుతున్న పులిగోరును సవరించుకున్నారు. అయిదు వేళ్ళకూ ఉన్న రాళ్ళ ఉంగరాలను అటూ ఇటూ కదిల్చారు.

"ఇంకేం కావాలి నర్సమ్మా ఆడదానికి?" అన్నారు అమాయకంగా మొహం పెట్టి. "కావలసినంత సంపదకడుపాకలితీర్చుకోడానికి. కౌగిట్లోఇమడనంత మగతనం కడుపుపంట పండించుకోడానికి. ఇవేకదా ఆడదాని జీవితానికికావలసినవి?"

ఎక్కడ ఉమ్మేయడమా అని నర్సమ్మ అటూ ఇటూ దిక్కులు చూసింది. కిటికీ దగ్గరకు వెళ్ళి కిటికీ ఊచల్లోనుండి బయటకు ఉమ్మేసి వచ్చింది.

"బాబూ...ముసలిదాన్ని. చదువుకోనిదాన్ని. నాకు నాగరీకం తెలీదు. కడుపాకలి తీర్చుకోడానికి పొలాలూ, తోటలే ఉండాలా బాబూ? నా దృష్టిలో ఆకలి తీర్చేది చెమటబొట్టే బాబూ! కడుపు పండించుకోవాలంటే క్షేత్రాన్నే కాదు బాబూ, బీజశుద్ధిని కూడా చూసుకోవాలనేది మా పెత్తల్లి పాపాయమ్మ!"

అందులోవున్న వాడిమాట వేడిగా తగిలింది అప్పారాయనింగారికి. తన ప్రవర్తనను ఎట్లా ఎద్దేవా చేసింది ముసలి నర్సమ్మ! తన చెడు తిరుగుళ్ళను అన్యాపదేశంగా సూచనచేయడం కాదూ ఆ మాట? 'బీజశుద్ధి' అంటే తన మగతనం కళంకితం అని కాదూ ఆమె భావం? తృతీయానికి సిద్ధమయిన ఆ పెళ్ళికొడుకు తానే అని వాచ్యంచేస్తే అప్పుడేమంటుందో నర్సమ్మ? తెలుసుకోవాలనిపించింది ఆయనకు. శరభలింగం వేపు 'చెప్పవయ్యా' అన్నట్టు చూశాడు.

"ఆగవే ముసల్దానా! నోటికెంతొస్తే అంత వాక్కు. మీ మనవరాల్ని చేసుకుందామని ముచ్చటపడింది మా దొరవారే!"

ఆ విషయాన్ని తను అంశకుముందే ఊహించేశానన్నట్టుగా నర్సమ్మ ఆ మాట విని కూడా ఉలుకూ పలుకూ

లేకుండా, రాయిలాగా నిలబడింది. ఆమె నిశ్శబ్ద గాంభీర్యం వాళ్ళను విచలితుల్ని చేసింది కవంతసేపు. మళ్ళీ అంతలో తమను తాము కూడదీసుకున్నారు.

శరభలింగమే మళ్ళీ అడిగాడు. "ఏం..సంతోషంగా లేదూ నీకు?"

''లేదు బాబూ...'' నర్సమ్మ తొణుకూ బెణుకూ లేకుండా అన్నది.

''లే...దా?"

''అంతస్తులు దూరం. అంతర్యాలు దూరం. ఒకరి ఆలోచనలు మరొకరికి గిట్టవు. ఒకరి ఆచరణ మరొకరికి సహించదు. పైగా ఆడపిల్లకు తన ఈడు వాడే మగడు కావాలన్న కోర్కె చిన్నప్పటినుంచీ గుండెలో గూడు కట్టు కుని పెరిగిఉంటుంది. తండ్రి వయసు వాణ్ణి, తాత వయసువాణ్ణి తాళి గట్టినా సరసుడుగా ఆమె మనసు, ఆమె వయసు, ఆమె శరీరం అంగీకరించలేవు బాబూ" ఎంతో నెమ్మదిగా అన్నది.

"దొరవారు తాతలాగా కని పిస్తున్నారా?" శరభలింగం ఆవేశంగా అన్నాడు.

"నాకన్నా రెండుమూడేళ్ళ చిన్నేమో రాయనింగారు''

శరభలింగం నిప్పుతొక్కిన కోతి లాగా ఆ మాట విన్నాడు. "వారి మగసిరి బలిమి నీకేం తెలుసే ముసల్దానా?"

నర్సమ్మ నవ్వింది. "వారికి చిన్నప్పుడు సీమచింతకాయలు నేను కోసిచ్చేదాన్ని ఎవరూ చూడకుండా! ఒకసారి వారు గుర్రపుస్వారి నేర్చుకుంటున్నారు. ఆ పొగరుబోతు గుర్రం ఆయన్ని కిందపడేసి పారిపోయింది. అప్పుడాయన గాయాలన్నీ నేనే కడిగి దగ్గరున్న ఆకుపసరు రాసి నయం చేశాను. ఎంత ధైర్యమో తెలుసా మీ రాయనింగారికి? అట్లా కింద పడ్డంలో లోపల లాగు అంతా తడిపేసు కున్నారు. ఆ లాగు విప్పదీయించి దగ్గ రున్న చెరువులో నేనే ఉతికిచ్చాను"

ఆమె పకపక నవ్వసాగింది. గత చరిత్రను ఆమె ఉటంకిస్తుంటే అప్పా రాయనింగారికి కణతలు కణకణలాడాయి. సుదురు చెమట పట్టింది.

కాని ఆ చరిత్ర తవ్వుతుంటే నర్సమ్మకో రకం సంతృప్తి కలగసాగింది. తన ధోరణిలో తాను చెప్పుకుపోసాగింది— "కింద పడడంలో పాపం వారికి ఎంత ప్రమాదమైందో నీకేం తెలుసు శరభ లింగం? ఎన్ని లేహ్యాలు వాడినా ఆయన బతుకు శిఖండిబతుకే అన్నారు ఆచార్లు గారు. కదండీ రాయనింగారూ?''

తానంతవరకూ ఎంతో భద్రంగా దాచుకున్న తన జీవిత రహస్యాన్ని ఆమె ఆ విధంగా బట్టబయలు చేయడంతో అప్పారాయనింగారు ఆగ్రహాన్ని ఆపు కోలేకపోయాడు.

''ఆపు నీ కట్టుకథ?'' అని పెద్దగా, ఉరుము ఉరిమినట్టుగా అరిచాడు. నర్సమ్మ చెప్పేది విన్న శరభలింగం మస్తిష్కంలో ఒకటే ఒక ఊహ తటా లున మంటలా జ్వలించింది. ఆమె మాటే నిజం అయితే, అప్పారాయనింగారి పెద్ద భార్య సంతానం, వారి రెండో భార్య సంతానం... రామరామ! ... మహా ఋషుల వంశ క్రమం గురించీ, మహా నదుల పుట్టుకను గురించీ ఆరాతీయ కూడ దంటారు. అట్లాగే, పెద్దవాళ్ళ సంతా నాన్ని గురించి కూడా మనం పట్టించుకో కూడదన్నమాట. అప్పారాయనింగారి పెద్ద భార్య ఇరవై నాలుగ్గంటలూ ఆ పొలా ల్లోనే కాపురం చేసేది. శ్రీవారి రెండో





భార్య అస్తమానం పట్నంలోనే పొద్దు పుచ్చేది. పొలాల్లో ఆమెకేం వెచ్చదనం లభించిందో, పట్నంలో ఈ మెకేం వెలితి పూడిందో – అది దేవ రహస్యంగానే మిగిలిపోయింది. అప్పారాయనింగారికి మాత్రం సంవత్సరం తిరక్కుండా సంవత్సరం తండ్రి యోగం పట్టిం ది. ఇదంతా ఇంతవరకూ తెరచాటు సంగతి గానే మిగిలిపోయింది. ఇప్పుడు నర్సమ్మ మనమరాలిని రాయనింగారు కోరుకోవడంతో పార్వతిలాంటి దొండపండుకు ఆయన కాకిముక్కు అని చెబుతూ, ఈ ర హ స్యా న్ని కూడా అనుకోకుండా నర్సమ్మ బయట పెట్టేసింది. అట్లా పెద్దవాళ్ళ గుట్టు బయట పెట్టడం చిన్నవాళ్ళకు గుండెలమీద కుంపట్లు పెడతాయి అని ఆమె కానుకోలేకపోయింది. ఆ ఆవేశ క్షణంలో ఆవేశం ముందు అనుభవం తల వొంచుకుంది.

''లింగం... ఆ ముసలిదాన్ని అట్లా వాగనిస్తావేం ?'' అప్పారాయనింగారు గర్జించాడు.

ఆ మాటకే అంతవరకూ ఎదురు చూస్తున్నట్టుగా శరభలింగం ఒక్క ఉదుటున నర్సమ్మ మీదకు లంఘించాడు. ''ఏమిటే ముసల్దానా... ఏమిటి నువ్వంటున్నది ? మా అయ్యగారి మగసిరినే శంకిస్తున్నావా? ఆయన నిప్పులాంటి వంశానికే మచ్చనంటగడతావా ?'' అంటూ ఆ వృద్ధురాలి ఆ చెంపా, ఈ చెంపా వాయించేశాడు. ఆమె జుట్టు పట్టుకుని ఫెడీఫెడీ గుద్దేశాడు. నోటిమీద చేతితో బలంకొద్దీ కొట్టాడు. ఆ రకం పశుత్వానికి ఆమె సిద్ధపడిలేదు. అసలే వడలిపోయిన బడుగు శరీరం. మాట బింకంతో కాలం నెట్టుకొచ్చింది ఇంతవరకూ. నోరుపెట్టుకు బతికేసింది. ఇప్పుడు ఒక మొరటు మగవాడు తన మీద పడి ఆ విధంగా అఘాయిత్యం చేస్తోంటే, నిస్సహాయంగా ఆమె కింద కూ ల బ డి పోయింది. తెల్లని ఆమె జుత్తు పిడివడి పోయింది. ఆమె ముందుపన్ను ఒకటి రాలి కిందపడిపోయింది. వెన్నుపూస విరిగినట్లయింది. జరుగుతున్న ఘాతుకానికి ఆమె కంటనీరు ధారగా కారసాగింది.

''ఓరి నీ చేతులు పడిపోనూ, నీ వంశంలో పీనుగెళ్ళా, నువ్వు దుంపనాశనం అయిపోనూ, నీ ఆడది ముండమొయ్యా, నీ సంతానం అడుక్కుతినా'' అంటూ నోటికి వచ్చినట్లల్లా తిట్టసాగింది.

ఆమె తిట్టినకొద్దీ శరభలింగం దుశ్శాసనుడిలా పగలబడి నవ్వసాగాడు. మగవాడి దురహంకారానికి, దౌష్ట్యానికి ఆడదాని వయసుతో నిమిత్తం లేదని మరో సారి నిరూపించాడు.

నర్సమ్మ కింద కూలబడిపోయి అట్లా ఏడుస్తోనే ఉంది. అప్పారాయనింగారు పక్కనే వున్న బెల్లు నొక్కారు. పిటపిటలాడే పిల్ల వచ్చింది మళ్ళీ ఆ గదిలోకి.

''ఏమే...గదిలోకెళ్ళే ముందు నువ్వు నాకేమిస్తావ్?''

ఆ పిల్ల భయం భయంగా అన్నది– ''ఊర పిచ్చుక లేహ్యం గురించేనా మీరు అడుగుతున్నది బాబుగోరూ?''

ఊరపిచ్చుక లేహ్యమేకాదు, మదన గుళికల సీసాలు, నెర్విటాల్ బాటిల్స్ వగైరాలు కూడా తెప్పించి ఆమె ముందు ప్రదర్శించాడు. కసికసిగా అన్నాడు–

''ఈ గుండే సాక్ష్యం నా మగతనానికి ! ఇన్ని మందులు ఎవడు తినగలడు? ఎవడు హరాయించుకోగలడు? తిన్న తరువాత ఈ మగవాడి ముందు

ఏ ఆడది నిలబడగలదు? చెప్పవే నంజ దానా?" అంటూనే ఆ పిల్ల పిర్రల మీద ఒక చపేటా ఇచ్చాడు.

ఆ వలపుకత్తె మూడు గిరికీలు తిరిగింది. వయ్యారాలు పోయింది. "అబ్బో! అప్పారాయనింగారు వలపు దొరలు. రసికరాజులు. వారితో ఢీకొని నెగ్గడం కష్టం బాబూ!" అన్నది అర్థ వంతంగా.

"సర్లే...ఇక వెళ్ళు"

ఆ పిల్ల వెళ్ళిపోయింది– జఘన సౌందర్యం ప్రదర్శిస్తూ.

అప్పారాయనింగారే మళ్ళీ అన్నాడు–"శరభలింగం...నర్సమ్మను లేపి నుంచో బెట్టు!"

శరభలింగం నర్సమ్మను నుంచో బెట్టాడు. నాలుగువేపులా వున్న నాలుగు



అద్దాల్లోనూ నర్సమ్మ రూపం జాలిగా, దీనంగా కనిపిస్తోంది.

"ఇప్పుడు ఈ నాలుగు గోడల మధ్యా అన్న ఆ మాటనే నువ్వు బయట కూడా అనొచ్చు!"

'అనను' అన్నట్టు నర్సమ్మ తలా డించింది.

"నిన్ను నమ్మిందెవరు? ఈ ఆరోపణ విషయంలో శాశ్వతంగా నీ నోరు మూయిం చెయ్యాలంటే ఒకటే ఒక మార్గం వుంది"

నర్సమ్మ అతని వేపు ఆశగా చూసింది. ఆ ఆశలో భయం మిళితమై వుంది.

అప్పారాయసింగారు మీసాలు మెలే శారు.

"నీ మనవరాల్ని నాకిచ్చి కట్ట బెట్టడమే!"

నర్సమ్మ తల అడ్డంగా ఆడించిందీ.

"ఇంత జరిగింతర్వాత ఇంకా నా మనవరాల్ని ఈ నరకంలోకి అడుగుపెట్టనిస్తాననుకున్నారా? ఆ ఆలోచనే విరమించుకోండి. మా బతుకులు మమ్మల్ని బతకనివ్వండి! నా మానాన్న నన్ను వెళ్ళిపోనివ్వండి!"

అప్పారాయనింగారు వికటంగా నవ్వారు. "మా శరభలింగాన్ని కొత్త చీపురుతో సత్కరిస్తానన్నాక, నన్ను మగవాడే కాదు పొమ్మన్నాక అందుకు నీకు శిక్షవేయకుండా ఊరుకోలేము. ఆ శిక్ష నీ మనవరాలు నా పెళ్లాం కావడమే"

"అది కలలో మాట" నర్సమ్మ మరింత మొండిగా అన్నది.

"నీ చేత అవుననిపించడం నిముషాల్లో పని నర్సమ్మా!" అప్పారాయనింగారి చేతుల్లోకి హంటర్ వచ్చింది. గోడ అవతల వున్న అల్సేషియన్ క్రూరంగా లోపలకు తొంగిచూసింది.

"నిన్ను పది నిలువుల లోతున పాతిపెట్టేస్తాను. నీ మనవరాల్ని రాక్షసంగా ఎత్తుకొచ్చి నా కోర్కె తీర్చుకుని నా ఇంట్లో ఊడిగం చేయిస్తాను. ఈ ఇంట్లో, ఈ నాలుగు గోడలమధ్యా జరిగే సంగతులు నరమానవుడిక్కూడా తెలియవు నర్సమ్మా... అంచేత నువ్వు అనవసరంగా బలికాబోకు. నీ మనవరాల్ని అన్యాయం చెయ్యకు. లక్షణంగా పది మంది ముందూ పార్వతిని నా స్వంతం చెయ్. అప్పుడు పార్వతి ముత్యాల పల్లకిలో ఊరేగుతూ ఇక్కడికి వస్తుంది. కాదూ, నువ్ పట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నావో ఎనిమిది కాళ్ళ రథంమీద మీ ఇద్దర్నీ కూచోపెట్టేసి, పువ్వులు చువ్వుతూ, పైసలు చల్లుతూ, బాకా లూదుతూ మిమ్మల్ని కాటికాడికి సాగనంపించేస్తాను"

నర్సమ్మకు నోట్లో పన్ను వూడిపోయిన చోట బాధ. చెంపల మీద దెబ్బలు తగిలిన చోట బాధ. గుండెల్లో మాటలు తూట్లు పెడుతున్న చోట బాధ. ఆ బాధ నామె అతికష్టం మీద అదిమిపెట్టుకుంది. 'ఎట్లా ఈ నరకంనుంచి బయట పడడం?' అన్న విషయం మీద ఆమె అతితీవ్రంగా ఆలోచించడం మొదలుపెట్టింది.

ఆమె మౌనాన్ని వాళ్లు తిరుగుబాటుగా భావించారు. ఆమె వీపుమీద కొరడా ఫెళ్లుమంది. ఆమె ముందుకు తూలి పడింది.

"పార్వతినిస్తావా లేదా?"

ఆమె ఫలిత కేశాల్లో కొరడా కొసలు చిక్కుకున్నాయి. కొరడా వేగంగా వెనక్కు రావడంతో కేశాల కుదుళ్లకదిలి ఆమె ప్రాణవాయువులు ఊగిసలాడాయి. కింద నిస్సహాయంగా పడిపోయిన ఆ వృద్ధురాలి బలహీనమైన చేతులు అప్పారాయనింగారి పాదాలను స్పృశించాయి. కుక్కను తన్నినట్టు ఒక్క తన్ను తన్నాడు ఆయన. నర్సమ్మ వెళ్ళి ఓ మూల బట్టలమూటలా పడ్డది. తను నిస్సహాయురాలు. తనకు చావు ఖాయం. చావును తప్పించుకోవాలంటే ఆ రాక్షసుడి కోర్కెను తను అంగీకరించి తీరాలి. పార్వతి నూరేళ్ళ జీవితాన్ని తను బుగ్గిపాలు జేయాలి. 'అమ్మా...పార్వతీ! అంత పని నేను లేయలేను తల్లీ! ఈ ముసలి ప్రాణం ఏమైపోయినా పర్వాలేదు. నువ్వు మాత్రం సుఖంగా ఉండాలి' అనుకుంది లోలోపల.

ఒక్కసారి కళ్ళెత్తి కనుచివరలనుంచి అప్పారాయనింగారిని, శరభలింగాన్ని చూసింది. ఓ గదిలోఓపిల్లిని బంధించి




దాన్ని బాదడం ప్రారంభిస్తే, తిరగబడ డానికి సిద్ధంగావున్న దాని మనస్తత్వం లోకి వచ్చింది నర్సమ్మ.

ఎట్లాగూ చావు ఖాయమైనప్పుడు తిరగ బడి వీరోచితంగానే చనిపోదామనుకుంది నర్సమ్మ. పూనకం వచ్చినదానిలా ఆమె ఒక్కసారిగా లేచి నిలబడింది. ఆగ్ర హంతో, ఆవేశంతో అటూ యిటూ ఊగి పోయింది.

"ఒరేయ్ ఛండాలుడా! నా పార్వతిని నీవంటి నీచుడికి, జారుడికి, నపుంసకుడికి, పరాన్నభుక్కుకు ఎన్నటికీ అంకితం చెయ్యనురా!" అంటూ అప్పారాయనిం గారిని వెళ్ళి ఢీకొట్టింది– అనేక కష్టాలను మోసి మోసి గట్టిపడిపోయిన తన తలతో.

ఈ హఠాత్ సంఘటనకు ఆయన సిద్ధపడిలేదు. బీరు, సీరు, తేనీరు తప్ప ఆయన ఒంట్లో రక్తం ఎప్పుడో ఇగిరి పోయింది. సిగరెట్ల నుసితప్ప ఆయన కండలెప్పుడో కరిగిపోయ్యాయి. ఆయన చాపచుట్టగా కిందపడిపోయాడు.

ఆయన చేతిలో ఉన్న హంటర్‌ను లాగేసుకుంది నర్సమ్మ. తనంత పొడ వున్న ఆ హంటర్‌ను రెండు చేతుల్తోనూ పట్టుకుని ఆయనను అదేపనిగా కొట్ట సాగింది. మధ్యలో ఆ కొరడా శరభ లింగం వేపు కూడా తిరిగింది. అతను అడ్డురాబోయాడు. కొరడా చివుళ్ళ తగిలి ప్రాణం జివ్వుమని "అమ్మ..రాక్షసి ముండా" అంటూ దూరంగా పరు గెత్తాడు.

"పట్టుకో పట్టుకో...దాన్ని పట్టుకో. ఆ కొరడా లాగేసుకో" అప్పారాయనిం గారు బలహీనంగా అరుస్తున్నారు.

"దగ్గరికొస్తే చంపేస్తా" నర్సమ్మ ముసలిసింహంలా గర్జించింది. "తలుపు తీమను. నన్ను వెళ్ళనీ!"

శరభలింగానికి ఏంచెయ్యడానికీ పాలు పోలేదు. అప్పారాయనింగారు బెల్లు నొక్కారు. పిటపిట లాడుతున్న పిల్ల తలుపుదగ్గర ప్రత్యక్షమైంది – "బాబు గోరూ!" అంటూ.

"తలుపులు తెరూ" అప్పారాయనిం గారి కంఠం నూతిలో గొంతుకలా విని పించింది.

"దీన్ని వెళ్ళిపోనీ!"

ఆ మాట ఆయన అనకముందే నర్సమ్మ తలుపులు దగ్గరకు పరుగెత్తింది. పనిపిల్లను రెండు చేతులతోనూ అవతలకు నెట్టేసి బయటకు దూకేసి కిందపడిపోయి, అంతలోనే లేని బలం తెచ్చుకుని లేచి నిలబడి గదిలోనుండి వరండాలోకి, వరండాలో నుంచి ఆరుబయటకు, అక్కణ్నుంచి రోడ్డుమీదకు పరుగెత్తింది.

శరభలింగం అరిచేడు. "టైగర్నొదలండి దొరా! తవరి పనీ, నా పనీ అదే పూర్తిచేస్తుంది"

అంతవరకు తనకా ఐడియా రానందుకు సిగ్గుపడుతూ అప్పారాయనింగార్ని పుసిగొలిపాడు శరభలింగం.

ఆ మాట ఆయనకు అమృతంలా వినిపించింది. దెబ్బతిన్న అప్పారాయనిం గారు టైగర్ వేపుచూసి "ఊఁ!" అంటూ తలెగరేశాడు. అంతే! ఆ జాతి జాగిలం తుపాకీ తూటాలా నర్సమ్మ వేపు దూసుకు పోయింది.

ముందు నర్సమ్మ, ఆ వెనకే చొంగ కారుస్తూ కళ్ళు చికిలించి, తోక ఎగనెత్తి నిక్కబొడుచుకున్న వెంట్రుకలతో, వేడి గాలి వదులుతున్న ఉబ్బిన ముక్కు పుటాలతో భూమిమీద అడుగువేయడం కన్పించనంత వేగంగా టైగర్....

తొలిఝాము గడిచిన వేళ ఆ రోడ్డు మీద జనం ఎవరూలేరు. తెలుగు పల్లె టూళ్లు తొందరగా నిద్రపోతాయి. ఆ వూరూ అందుకు భిన్నంగాలేదు. అంచేత నర్సమ్మ-టైగర్‌ల పరుగుపందెం ఎవరూ చూడలేదు. మనిషిని కుక్క వేటాడడం అప్పుడు ఎవరికంటా పడలేదు.

టైగర్ నర్సమ్మ మీదకు ఎగిరి దూకింది. ఆ కుక్క కాళ్లు ఇనపశూలాల్లా ఆమెను తాకాయి. నర్సమ్మ గావుకేక పెడుతూ కింద పడిపోయింది. టైగర్ నర్సమ్మ మొహాన్ని చీరేసింది. ఆమె కట్టుకున్న చీరను బదాబదలు చేసింది. ఆమెలోని కొద్ది మాంసాన్ని ముక్కలు ముక్కలుగా బయటకు లాగేసింది. రక్తం వోడుతూ అచేతనంగా పడివున్న ఆమె దేహాన్ని తన యజమాని ఇంటి వేపుగా వాడి పళ్ళతో లాక్కుపోవటానికి ప్రయత్నం చేసింది. ఒకటి రెండుసార్లు ఆ ప్రయత్నం విఫలమై కాసేపు నిశ్చలంగా నిలబడి చచ్చినట్లు పడివున్న నర్సమ్మ వేపు క్రూరంగా చూసి ఆ తర్వాత విజయగర్వంతో వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది.

నర్సమ్మ రక్తం కారుతున్న గాయాలతో, మూగుతున్న ఈగలతో, కుడుతున్న చీమలతో దిక్కులేకుండా అట్లా ఆ రోడ్డు పక్కనే పడివుంది రెండు మూడు గంటలపాటు. ఆ తర్వాత యాదృచ్ఛికంగా తెలిసినవాళ్ళు అటు రావడంతో చేతులమీద మోసుకుంటూ ఆమెను ఆమె ఇల్లు చేర్చారు. ఆచార్లగారికోసం పరుగెత్తారు.

* * *

గా రాబంగా తను పెంచుకుంటున్న శ్యామలను, అపురూపంగా కాపాడుకున్న పార్వతిని, అభిమానంగా చూసుకున్న తులసిని, మాటల ఈటెలతో గాయపర్చి తనకు దూరంగా అట్టే పెట్టిన చుట్టుపక్కల వాళ్ళను-అందర్నీ గాజుకళ్ళతో చూసింది నర్సమ్మ.

గోడమీద వున్న రకరకాల దేవుళ్ళూ ఆమెను రిసీవ్ చేసుకోటానికి తొందరపడుతున్నట్లుగా కనిపిస్తున్నారు. గదిలో గోడమీద వున్న ఆమె కూతురు 'నా కోసం నా కూతురు హత్యకు సిద్ధమైంది. నా కూతురు కోసం నువ్వు నీ బ్రతుకు త్యాగం చేశావు. నిన్ను చూసి నేను గర్విస్తున్నానమ్మా...కృతజ్ఞతలతో నమస్కరిస్తూ నా లోకంలోకి నిన్ను ఆహ్వానిస్తున్నాను' అన్నట్లుగా వుంది.

సూర్యుడు కూడా దిగులుగా వున్నట్లు కనిపిస్తున్నాడు. మంచు బిందువులతో చెట్ల ఆకులు కన్నీళ్లు కారుస్తున్నట్లున్నాయి. గాలి నీరసపడిపోయినట్లు వీస్తోంది.

నర్సమ్మకు ఆ స్థితి ఎట్లా కలిగిందో ఎవరికీ అర్థం కావడం లేదు. నర్సమ్మ సంజ్ఞలతోనైనా ఏమీ సూచించడానికి ఇష్టపడడం లేదు. ఎవరెవరో వస్తున్నారు, పరామర్శిస్తున్నారు, సానుభూతి తెలిపి పోతున్నారు.

ఆచార్లగారి కోసం ఒకటికి రెండుసార్లు కబురు వెళ్ళింది. అయినా ఆయన రాలేదు.

వెళ్ళిన మనిషి తిరిగి వచ్చి, పార్వతిని పక్కకు పిల్చి, "అమ్మా! ఆచార్లగారు ఇంట్లోనే వుండి లేదనిపిస్తున్నాడని అనుమానంగా వుంది నాకు" అన్నాడు.

"ఎందుకనీ?" అన్నది పార్వతి. ఆచార్లగారికి తన మామ్మంటే ఎంతో అభిమానం లోగడ. ఎన్నోసార్లు ఎన్ని





విధాలుగానో తమను ఆదుకున్నాడని మామ్మ చెబుతుండేది. రోగంలో, కష్టాలలో, చలిలో, వానలో, ఎండల్లో, బాధల్లో-ఆయన ఆ పల్లెటూళ్ళో తమకు అండగా నిలబడ్డాడని అంటుండేది. అటు వంటిది ఇప్పుడు తన మామ్మకు ప్రాణం మీదకు వస్తే ఆయన వచ్చి వైద్యం చేయకపోవడమేవిటి?

"ఎందుకనో నాకు తెలీడం లేదు తల్లీ! కానీ ఓ విషయం మాత్రం నాకు వింతగా అనిపించింది అక్కడ. అప్పారాయనిం గారి మనుషులు ఒకరిద్దరు ఆయన ఇంటి మొగదల నాకు కనిపించారు. వాళ్ళే అన్నారు నాతో ముందస్తుగా - పాపం, నర్సమ్మ పని అయిపోయిందటగా, ఆచార్లగారు వైద్యానికి రాలేర్లే - వెళ్ళు వెళ్ళు అని" అంటూ ఆ పరిచయస్థుడు తన అనుమానాన్ని బయటపెట్టాడు.

"అప్పారాయనింగారి మనుషులా..?" పార్వతి భ్రుకుటి ముడిచింది.

ఆమె తల ఎత్తేసరికి శంకర్ కను పించాడు. ఎంతో ఆదుర్దాతో వచ్చినట్లుగా మనిషి నలిగిపోయి వున్నాడు. వస్తూనే మరో మాట అనకుండా "మీ మామ్మ గారికి బావుండలేదటగా- మనవాళ్ళంతా అను కొంటున్నారు. ఉండబట్టలేక వచ్చేశాను" అన్నాడు ఆయాసాన్ని కప్పిపుచ్చు కోటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ.

ఆ సమయంలో శంకర్‌ను చూడగానే ఎవరో ఆత్మీయమైన వ్యక్తిని కలుసు కున్నంత ఆనందం కలిగింది పార్వతికి. కొండంత ధైర్యం వచ్చింది. 'పర్వాలేదు, ఇహ ఏ ఆపదనైనా ఎదుర్కోవచ్చు' అని పించింది ఆమెకు.

"అవును...బావుండలేదు. రండి లోపలకు" అంటూ శంకర్‌ను తన మామ్మ పడుకొన్న చోటుకు తీసుకు వెళ్ళింది.

"ఎవరా ఈ కొత్త వ్యక్తి?" అంటూ అక్కడివాళ్ళు అతనివేపు ఆశ్చర్యంతో చూశారు. అతణ్ని చూసి తులసి దగ్గరగా వచ్చింది. "తిలక్‌ను కూడా తీసుకురాక పోయారా?" అన్నది.

ఇంతలో లోపల్నుండి శ్యామల రెండు కప్పుల్తో కాఫీ తీసుకు వచ్చి వాళ్ళిద్దరికీ ఇచ్చింది.

"నాకెందుకే ఇప్పుడు ? అయినా అవతల మామ్మకు అట్లావుంటే ఈ మర్యాదలెందుకూ?"

"నీకోసం కాదులే ! అలసిపోయి వచ్చిన శంకర్‌గారి కోసం ! ఆయనకు కంపెనీగా నువ్వున్నందుకు!"

"ఆయనకు కంపెనీ మీ అక్కయ్యే, నేనుగాదు!"

అంతటి విషాద పరిస్థితిలో కూడా చతురోక్తి మానని తులసిని చూసి శంకర్ నిజంగా ఆశ్చర్యపోయేడు. 'మరణదేవత సముఖంలో ఉండికూడా ఆ అమ్మాయి పెదాల మీద ఆ చిరునవ్వు తరకలేమిటి?' అనుకున్నాడు.

లోపలనుంచి వస్తున్న పార్వతికి తన స్నేహితురాలి మాట వినగానే చెంపలు అరుణారుణాలయ్యాయి. విననట్టుగా మొహం అవతలకు తిప్పేసింది.

నర్సమ్మకు తులసి మాటలు వినబడు తూనేవున్నాయి. సిగ్గుతో ఎర్రబడ్డపార్వతి మొహమూఆమెకుస్పష్టంగానేకన్పించింది. నీటిపొరలుకమ్మిన కళ్ళతో ఆమె శంకర్ వేపు చూసింది. శంకర్ బొమ్మ స్పష్టంగా కనబడలేదు. కళ్లు మూసుకుని రెప్పల్ని గట్టిగా నొక్కిపట్టింది. కళ్ళల్లో నిల్చిన నీళ్లు చివరలగుండా చెంపలమీదుగా కిందికి జారిపోయాయి. కొద్దిగా తేటబడిన కళ్ళతో

ఈసారి ఆమె శంకర్ వేపు చూసింది. శంకర్ మొహం స్పష్టంగానే కనిపించింది. అతనిమీదనే చూపు నిలిపింది ఆమె.

''మిమ్మల్నే చూస్తున్నది మా మామ్మ'' అన్నది పార్వతి మెత్తని కంఠంతో.

శంకర్ కాఫీకప్పు అవతలపెట్టి నర్సమ్మ దగ్గరకు వెళ్ళాడు. ఆమె చేతిని మెల్లగా తన చేతుల్లోకి తీసుకున్నాడు. 'మీ మనవరాలికేం భయంలేదు. నేనున్నా' నన్నట్టుగా వాటిని మృదువుగా నొక్కాడు.

శంకర్ చేతుల్లోనుంచి తన చేతులు తీసుకోకుండా, ఆ గదిలో వున్నవారి సందర్శి అవతలకు వెళ్ళిపోవలసిందిగా నర్సమ్మ సంజ్ఞ చేసింది.

''పాపం, ముసలమ్మ అతనితో ఏదో చెప్పాలనుకుంటోంది"

"వాళ్ళకు ఆ కుర్రవాడు బాగా తెలిసినవాడే అయివుంటాడు"

"తెలిసినవాడే కాదు, కావలసినవాడు కూడా అయివుంటాడు"

''అతనితో చెప్పాలనుకుంటున్న ఆ రహస్యం ఏవిటో''

''ఆ కుర్రవాడితోపాటుగా పార్వతిని కూడా ఉండమంటున్నదేవ్?''

''తులసీ, శ్యామలల్ని కూడా వెళ్ళిపోమంటోంది"

అనుకుంటూ, ఆశ్చర్యపడుతూ, ఏదేదో ఊహించుకుంటూ, ఊహకు తెలిసినంతవరకూ నిజాన్ని జోడించుకొని బేరీజు వేసుకుంటూ వాళ్లు ఆ గదిని ఖాళీ చేశారు.

గదిలో మంచంమీద గాయాలతో, కొనప్రాణంతో నర్సమ్మా – నర్సమ్మ కాళ్ల దగ్గర బాష్పనేత్రాలతో కృతజ్ఞతా హృదయంతో పార్వతి, నర్సమ్మ తల దగ్గర ఆమెవేపే ఆర్ద్రంగా చూస్తూ శంకర్ ఉన్నారు. మనమరాల్నీ, శంకర్‌నూ మార్చి మార్చి చూసింది నర్సమ్మ కొంత సేపు. పార్వతిని దగ్గరకు రమ్మన్నది. పార్వతి వచ్చింతర్వాత అతికష్టంమీద అన్నది–

"ను...నువ్వూ...శ్యామలా వెంటనే ఈ...ఊరు విడిచిపెట్టి వెళ్ళిపొండి!"

''ఎందుకూ?''

జవాబు చెప్పకుండా నర్సమ్మ కాసేపు కళ్లు మూసుకుంది. తర్వాత కళ్లు తెరిచి–

"న...నన్ను...వాళ్లు..." ఆమె నోరుతెరిచి పన్ను వూడిపోయిన చోటు చూపించింది.

"పన్ను...వూడగొట్టారు. చెంపలు... పగలగొట్టారు. జుట్టు... పీకేశారు.."

పార్వతి కళ్ళలో రక్తం చిందింది. "ఎవరు... ఎవరు ఆ రాక్షసులు? నీమీద చెయ్యి జేసుకున్న ఆ దుర్మార్గులెవరు? చెప్పు మామ్మా... చెప్పకపోతే నామీద ఒట్టే!"

నర్సమ్మ గొంతు క్రమక్రమంగా బలహీనమైపోతోంది. ఆమె నాడి పడిపోతోంది. గాయాలు సెప్టిక్ అవుతున్నాయి. నాటువైద్యం కూడా లేకుండా హీనమయిన చావు చనిపోతోంది. ఆమె చనిపోతున్నదని ఆమెను చూసేవాళ్ళకు స్పష్టమయిపోతున్నది.

''చెప్పు మామ్మా... ప్లీజ్"

"నన్ను...నన్ను...వాళ్ళు కుక్క చేత పీకించారు"

"ఎవరు...?ఎందుకు?'' పార్వతి పెద్దగా అరిచింది. పార్వతిని శంకర్ పట్టుకున్నాడు కిందపడిపోకుండా.

నర్సమ్మలో లోపల అంతవరకూ




అణిగివున్న జీవుడు తెగ ఆరాటపడి పోతున్నాడు. ఉన్ముఖమార్గంలో. జీవన్మరణ సంఘర్షణలో ఆమె పంచేంద్రియాలూ బలహీనమయిపోతున్నాయి. అతికష్టం మీద ఆమె మరొక్కసారి కళ్లు తెరిచింది. "వాళ్లు...వాళ్లు నిన్ను బతకనీయరు... నువ్వు...నువ్వు...పారిపో... పారిపో ...నీ చెల్లెల్ని తీసుకుని వాళ్ళకు దూరంగా... దూరంగా...దూరంగా..."

ఆమె తల వాల్చేస్తున్న సమయంలో ఆమె చేతుల్లో చెయ్యివేసింది పార్వతి అంతకు పూర్వమే ఆమె చేతుల్లో శంకర్ చెయ్యి వుంది. ఇప్పుడు శంకర్ చేతుల్లో పార్వతి చెయ్యి. ఇద్దరిచేతుల్ని కలుపుతూ నర్సమ్మ చేతులు. ఆమెలో ప్రాణం గుట గుటమంటున్నది. శంకర్ వేపు ఏదో అర్థిస్తున్నట్టుగా ఆమె కళ్లు చూస్తున్నాయి. చెప్పాలనుకొన్నదేదో చెప్పలేక ఆమె పెదవులు జాలిగా కదిలిపోతున్నాయి. ప్రాణప్రయాణ సమయంలో ఈ లోకాన్ని, ఈ బాంధవ్యాన్ని, ఈ అనుభవాన్ని వదులుకోలేక జీవాత్మ పడే తపన ఆమెలో స్పష్టంగా కనిపిస్తోంది.

శంకర్ ఆమె వేపే నిశ్చలంగా చూస్తూ అన్నాడు–"మామ్మగారూ! మీమీద, నా కన్న తల్లి మీద ప్రమాణం చేసి చెబుతున్నాను. మీ మనవరాళ్ళకిద్దరికీ ఏ ప్రమాదమూ రాకుండా చూసుకుంటాను. మీమీద ఇంతటి ఘాతుకం చేసినవాళ్ళని, వాళ్ళు ఎంత పెద్దవాళ్ళైనా సరే ప్రతీకారాం తీర్చుకుని మీ ఆత్మకు శాంతిని కలుగజేస్తాను. మీ మనవరాలు పార్వతిని పెళ్ళిచేసుకుని మీ దీవెనలందు కుంటాను"

ఆ మాటలు ఆమెకు వినిపించా యన్నట్టుగా నర్సమ్మ కళ్ళలో రవంత వెలుగు ... ఆరిపోయేముందు దీపంలో కనిపించే వెలుగు.

"పార్వతిగారూ! మీ మామ్మకు వీడ్కోలు మాటలు చెప్పండి. మీ హృదయాన్ని ఆమెకు ఎరుకపర్చి ఆమెను సంతోషంగా సాగనంపండి!" శంకర్ అన్నాడు గంభీరంగా.

పార్వతి గద్గగ కంఠంలో అన్నది – "మామ్మా! తల్లి లేదు, తండ్రి లేడు. ఉన్న ఒక్క దిక్కు నువ్వు వెళ్ళిపో తున్నావు. ఎట్లా బతకమంటావు మమ్మల్ని ఈ జనారణ్యంలో?"

ఆ అమ్మాయి మళ్ళీ తనను తనే నిగ్ర హించుకుంది. "ఈ ఊరినుంచి పారిపో మన్నావు. అదే నిజంగా నీ అభిప్రాయం అయితే అట్లాగే మామ్మా.... అట్లాగే. ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోతాం! వెళ్ళిపోయి శ్యామలను కళ్ళలో పెట్టుకుని కాపాడతాను. దాన్నో ఇంటిదాన్ని చేసి"

"మీ చెల్లెలి సంగతి కాదు. ముందు మీ సంగతి చెప్పండి పార్వతిగారూ!" శంకర్ హెచ్చరించాడు.

"నా సంగతి....నా సంగతేముందీ?"

"మీ పెళ్ళి సంగతి?"

పార్వతి మాట్లాడలేదు. "ఈసమయంలో మౌనం పనికిరాదు పార్వతీ! చనిపోయే వాళ్ళు ప్రశాంతంగా పోవాలంటే వాళ్ళ కోరికలు తీరుస్తామని బతికివున్న వాళ్ళు ప్రమాణం చెయ్యాలని పెద్దలంటుంటారు. మీ వివాహం విషయంలో ఆమెకు ఓ అభిప్రాయం ఉండి వుంటుంది. అది మీరు నెరవేర్చాలి. నెరవేరుస్తానని ప్రమాణం చెయ్యాలి"

"నేనెవర్ని ప్రేమించడం ఆమెకు ఇష్టంలేదు" పార్వతి మెల్లగా అంది.

"నిజంగానా?!" అంటూ శంకర్ నర్సమ్మ వేపు చూశాడు. ఆమె అప్పటికే

విగతజీవి ఆయినట్టు అతనికి అనుమానం వేసి ఆమెను పరీక్ష చేశాడు. గుండె కొట్టుకోవడం లేదు. శ్వాస లేదు. నాడీ చలనం లేదు. "అయామ్ సోసారీ! మీ మామ్మ ఇహలేదు!" అంటూ శంకర్ బయటివారినందర్నీ లోపలకు రమ్మన్నాడు.

మగపిల్లలు లేని నర్సమ్మకు ఎవరు తలకొరివి పెట్టాలన్నదొక జటిల సమస్య అయింది ఆ పల్లెటూళ్ళో.

"మీరే పెట్టండి పార్వతిగారూ!" అన్నాడు శంకర్.

"నేనా... ఆడవాళ్ళు తలకొరివి పెట్టకూడదంటారు కదా?"

"అయితే నేను పెడతాను"

"మీరా?"

"అవును. మిమ్మల్ని వివాహం చేసుకుంటానని ఆమెకు ప్రమాణం చేశాను.





అయినప్పుడు నేనూ ఆమెకు మనవడు వరుసే అవుతాను. నేనే నర్సమ్మగారికి తలకొరివి పెడతాను"

పార్వతి కొంతసేపు తనలో తాను వితర్కించుకుంది. ప్రమాణం చేసినంత మాత్రాన శంకర్‌కు ఆ అర్హత వస్తుందా? ఆడపిల్లయినంత మాత్రాన తనకా అర్హత పోతుందా?

"అక్కరలేదు. మా మామ్మకు తలకొరివి నేనే పెడతాను" అన్నది పార్వతి ఒక దృఢ నిశ్చయానికి వచ్చి.

"నిజమా అక్కా?" అన్నది శ్యామల భయం భయంగా.

"నిజమే!"

ఆ ఊరివారికి పార్వతి సాహసం దుస్సహమనిపించింది. ఆమె సంప్రదాయ విరోధిగా కనిపించింది.



"ఇంతమంది మగవాళ్ళం ఊళ్ళో వున్నాం; ఎవరో ఒకరం పెట్టలేమేమిటి?" అన్నాడు ఓ ముసలాయన.

"కలికాలం కాకపోతే ఆడకూతురు స్మసానానికెళ్ళి సితికి నిప్పంటించడం ఏంట్రా?" అన్నాడు పేకాట ఆడుకుంటున్నవాళ్ళలో రచ్చబండ దగ్గర ఒకడు.

"సదూకున్నోళ్ళకన్నా మనకెక్కువ తెల్సునేటి. కలికాలం నేదు, ఆకలికాలం నేదు. అవుసరం బట్టి పన్లు సేసుకుంటుండాల" అన్నాడు తాడు పేనుకునే తాత.

"ఆ బస్తీ పిల్ల ఏం చేసినా ఈడికి బావుంటుంద హె!" మరొకడు ఈసడించాడు.

"పట్నంపిల్ల, పల్లెటూరిపిల్ల అని కాదొరె! సదూకున్నోళ్ళు, సదూలేనోళ్ళు–తెలివున్నవోళ్ళు, తెల్విలేనివోళ్ళు ఈ రెండేరకాల్రా ఉన్నది ఈ పెపంచకంలో! నాను సదూలేనివోణ్ణి. పార్వతమ్మ సదూకొంటోంది. అందుకనే ఆ ఆడబిడ్డంటే నాకు ఇట్టం. అంతే!" అంటూ తాడు తాత లేచిపోయాడు.

* * *

నిప్పుముంత తీసుకుని పార్వతిముందు నడుస్తోంది. ముంతలోని నిప్పులాగ ఆమె హృదయం కూడా భగ్గున మండుతోంది. రకరకాల అనుమానాలు పొగ రాజుతున్నాయి.

నర్సమ్మ శరీరాన్ని శంకర్, తిలక్, తాడుతాత, మరో మనిషీ మోస్తున్నారు.

దూరంగా, వెనగ్గా శ్యామల, రీటా, జాస్మిన్, హెలెన్, జగదీశ్వరి, పద్మలత, తులసి వస్తున్నారు. వాళ్ళకు అటుపక్కగా సురేష్, జగదీష్, నరేష్, ప్రతాప్, ప్రసన్న నడుస్తున్నారు. వాళ్ళను చూస్తుంటే కాలేజీయే నడిచివెళ్తోందా అనిపిస్తోంది. వాళ్లు స్మశానం దగ్గరకు చేరే సరికి అప్పారాయనింగారు, శఠగోపం, వాళ్ళకు వెనగ్గా బిక్కుబిక్కుమంటూ నంబి ఆచార్లు, శరభలింగం, సతీష్, మనోహర్ అక్కడ బారులుకట్టి అడ్డుగా నుంచుని కనిపించారు.

"ఆ ముసిలిదాని శవాన్ని ఇక్కడ తగలబెట్టనివ్వం!" శరభలింగం అన్నాడు.

ప్రసన్న ముందుకొచ్చాడు. "ఎందుకనిట?"

"ఓ ఆడపిల్ల తలకొరివి పెట్టడాన్ని మా సంప్రదాయం ఒప్పుకోదు. అట్లా చేస్తే ఊరికి అరిష్టం. ఊరి పెద్దగా ఇందుకు నేను అంగీకరించలేను" అప్పారాయనింగారన్నారు.

నర్సమ్మ శవాన్ని శవవాహకులు కిందకు దింపారు. ఆ శవంచుట్టూ తిరుగుతూ ఆమె చెవుల దగ్గర 'నారాయణ నారాయణ' అంటున్నారు వాళ్ళు.

శంకర్ పార్వతి దగ్గరకు వచ్చాడు. ఆమెను ప్రశాంతంగా ఉండమని ధైర్యం చెప్పి తాను ముందుకు వచ్చాడు.

"అప్పారాయనింగారూ! ఆడపిల్ల తలకొరివి పెట్టడం సంప్రదాయం కాదన్నారు. ఏది సంప్రదాయమో కాస్త వివరించి చెప్తారా?" అని అడిగాడు.

"మగవాడు తలకొరివి పెట్టడమే సంప్రదాయం!"

"మగవాడే ఆ పని ఎందుకు చెయ్యాలి?" మళ్ళీ అడిగాడు శంకర్.

అప్పారాయనింగారు సమాధానానికి ఆలోచించుకున్నారుకొంతసేపు. "ఆచార్లగారూ! మీరు చెప్పండి సమాధానం" అన్నాడు నంబి ఆచార్ల వేపు తిరిగి.

నంబి ఆచార్ల వేపు దీనంగా, నిశ




తంగా, నిందాపూర్వకంగా చూసింది పార్వతి.

'మీరు కనుక పిలవగానే వచ్చి ఉన్నట్లయితే మా మామ్మకు ఈ అర్ధాంతరం చావు ఉండేదికాదు ఆచార్లవారూ' అన్న భావాన్ని ప్రకటిస్తున్నాయి ఆమె కళ్ళు. తనవేపే చూస్తున్న ఆ పిల్లవేపు చూడలేక ఆ నంబి ఆచార్లు శఠగోపం వెనక్కు తప్పుకున్నాడు.

అప్పారాయనింగారికి జవాబు చెప్పటానికన్నట్టు శంకర్ మరో అడుగు ముందుకు వేశాడు. "ఆయన చెప్పలేడు కానీండి నేను చెబుతున్నా వినండి!" శంకర్ కంఠంలోఉన్న తీవ్రత అందర్నీ అతన్ని వినేటట్లు చేసింది.

"ఆడదాన్ని అబలగా మార్చిన మగవాడు మరణమంటే స్కేర్ క్రియేట్ చెయ్యటానికి, ఆమరణాన్ని తను అత్యంత సన్నిహితంగా ఉండి చూడగల ధైర్యవంతుడు అని చాటుకోడానికి ఈ ఆచారాన్ని ఆచరణలోకిఅనువదించాడు.మాతృస్వామ్య వ్యవస్థ ఉన్న రోజుల్లో స్త్రీలకు ఏదీ నిషిద్ధంకాదు. వాళ్ళు వేదం చదువుకున్నారు, కుటుంబాన్ని పోషించారు, యుద్ధాలు చేశారు. కన్నబిడ్డను ఆదర్శవంతుడైన తండ్రిగా, బిడ్డగా, పౌరుడుగా తీర్చిదిద్దుకున్నారు. ఆ తర్వాత మగవాడు తన దురహంకారంతో, దుష్టచింతనతో మాతృస్వామ్య వ్యవస్థను పితృస్వామ్య వ్యవస్థగా మార్చివేశాడు. స్త్రీని ఆటవస్తువుగా, అంగడిబొమ్మగా, పిల్లలకోడిగా రూపొందించాడు. అన్ని వయసుల్లోనూ తనమీదే ఆధారపడి ఉండాలని శాసించాడు. అందుగ్గాను కొత్త శ్లోకాలు సృష్టించాడు. ఎక్కడైనా ఏ ఆడపిల్లయినా ఎదురుతిరిగితే ఆచారం పేరుతో ఆమెను అణగదొక్కేశాడు. అధఃపాతాళంలోకి తోసేశాడు. ఇప్పుడు స్త్రీలు ఆకాశంలో విహరించగలరు, సముద్రం అడుగున నివసించగలరు, ధర్మాన్ని నిర్దేశించగలరు, మగవాడి దౌష్ట్యాన్ని ఎదురించగలరు. మిస్ పార్వతి ఈనాటి ఆడపిల్ల. అర్థం లేని ఆచారాలకుతలవొంచదు. అపుత్రస్య గతిర్నాస్తి వంటి శ్లోకాలకు ఈషణ్మాత్రం కూడా ఆమె విలువ ఇవ్వదు. తన మామ్మకు, తన తలిదండ్రులకు తనే ఆడపిల్లా, మగపిల్లాడు అన్నీకూడా. సేవ, కర్తవ్యం, రక్షణ అన్నీ ఆమే ఇసుంది. ఆవిధంగా ఆమె చేయలేక పోతేగదా మరో మగవాడి సాయం ఆమె కోరవలసింది? పాడెమీద పడుకున్న శవానికి కపాలమోక్షం కావడం చూడలేనంతటి పిరికిగుండె కాదు ఆమెది"

అతని వాక్ప్రవాహానికిఅందరూనిశ్చేష్టులైపోయారు. అతను మాట్లాడినదాంట్లో చాలామందికి కొంత కొంత అర్థమయింది, కొంత అర్థం కాలేదు. అయితే ఒకటి మాత్రం స్పష్టమయింది. పార్వతి తన మామ్మకు తలకొరివి పెట్టడం అన్న విషయంలో వాళ్ళందరూ ఒక దృఢమయిన అభిప్రాయంలో ఉన్నారు. అందులో రాజీ ప్రసక్తి లేదు.

అంతా విని అప్పారాయనింగారు ఒకటే మాటన్నాడు – "మీరు వెయ్యి చెప్పండి, ఆ ఆడకూతురుచేత ఈ పని నేను చెయ్యనివ్వను"

మనోహర్ అందుకున్నాడు– "వారి కిష్టంలేని పని జరిగితే ఇక్కడ తలలు లేచిపోతాయి"

మన్మథ అన్నాడు – "పార్వతిగారికి సానుభూతి చెప్పడానికని వచ్చి ఇట్లా మనం వర్గాలుగా విడిపోవడం బావుంట

లేదు. ఆ ముసలిదాని శవాన్ని ఏం చెయ్యా లన్నది ఊరిపెద్దలు నిర్ణయిస్తారు. మనం పోదాం పదండి!''

ఆ మాటల్లోగల ఉపద్రవాన్ని పార్వతి సులభంగానే ఊహించగలిగింది.

"ఇది మా కుటుంబ విషయం. ఎవరి ప్రమేయం ఇందులో పనిలేదు. మేం లోపలికి వెళ్తున్నాం" అని పార్వతి అగ్గి ముంతను తన చేతుల్లోకి తీసుకుంది. శవ వాహకులు నర్సమ్మను మళ్ళీ భుజాల మీదకు ఎత్తుకున్నారు. ఆడపిల్లలందరూ భక్తిగీతాలు పాడడం మొదలుపెట్టారు. వాళ్ళ ఔద్ధత్యం చూసి ఎదుటిపక్షం లోంచి కొన్ని కర్రలు గాలిలోకి లేచాయి.

"కొట్టండహె!"

''తన్నండహె!"

"చావగొట్టండహె!"

పార్వతి గబగబా అప్పారాయనింగారి దగ్గరకు వచ్చింది. మెల్లగా ఆయనకే వినిపించేట్లుగా అన్నది – "ఎందుకింత పంతం మీకు? మా మామ్మా, నేనూ ఏం నేరం చేశాము? ప్లీజ్...ప్లీజ్! మీవాళ్ళను ఆపరూ? ఎత్తిన ఆ కర్రల్ని దింప మనరూ?''

అప్పారాయనింగారు రక్తాశోకంలా వున్న పార్వతివేపు చూశాడు. "నువ్వన్నట్టే చేస్తే నాకేవిటి వొరుగుతుంది?"

''ఏం కావాలి?" పార్వతి మనసు కీడు శంకిస్తోంది.

గాలిలో వూగుతున్న కర్రల్ని, హింసను అంతవరకూ ప్రత్యక్షంగా చూడని ఆ ఆడపిల్లలు భయం భయంగా పరికిస్తున్నారు.

''అడిగిందిస్తావా ?" అప్పారాయనింగారి మనసులో చేపవలలో పడుతోందన్న సంతోషం.

''ఇయ్యగలిగిందయితే...!"

''నువ్వియ్యగలిగిందే నేను తీసుకుంటా!"

"అయితే సరే !"

వాళ్ళిద్దరూ గుసగుసలుగా ఏం మాట్లాడుకొంటున్నారో అక్కడున్న శ్రోతలకు, ప్రేక్షకులకు అర్థం కాలేదు. అయినా అతి ముఖ్యమయిన విషయమే ఏదో జరుగుతోందన్న భావన వాళ్ళకు రవంత రిలీఫ్‌ని కలిగిస్తోంది.

"నాకు తెలుసు మీ మామ్మకన్నా నువ్వు మంచి పిల్లవని! నాకు కావలసిందీ, నువ్వియ్యగలిగిందీ సమయం వచ్చినపుడు చెబుతాను. ఇప్పుడు నువ్వు చెప్పు నీకేం కావాలి?"

"ఇక్కడ మా మామ్మ దహనం"

"ఓకే"

పార్వతి సంతృప్తి–అసంతృప్తిల మధ్య ఊగిసలాడుతూ వెనక్కి తిరిగి వచ్చింది. అక్కడ జరుగుతున్నది తమకూ వింతగానే ఉన్నదన్నట్లుగా పైన ఎగురుతున్న పక్షులు కిందదాకా వచ్చి కాసేపు పల్టీలుకొట్టి మళ్ళీ పైకి ఎగిరి వెళ్ళిపోతున్నాయి. మేతకని బయలుదేరిన పశువులు దూరంగా నిలబడి శ్రద్ధాళువులవుతున్నాయి.

అప్పారాయనింగారు ఇట్లా అన్నాడు– "అందరూ వినండి. ఆ ఆడకూతురి కోర్కెను నేను అంగీకరించదల్చుకున్నాను"

"ఆఁ!" విన్నవాళ్ల నోళ్లు నమ్మలేక విచ్చుకున్నాయి.

"ముందీ కర్మకాండైపోయిం తర్వాత ప్రాయశ్చిత్తం ఏదయినా వుంటే అది చేసుకుంటానంది. ప్రాయశ్చిత్తం చేసు




కోడం మనకు ప్రతిదానికీ ఉంది కదా?"

"అవునవును. ఉంది వుంది..." గొర్రెలు తలలూపాయి.

"ఇంకోటికూడా నాకనిపించింది. నర్సమ్మ అనాథప్రేత కాదుగదా? ఎవరు చేసినా ఆ మనవరాళ్ళ మీదే కర్తవ్యం వేసి కర్మ చెయ్యాలి కదా? అయినప్పుడు ఆ మనవరాలే చేస్తే సరిపోలా?"

"సరిపోతుంది...సరిపోతుంది!''

తాన అంటే తందానా అనే ఆ జనాన్ని చూసి అప్పారాయనింగారు మీసాలపై చెయ్యివేసి దువ్వుకుని కాటికాపరితో "ఒరేయ్, నర్సమ్మగారి శవాన్ని లోపలకు రానీరా" అన్నాడు ఉచ్చస్వరంతో.

శవంతోపాటుగా జనమూ లోపలకు వెళ్ళారు.




ఒక ఉదయంపూట...

పువ్వులు కనులు తెరుస్తున్న వేళ, అనూరుడు తన స్వామి ప్రయాణానికి కిరణాల గుర్రాలనాయత్తం చేస్తున్న సమయంలో...

తులసి తన స్నేహితురాలు పార్వతి ఇంటికి వచ్చింది. తులసిని చూస్తూ వాకిట్లో కల్లాపి చల్లుతున్న నలుగురు బిడ్డల ఓ నడివయసు ఇల్లాలన్నది— "దాని షోకయింది. ఇహ దీని షోకు చూడాలిమనం! పెళ్ళయితే ఈసరికి ముగ్గురి పిల్లల్ని నెత్తికెత్తుకునేది."

పక్క ఇంటి వృద్ధనారి అన్నది— "దాని వూసు ఎత్తకే కోడలు పిల్లా? ఉన్నన్నాళ్ళూ ఆ నర్సమ్మ నోటికి హడిలి చచ్చాం. ఇప్పుడు దీని నోటికీ, చేతికీ కూడా బెదిరి చస్తున్నాం!"

"నిజమేనమ్మోవ్! ఆ నర్సమ్మే నయం. కాస్త ఉచ్చనీచాలుండేవి. దీని పరిస్థితి మరీ ఘోరం. దీని నోట్లోనూ నోరుపెట్టలేం" పిల్లపాపా కలగని ఓ కోడలు పిల్ల అన్నది.

ఆ మాటలు విన్న తులసి తలెత్తి వాళ్ళవేపు ఒక్కసారి చూసింది. వాళ్ళ నోళ్ళు సీలు వేసినట్టు కట్టుబడి పోయాయి. ఇప్పుడు తులసి పద్ధతే మారి పోయినట్లనిపిస్తుంది. ఇదివరకటి షోకిల్లా వేషాలు మానేసింది. నర్సమ్మ మరణంతో ధనాధన్ అనడం తగ్గించేసింది. సంసార పక్షంగా ఉండడం నేర్చుకుంది. ఆ మార్పే ఇతరులకు భయం కల్గిస్తోంది.

తులసి పార్వతి దగ్గరకు వచ్చేసరికి, పార్వతి దేవుడి మందిరంలో జపంలో ఉంది. ఆమె పూజ చేసుకుని వచ్చేవరకూ తులసి హాల్లో ఓ కుర్చీలో గుంభనగా కూచున్నది— చేతులమీద గడ్డాన్నానించి.

పూజ పూర్తి చేసుకుని గంట వాయించేసి, హారతిచ్చి, పార్వతి మడి బట్టల్లోంచి బయటపడి హాల్లోకి వచ్చేసరికి మహాయాన బౌద్ధంలో బుద్ధుడి ప్రతిమలాగా ఆమెకు తులసి కనిపించింది.

ఎప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ, పరాచికాలాడుతూ, అథం శుభం సంగతి అవతల పెట్టి వన కన్యలా, నదీ ప్రవాహంలా, తేటమబ్బులా పరుగులు తీసే తులసి ఇట్లా మౌనంగా ఆలోచనాత్మకంగా కనుపించడంతో విస్మయంతో

పార్వతి అడిగింది—"ఏవిటి కథ? స్టయిలు మార్చేశావ్?"

"కథాలేదు, కాకరకాయా లేదు. ఎల్లుండే నా పెళ్ళి రిజిష్ట్రారాఫీసులో. సాక్షిసంతకాలు చేసేవాళ్ళల్లో నువ్వూ, మీఆయనా కూడా ఉన్నారు. అది చెప్పడానికే వచ్చాను"

కొట్టడానికన్నట్టుగా పార్వతి చెయ్యెత్తింది "మా ఆయనెవరే రాస్కెల్?"

"సారీ! మా ఆయన్ని గురించి ఒకటికి నాలుగు సార్లు అనుకోవడంలో, నీ విషయంలో కూడా అలవాట్లో పొరపాటు దొర్లింది... దట్సాల్!"

వెళ్తున్న తులసిని రెక్కపట్టుకుని లాగి కూర్చోపెట్టి పార్వతి అన్నది—"అసలు ఆ ఆయన ఎవరని పొరపాటు పడ్డావుట?"

"ఎవడో ఒకడు వల్లకాట్లో రామనాధాయ్య. నన్ను పోనీవే, అవతల నాకు బోల్డు పనుంది"

"అదేం కుదరదు. నువ్వన్న ఆ ఆయన పేరు నువ్వు చెప్పితీరాలి, నేను వినితీరాలి"

"తప్పదా?"

"తప్పదు"

"అయితే విను. ఆయనగారు నీ గుండెల్లో తిష్టవేసుకున్న మన్మధ మహారాజు"

"మ...న్మ...ధా?"

"సారీ...సారీ! టెర్రిబ్లీ సారీ. మన్మధ మహారాజులో మన్మధ ఉన్నాడు కదూ? ఆ త్రాష్టుడు గాదు మీ ఆయన—కొండల్లో ఉండేవాడు"

"గిరిజనుడా?"

"గిరిజనుడు, హరిజనుడు కాదు. పాముల్ని మెడలో వేసుకునేవాడు"

"పాములవాడా?"

"కాదు కాదు. బూడిద పూసుకునేవాడు వంటినిండా"

"సన్యాసా?"

"అదీ కాదు, గౌరీ మనోహరుడు"

"అదేం కాదు. పార్వతీ మనోహరుడు కూడాను!"

"అమ్మయ్య! నువ్వే చెప్పావు కదా, ఆయనగారు పార్వతీ మనోహరుడే శంకరుడు! ఇప్పుడిహ వెళ్ళిరానా?"

స్నేహితురాలికి టిఫిను పెట్టి, కాఫీ ఇచ్చి సకల మర్యాదలూ జరిపి "ఎంతో మంచి వార్త మోసుకొచ్చావ్! ఈమాత్రం మర్యాదైనా జరపకపోతే రేపు మా మరిది గారికి కోపంరాదూ?"

ఆ మాటకు తులసి గుండె స్పందించింది. పార్వతి భుజాల మీద రెండుచేతులూ వేసి ఆమె మొహంలోకి మొహంపెట్టి చూస్తూ "నిజంగానే నిండు మనస్సుతో నా సాహసాన్ని నువ్వు మెచ్చుకుంటున్నావు కదూ?" అని అడిగింది.

"అదేమిటి? ఇప్పుడుకూడా మీ అమ్మగారికి ఈ సంగతి నువ్వు చెప్పలేదా?" పార్వతి కోప్పడుతున్నట్టుగా అడిగింది.

బయలుదేరి బయటకు వెళ్ళిపోతున్నదల్లా తులసి ఆ మాట విని వెనక్కో అడుగువేసి — "కొందరికి వయసుకే కాదు ముసలితనం వచ్చేది మనసుకు కూడా! కాలంతో పాటు వాళ్ళు ఎదగలేరు. తమ ఛాందస భావాలతో ఇంకొకర్ని ఎదగనీరు. నా పెళ్ళి సంగతి ముందుగా తెలిస్తే మా అమ్మ విషం తాగి చస్తానంటుంది. ఆ రకం సెంటిమెంటల్ సీన్స్ అంటే నాకు ఒళ్ళంతా కంపరం. ప్రేమంటే ఓ తీయని అనుభవం. దాన్ని





కన్నీళ్ళతో తడిపి ఉప్పగా చెయ్యడం ఘోరాతిఘోర నేరం!"

''పెళ్ళయిపోయింతర్వాత మాత్రం ఆ సీన్ ఉండదా?" పార్వతి కుతూహలంగా అన్నది.

"పెళ్ళయిపోయింతర్వాత నేను మిసెస్ తిలక్‌ను. కేవలం ఆండాళ్ళమ్మ కూతుర్నే కాను. నామీద మా అమ్మకు హక్కు ఉండదు. అది గుర్తించకుండా ఇంకా ఏడుస్తా నంటుందీ ఆవిడ ఖర్మ! ఐ కాన్ట్ హెల్ప్!"

ఈ మాటలనేసి తులసి మళ్ళీ లేచి నిలబడింది వెళ్ళిపోవటానికి.

పార్వతి మళ్ళీ ఆపింది. ''ఈ ఒక్క ప్రశ్నకూ సమాధానం చెప్పి వెళ్ళిపో! ఇహ ఆపను''

"ఓకే...! అడిగేసేయ్ ధనాధన్ మంటూ జవాబు చెప్పేస్తాను''

"ఆయన్ని గురించి వర్ణిస్తూ కొండల్లో ఉండేవాడన్నావేమిటే?"

తులసి విరగబడి నవ్వింది. ''అదా? అదో రిడిక్. శంకర్ ఉండేది గిరినగర్‌లో. గిరి అంటే కొండేగా!''

'మరి పాముల్ని మెడలో వేసుకుని తిరగడం ఏమిటమ్మా?" ఋంగమూతి పెట్టింది పార్వతి.

''ఆయన మెడలో వున్న బంగారు గొలుసుకు ఒక లాకెట్ ఉంది. ఆ లాకెట్ మీద నాగ విగ్రహం వుంది''

''నీకెట్లా తెలుసు?''

''అనుమానమా అప్పుడే?! అవున్లే-అనుమానమూ, ప్రేమా అక్కచెల్లెళ్ళు గదూ...? ఓరోజు తిలక్ వేసుకొచ్చాడు ఆ గొలుసు. అప్పుడు తెలిసింది''

''అప్పుడు నీకు తెలిస్తే, ఇప్పుడు నాకు తెలిసింది. మరి బూడిద రాసుకోవడమేమిటో?''

"మనం రాసుకునే పౌడర్లన్నీ సెంటు కలిపిన బూడిద కాదేమిటి? మీ కాబోయే ఆయనకు సెంట్సు వాడకం పిచ్చి మహా జాస్తి. అన్నట్టు ఈమధ్య మీ ఇద్దరి మధ్యా దోస్తీ ముదిరిందని విన్నాను. స్టేషన్‌లోకి ఎప్పుడు తీసుకు వస్తావు బండిని?''

పార్వతి కళ్ళు చికిలించింది.

"స్టేషనేవిటీ?"

''అదేనోయ్, పెళ్ళి స్టేషను!''

''పెళ్ళీలేదు, గిల్లీలేదు. వెళ్ళువెళ్ళు'' తరిమేసింది తన స్నేహితురాలిని పార్వతి. గుడికి వెళ్ళిన శ్యామల ఇంకా రాలేదు ఇంటికి. నర్సమ్మ పోయినప్పటి నుంచీ ఆ పిల్లకు గుళ్ళూ గోపురాల ధ్యాస ఎక్కువైంది. ఇదివరకులా చెంగు చెంగున లేడిపిల్లలా గెంతడం లేదు. విరగబడి నవ్వుతూ మేళమాడడం లేదు. తన దుఃఖాన్ని తనలోనే దిగమింగుకుని, చెల్లెలు కోసం చిరునవ్వుతో పార్వతి మెలగవలసి వస్తోంది. తనే సీరియస్ అయిపోతే, శ్యామల మరింత సీరియస్ అయిపోతుందని ఆమె భయం! ఒంటరిగా కూర్చుని ఆలోచించుకుంటున్న పార్వతి దగ్గరకు శంకర్ వచ్చాడు. వస్తూ వస్తూ పళ్ళూ, పూలూ, స్వీట్లూ పట్టుకొచ్చాడు.

"ఇవన్నీ ఏవిటి?" ఆశ్చర్యపడుతూ, బిడియపడుతూ అడిగింది పార్వతి.

"ఆడపిల్లల్ని చూట్టానికి వెళ్ళినపుడు ఉత్తచేతుల్తో వెళ్ళకూడదని మా బామ్మ చెబుతుండేది!"

"ఊఁ...!"

"పెళ్ళికూతుర్ని చూసుకోటానికి వెళ్ళినప్పుడు పూలూ, పళ్ళూ తీసుకు వెళ్ళాలని మా అమ్మ అంటుండేది"

"ఉహూ!"

"పుట్టినరోజునాడు తనన్నా బహుమతులందుకోవాలి, తనకు నచ్చినవాళ్ళ కన్నా బహుమతులందించాలి అన్నది నా అభిప్రాయం"

చివ్వున తల ఎత్తింది పార్వతి. "ఇవ్వాళ...ఇవ్వాళ మీ బర్త్‌డేనా? విష్ యూ మెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే!"

"థ్యాంక్యూ!"

"మీ పుట్టినరోజునాడు మీకు మేము బహుమతులీయడం పోయి, మీరు మాకు బహుమతులివ్వడం ఏవిటీ?" ఆమె కంఠం రాగభరితమై వణికింది. "పైగా పెళ్ళికూతుర్ని చూసుకోవడం అంటున్నారేవిటి?"

కూచున్న శంకర్ లేచినిలబడ్డాడు. ఆమెకు అభిముఖంగా రెండడుగులు వేసి ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు.



"పార్వతీ! ఇవ్వాళ పొద్దున్నే తిలక్ వచ్చాడు నా గదికి. బర్త్‌డే గ్రీటింగ్స్ చెప్పాడు. ఆ తర్వాత ఎల్లుండి రిజిష్ట్రారాఫీసులో జరిగే తన పెళ్ళికి నిన్నూ, నన్నూ పెళ్ళి పెద్దలుగా, సాక్షులుగా రమ్మని రిక్వెస్ట్ చేశాడు. అదేవిట్రా అంటే పెళ్ళి చేసుకుంటున్నవాళ్ళకు పెళ్ళి చేసుకోబోయే వాళ్ళు సాక్షులు అన్నాడు. వాడే గాదు నీ ఫ్రెండ్స్, నా ఫ్రెండ్స్, మన కామన్ ఫ్రెండ్స్ అందరూ అనుకొంటున్నారు-మన పెళ్ళి ఖాయం అని. నువ్వే డిలే చేస్తున్నావు. ఎందుకని పార్వతీ? నాలో ఏ విషయమైనా నీకు నచ్చనిది వుంటే చెప్పు-మార్చుకుంటాను. కానీ నువ్వు లేకుండా మాత్రం నేను ఉండలేను పార్వతీ! ఏ క్షణంలో నిన్ను చూశానో ఆ క్షణంలోనే

నీకు సర్వార్పణమైపోయాను. లవ్ ఎట్ ఫస్ట్ సైట్! నాకూ తెలుసు - నువ్వూ నన్ను ప్రేమిస్తున్నావ్. కానీ వివాహానికి మాత్రం ఎందుకనో అంగీకరించలేకపోతున్నావ్? నీ మనసులో ఏదో భయం నీడ పాములా వెన్నాడుతోంది. భయం వద్దు పార్వతీ! నా విషయంలో నీకు ఏ భయమూ వద్దు. ఏ అనుమానమూ వద్దు. పార్వతిని పార్వతిగానే ప్రేమిస్తున్నాను? పార్వతీ ఈజ్ ఏన్ ఇండివిడ్యువల్. ఐ లైక్ హర్. ఐ డై ఫర్ హర్!"

అతను ఆమెముందు మోకరిల్లాడు. తను తెచ్చిన విరజాజుల్లోంచి గుప్పెడు పూలు తీసుకుని అవి ఆమె పాదాల మీద పోశాడు. అతనిలో యుగయుగాలుగా తనకు నచ్చిన స్త్రీ ముందు మోకరిల్లిన మహా పురుషులందరూ ప్రతిఫలిస్తున్నారు. చెంఘిజ్ ఖాన్ వంటి క్రూరుడైనా, షాజ హాన్ వంటి మహా చక్రవర్తి అయినా, హిట్లర్ వంటి నరహంతకుడైనా, ఎడ్వర్డ్ వంటి ఆదర్శ ప్రేమికుడైనా తమ తమ స్త్రీలముందు పాదాక్రాంతులై, అవనత శిరస్కులై, ఆత్మార్పణలోనే అఖండ ఆనందం అనుభవించారు. బయట ప్రపం చంలో ఆ పురుషుడు ఎటువంటివాడైనా, అతని హృదయాన్ని జయించిన స్త్రీ ముందు మాత్రం అతను అత్యంత బలహీనుడు, త్యాగధనుడు అయి పోయాడు.

శంకర్ తన హృదయరాణి పాదాల చెంత ప్రేమ పుష్పాలు సమర్పిస్తున్న సమయంలోనే శ్యామల గుడినుంచి తిరిగి వచ్చింది. ఆమె చేతుల్లో పూలసెజ్జ. ఆ సెజ్జలో దైవ పూజానంతరం పూజారి ప్రసాదంగా ఇచ్చిన పువ్వులు, ఇంత





కుంకుమ.

వంగి వున్న అతని తలమీద, అతన్నే వంగి ఆసక్తిగా పరికిస్తున్న అక్క తల మీద శ్యామల తన సెజ్జలో వున్న పూజా పుష్పాలను వర్షంలా విరజిల్లింది. వాళ్ళిద్దరూ ఉలిక్కిపడి, తనను చూసి సిగ్గుపడుతుండగా, "అక్కా! అమ్మవారి కుంకుమ ఇదిగో, బొట్టు పెట్టుకో" అంది అర్థవంతంగా.

తన మామ్మను ఖననం చేయడానికి శ్మశానంలో శంకర్ కన్విన్సింగ్‌గా ఇచ్చిన ఉపన్యాసం యవ్వన ప్రథమా ర్థంలో వున్న ఆ బాల లేత హృదయంలో ఒకానొక విచిత్రమైన ఆరాధనాభావాన్ని కలుగజేసింది. తన అక్క ఎందుకు ఇంకా అతని ప్రేమ విషయంలో తాత్సారం చేస్తోందో ఆమెకు అర్థం కాలేదు. తనే అయితేనా ఇటువంటి వ్యవ హారంతో తాడోపేడో ఎప్పుడో తేల్చి పారేసేది అనే చిలిపి ఊహ కూడా ఆమెకు రాకపోలేదు.

పార్వతికి కుంకుమ ఇస్తూ శంకర్ వేపు తిరిగి "ఏవండీ - మిమ్మల్ని ఎట్లా పిలవాలో నాకు అర్థం కావడం లేదు. పేరు పెట్టి పిలవడం బావుండదు. పెద్ద వారు కదా? వరుస కలుపుదామంటే ఏ వరుస కలపాలో మా అక్కయ్య చెప్పదు. అంచేత ప్రస్తుతానికి ఏమనీ పిలవకుండా 'రండి, కూచోండి, పువ్వులేరుకోండి, ఈ పువ్వుల్ని కళ్ళకద్దుకోండి, ఈశ్వరుడి గుళ్ళో విభూది తెచ్చా తీసుకోండి' అనే అంటాను. ఏమీ అనుకోకండి" అన్నది ఏకబిగిన. అప్పుడు - అక్కడ వున్న వస్తువుల వేపు చూసింది. "ఇవ్వేవిటి?" అంటూ దీర్ఘం తీస్తూ అడిగింది.

"వీరి బర్త్‌డే ఇవ్వాళ" పార్వతి జవాబుగా అన్నది.

"చెప్పావు కాదేం?" అంటూ హాపీ బర్త్‌డే టూ యూ పాట పాడేస్తూ గింగిరాలు తిరిగింది. తిరిగి తిరిగి అలసిపోయి, "కళ్ళు తిరుగుతున్నయ్ బాబూ, ఇహ తిరగలేను. ఉండండి కాఫీ పట్టుకొస్తా ఇద్దరికీ. నాకు తెలుసులెండి, మా అక్కయ్య మీకింకా కాఫీగ్లాటా ఏం ఇవ్వలేదు. అయినా మీకు మాటలుండగా కాఫీలెందుకు" అంటూ తూనీగలా తుర్రున లోపలకు పరుగెత్తింది.

శ్యామల అక్కడ లేనప్పుడు మౌనమే వాళ్ల సంభాషణ అయింది. శ్యామల తిరిగి వచ్చింతర్వాత కాఫీ సిప్ చేస్తూ, అంతవరకూ తన అంతరాంతరాళాల్లో వున్న విషయాన్ని వ్యక్తం చేసింది పార్వతి.

"మా మామ్మ అప్పారాయనింగారి ఇంటికి అసలు ఎందుకువెళ్ళింది? అక్కడ ఏం జరిగింది? రోడ్డుపక్కన అట్లా వంటరిగా ఎందుకు పడివుంది? కుక్కలో, నక్కలో ఆమె శరీరాన్ని ఎందుకు ఆ విధంగా గాయపర్చాయి? మమ్మల్ని ఈ ఊరు విడిచి ఎందుకు అర్థాంతరంగా వెళ్ళిపొమ్మని ఆమె వత్తిడిచేసింది? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు దొరికే దాకా నాకు మానసికమైన విశ్రాంతి దొరకదు శంకర్‌గారూ! అవిశ్రాంత స్థితిలో జీవితాన్నిగురించి ఏం నిర్ణయాలు నేను తీసుకోగలను?" అన్నదామె గతాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటూ.

"ఈ ప్రశ్నలకు మీ మామ్మే సమాధానం చెప్పిందికదా? అక్కడ జరిగిందేమిటో ఆమె చెప్పింది. వాళ్ళ ఆల్సేషియన్ తనను కండకండగా పీకిందనీ చెప్పింది. ఈ రాక్షస కృత్యానికి బ్యాక్‌గ్రౌండ్‌లో అప్పారాయనింగారు ఉన్నారని ఆమె చెప్పలేదు. కానీ మనం తర్వాత తెలుసుకున్నాం. ఆ అప్పారాయనింగారే నర్సమ్మ శవాన్ని స్మశానానికి తీసుకు వెళ్ళకుండానూ అడ్డుపడ్డాడు. మళ్ళీ అతగాడే నువ్వు మాట్లాడేసరికి మెత్తబడ్డాడు. సరేనన్నాడు. ఇదంతా ఆలోచిస్తుంటే..."

వంటింట్లోనుంచి వస్తూ మధ్యలో కల్పించుకుని అన్నది శ్యామల- "అక్కయ్య మర్చిపోయింది కానీ ఆ అప్పారాయనింగాడు శరభలింగం వెధవను మా దగ్గరకు రాయబారం పంపించాడు బావగారు !"

"బా...వ....గా...రా?" శంకరం ఆనందంగా తలెత్తి శ్యామల వేపు చూశాడు. పార్వతి ఎంబరాసింగ్‌గా ఫీలయి తల తిప్పుకుంది మరొక వైపుకు. "సారీసర్... తొందరలో నోరు జారాను! మీరు వెళ్ళింతర్వాత అక్కయ్య నా వీపు తాషామర్పా వాయించేస్తుంది" అంటూ దొంగభయం నటించింది.

"నో ఫియర్! మీ అక్కయ్య బారి నుంచి నిన్ను నేను రక్షించుకుంటాను"

"అబ్బ ఆశ! నాకేం అక్కమొగుడు అక్కర్లేదు. కావలసినవాణ్ని నేను ధైర్యంగా కట్టుకుంటాను"

ఆ మాట అనేసి పసున్నట్లుగా శ్యామల గబగబా అక్కడినుండి అవతలకు వెళ్ళిపోయింది.

"రాయబారం ఏమిటి?" అని అడిగాడు శంకర్ ఉత్సుకతతో.

"అప్పారాయనింగారు నన్ను తన మూడో భార్యగా చేసుకుంటాడని శరభలింగం వార్త మోసుకొచ్చాడు. ఆ మాట మళ్ళీ అంటే కొత్త చీపురు తిరగవేస్తానంది మా మామ్మ. దాంతో ఆ శరభలింగం కాలికి బుద్ధి చెప్పాడు"

శంకర్ నొసలు ముడివడ్డాయి. "ఆ

కక్ష కడుపులో దాచుకుని వాళ్ళు ఇదంతా చేయడం లేదుగదా?"

"ఆలోచిస్తుంటే నాకూ కావచ్చు అనే అనుమానం వేస్తోంది" పార్వతి అన్నది.

అంతవరకూ ఆ చదువుకున్నవాళ్ళు ఊహించగలిగారు కరెక్టుగా. కానీ నర్సమ్మ అప్పారాయసింగారి జీవితంలో దాగివున్న ఒక రహస్యాన్ని బట్టబయలు చేసిందనీ అదే ఆయన వీక్‌స్పాట్ అనీ, అంచేతే అయన అంత క్రూరంగా తిరగబడ్డాడనీ, ప్రతీకారం తీర్చుకుని సంతృప్తి పడ్డాడనీ వాళ్ళకు తెలియడానికి ఆస్కారంలేదు. జరిగినదానిని మరో రకంగా విశ్లేషించాడు శంకర్–

"ఈ దేశంలో డబ్బు, మదం ఎన్ని రకాల వెధవపనులైనా చేయిస్తుంది పార్వతీ! సోషలిస్టు దేశాల్లో అయితే డబ్బుకు అంత విలువలేదు. మానవుడి అవసరాన్ని తీర్చడానికి అదో సాధనం! అంతే. కానీ కాపిటలిస్టు దేశాల్లో అదే అన్నింటినీ నడిపిస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో డబ్బు సంపాయించడం ఎట్లా అన్నదే ప్రధాన వ్యాపకం. మన దేశంలో పైకి సామ్యవాదం, లోలోపల పెట్టుబడి దారీ కుళ్ళిపోయిన వ్యవస్థ వేళ్ళు. ప్రతివాడూ తోటివాణ్ని ఎట్లా దోచుకోడమా అన్నదాన్ని గురించే ఆలోచిస్తున్నాడు. ఈ ఆలోచనకు మార్గాలు వేసే ఆచార్యులు బడా వ్యాపారవేత్తలు, మన పల్లెటూళ్ళలో ఉన్న భూస్వాములు పందికొక్కులు. దొరికినచోట దొరికినంత బొక్కడం, అందుకు ఎవరైనా అడ్డంవస్తే వాడి ఖాతా క్లోజ్ చేసేయడం. అప్పారాయనింగారు ఆ వ్యవస్థలో ఒక భాగమే. వాళ్ళను నాశనం చేయాలంటే ఆ వ్యవస్థనే నాశనం చెయ్యవలసి వుంటుంది..."

అతని మాటలు వింటున్న కొద్దీ పార్వతికి శంకర్ తనకు తెలిసిన వ్యక్తి కానట్లనిపిస్తోంది. అతను ప్రతి విషయాన్నీ స్పష్టంగా విశ్లేషిస్తున్నాడు. అనిబద్ధంగా వివేచన చేస్తున్నాడు. అటువంటి సాయం తనకు దొరకడం ఎంత అదృష్టం!

ఆ వ్యక్తే తనంటే అనురాగంతో ఉన్నాడు. తన జీవితభాగస్వామిగా తనను ఆహ్వానిస్తున్నాడు. కానీ ఆ మూడు ముళ్లూ పడ్డ తర్వాత తన గత జీవితం తెలిసివచ్చింతర్వాత తనను సంపూర్ణంగా స్వీకరించగలడా?

పోనీ తనే ముందుగా తన బోర్‌స్టల్ బతుకును అతని ముందు పర్చి 'నేను హంతకురాలినే కాని నేరస్తురాలిని మాత్రం కాదు. మానవనిర్మితమైన ఈ చట్టాల దృష్టిలో నేను దోషిని కావచ్చునేమో కానీ, అంతకన్నా అతీతమైన ఒక నైతిక చట్టం, ధర్మ చట్టం వుంది– దాని దృష్టిలో నేను తప్పు చేసిన మనిషినికాదు' అని చెప్తే? అమ్మో! ఆపని తాను చేయలేదు. దాని వలన కలిగే ఫలితానికి తను తట్టుకోలేదు. అంతకన్నా తన రహస్యం రహస్యంగానే ఉండిపోవడం మంచిది.

"నా నాలుగు వాక్యాలకే అంతగా ఆలోచనలో పడిపోతే, మేధావుల ఉపన్యాసాలు వింటే ఈ వ్యవస్థను సర్వనాశనం చేసి ఒక నూతన సమాజ నిర్మాణం కోసం దీక్ష పూనాలన్నంత ఆవేశం వస్తుంది నీకు" శంకర్ అన్నాడు ప్రశాంతంగా.

"ఆ నిర్మాణం ఏవిటో మన ఊరితోనే మొదలుపెడదాం" అన్నది పార్వతి.

"నిజంగానా ?" అతని కళ్లు ఆనందంతో తరళాయితాలయ్యాయి.





"ఆ నిర్మాణం పునాదుల్లో పడి అప్పారాయనింగారి వంటి వాళ్ళు నాశనమై పోవాలి. అప్పుడుగాని మా మామ్మకు ఆత్మ తృప్తి కలగదు"

"అందుకు నేను సర్వాత్మనా నీకు తోడుపడతాను పార్వతీ !"

ఆమె అతనికి ఆనందంగా చెయ్యి అందించింది. "ఈ పూటకు తమరు ఇక్కడే భోంచేస్తున్నారు" అన్నది ఆ తర్వాత.




మేళ తాళాలు, సంస్కృత మంత్రాలు లేకుండా, దండలు మార్చుకుని, రిజిష్ట్రారు గారి ముందున్న బైండు పుస్తకంలో సంతకాలు చేసేసి, ఆలుమగలుగా డిక్లేరు చేయించుకుని, కొత్త ప్రపంచాన్ని కనుక్కున్నంత సంతోషంలో ప్రేమ తరంగాలమీద తేలిపోతూ, తిలక్-తులసీ ప్రభుత్వ కార్యాలయం నుండి బయటపడి ఓ రిక్షాలో జంటగా కూచుని బయల్దేరారు. మిత్రులందరూ సైకిళ్ళమీద పాటలు పాడుతూ వెంటరాగా కాలేజీకి వచ్చారు.

రిజిష్ట్రారుగారి ఆఫీసులో శంకర్, పార్వతి సంతకాలు చేసి కాలేజీకి, తిరిగి వస్తున్నప్పుడు ఆడపిల్లల బృందానికి పార్వతి నాయకత్వం వహించి అందరి కన్నా ముందున్నది సైకిలు తొక్కుతూ. మగపిల్లల బృందానికి శంకర్ నాయకత్వం వహిస్తున్నాడు.

వెనగ్గా సైకిలు తొక్కుతూ వాళ్ళనే చూస్తూన్న మన్మధకు బాలెన్సు తప్పింది. పక్కనున్న పేవ్‌మెంటు మీద పడబోయి, కాలుపెట్టి పడకుండా పరువు కాపాడుకున్నాడు. మనోహర్ అతనికి పక్కగా వచ్చాడు.

"ఏం గురూ! పడిపోతున్నావేమిటి?" అన్నాడు వెటకారంగా.

"పడడం పతనం కాదోయ్!" మన్మధ ధీమాగా అన్నాడు.

"క్రొయ్యకోయ్ ! అయిపోయింది నీ పని. నీ ఛాప్టర్ క్లోజ్ ఇవ్వాళ్టితో! తులసి తిలక్‌ను చేసేసుకుంది. పార్వతి శంకర్‌ను మేరేజ్ చేసుకుంటుంది. ఏ గట్టర్ గర్లో తప్ప ఏ డీసెంట్ ఉమనూ నీ పక్కనజేరదు"

"ఒరేయ్... ఒరేయ్! ఏమైందిరా నీకూ?" మన్మధ కళవళపడ్డాడు.

"ఇంతవరకూ ఏం కాలేదు. ఇహ ముందు అవుతుందేమోనని భయంగా వుంది. అందుకనే నీతో క్విట్స్!"

మన్మధకు తల తీసేసినట్టుగా ఉంది. "అన్యాయంరా ఇది. నీకెంతో హెల్ప్ చేద్దామనుకున్నాను. నా ప్లాన్స్ సక్సెస్ కావడానికి నీ హెల్ప్ ఎంతో లభిస్తుందని ఆశించాను"

మనోహర్ పెదవి విరిచాడు. "ఆఫ్టర్ ఆల్, కనీసం రత్తినికూడా నువ్వు సెట్ అప్ చెయ్యలేకపోయావు. నువ్వు నాకేం చెయ్యగలవు ? ఇహ నా హెల్ప్ అంటావా ? మునిగిపోయే పడవలో ప్రయాణం చేసేటంత తెలివితక్కువ వాణ్ని కాదు నేను. గుడ్‌బై!" మనోహర్ సైకిలు ముందు సైకిళ్ళతో కలిసిపోయింది. మన్మధ సైకిలు వంటరిదై వెనకబడి

పోయింది.

* * *

"వాట్ ఈజ్ దిస్? ఏమిటిదంతా?" గాభరాగా అడిగాడు డాక్టర్ మూర్తి తన గదిలోకి తోసుకువచ్చిన విద్యార్థుల్ని చూస్తూ.

శంకర్ నవ్వుతూ అన్నాడు-"నథింగ్ టు వర్రీ ప్రిన్సిపాల్‌గారూ! మేమంతా మ్యారేజి ప్రొసెషన్‌లోవాళ్ళం!"

"వాట్ మేరేజ్? ఏం పెళ్ళి? ఎవరి పెళ్ళి? హూజ్ మ్యారేజ్?"

ప్రసన్న శంకర్ పక్కకు చేరాడు. "నవతరం పెళ్ళి, యువతరం పెళ్లి, రిజిష్టరు పెళ్లి, దండల మార్పిడి పెళ్లి, మీ స్టూడెంట్ పెళ్లి... మీరు బ్లెస్ చెయ్యాలి. అందుకే కపుల్‌ని ఇక్కడకు తీసుకువచ్చాం!"

"ఏరీ ఆ కపుల్? ఎక్కడ ఆ జంట?"

"ఇక్కడే ఉన్నాం మాష్టారూ!" అంటూ తిలక్, తులసి ముందుకు వచ్చారు. ఆయన కాళ్ళకు వంగి దణ్ణం పెట్టారు.

"ప్రిన్సిపాలుగారూ! ఇంట్లోఅటు వాళ్ళ అమ్మకూ ఇష్టంలేదు, ఇటు మా నాన్న గారికీ ఇష్టంలేదు. అయినా సరే-కులాన్ని కాదని, మతాన్ని తోసిరాజని మేం ఇద్దరం ఒకటయ్యాం. ఇద్దరమూ అడల్ట్సమే! అంచేత ఇహ ఈ ప్రపంచంలో ఏ శక్తీ మమ్మల్ని వేరుచెయ్యలేదు. అమ్మా నాన్నల దీవెనలు లేకపోయినా, కనీసం మీరన్నా మమ్మల్ని దీవించండి. ఆ బలంతో ముందుకు సాగిపోతాం"

"నేను మిమ్మల్ని దీవిస్తానని మీరెందుకనుకున్నారు? వెడూయూ థింక్ సో?"

"మీరు పాఠం చెప్పే మాష్టారు కనుక!" తిలక్ నవ్వుతూఅన్నాడు "ఈ ప్రపంచంలో ఒక్కటీచర్ మాత్రమే యువత అభిప్రాయాల్ని అర్థంచేసుకోగల స్థితిలో ఉంటాడు. లాయర్స్,డాక్టర్స్, ఆడిటర్స్ వాళ్ళకెవరికీ యువతీ యువకుల ప్రాబ్లమ్స్ అర్థం కావు. పైగా మీరు ఎపుడూ ఫార్‌వర్డ్ లుకింగ్ జెంటిల్‌మన్‌గానే ఉన్నారు. అందుచేత..."

డాక్టర్ మూర్తి ప్రేమగా తిలక్ చేతిని నొక్కాడు. "వెల్ సెడ్ అండ్ వెల్‌డన్ మై బోయ్" అన్నాడు. కాలేజీ ప్యూనుకు చెప్పి రెండు దండలు అప్పటికపుడు తెప్పించి వధువు చేత వరుణ్ణీ, వరుడు చేత వధువునూ గార్లెండ్ చేయించాడు.

"మే గాడ్ బ్లెస్‌యూ విత్ లాంగ్, హాపీ మేరీడ్ లైఫ్" అంటూ వాళ్ళిద్దర్నీ దగ్గరకు తీసుకుని వాళ్ళ శిరస్సులను చుంబించాడు.

డాక్టర్ మూర్తిగారు ఆవిధంగా దీవించడంతో,తమచర్యను ఒప్పుకోడంతో వాళ్లకు ఏనుగెక్కినట్లయింది.

ఆ తర్వాత శఠగోపంగారి దీవెనలందుకున్నారు.

అందరికీ లాంచీమీద వివాహభోజనం ఏర్పాటు చేశారు.

టేప్‌రికార్డరులోనుంచి 'వివాహభోజనంబు' అంటూ పెద్దగా వినిపిస్తోంది. గోదావరిలో తిరిగే చేపలు, పైన ఎగిరే పిట్టలు, పడవనడిపే సరంగులు, రోజూ ప్రయాణంలో కలిసే మొహం ఎరిక మనుషులు ఆ డిన్నరులో పాలు పంచుకున్నారు. పాటలు పాడుకున్నారు. డాన్సులు చేశారు. వయసు మరిచారు అందరూ.

అందరిలోనూ ఉత్సాహం పొంగు కొంత తగ్గింతర్వాత, గుంపుగా ఒకచోట చేరింతర్వాత శంకర్ అదను తెలిసి





మాటల్ని ప్రయోగించాడు-వాళ్ళను తమ వేపుకు తిప్పుకోటానికి. రేవులు ఒక్క టొక్కటిగా వెనక్కు జారుకుంటున్నా, ఒడ్డున నడిచే పల్లీయుల గీతాలు గాలిలో మేఘాల రెక్కలమీదగా అల్లనల్లన తేలివస్తూ సేదదీరుస్తున్నా వాళ్లు వాటిని పట్టించుకోకుండా శంకర్ చెప్పేదంతా శ్రద్ధగా విన్నారు. అవునంటూ తమ ఆమోదం తెలిపారు శంకర్ పథకానికి.

"అప్పారాయనింగారికి లేని వ్యసన మంటూ లేదని తెలిసింది. అందుచేత ఆయన వ్యసనాలను మరింత ఎక్కువ అయేట్లు చేయాలి మనం. వ్యసనాల వలయంలో చిక్కుకుని ఆయనే స్వయంగా మన పని తేలికయిపోయేట్లు చేస్తాడు గాక"

ఒక్క మనోహర్ తప్ప మిగిలిన వారందరూ చప్పట్లు కొట్టారు.

"వాళ్ళ పొలాల్లో వెట్టిచాకిరీచేసే మనుషులు ఎందరో ఉన్నారు. వాళ్ళను ఆయన మీదకు ఉసిగొల్పి, ఆయన పొలాలు ఎండిపోయి, వాటితోపాటే ఆయన గొంతెండిపోయి మనముందు ఆయన తలవాల్చేట్లు చెయ్యాలి"

"తప్పకుండా...తప్పకుండా" అంటూ మనోహర్ తప్ప అందరూ మళ్ళీ తమ ఆమోదప్రమోదాలు తెలిపారు.

అంతవరకూ అసహనంగా, అటూ ఇటూ కదులుతూ, అవకాశంకోసం కాచుకు కూచున్న మనోహర్ అప్పుడులేచి నిల బడి ఇట్లా అన్నాడు – "అప్పారాయనిం గారి గుండె తూట్లుపడితే, ఎందరిళ్ళల్లో కుండలు డింకీలు కొడతాయో మీకు తెలుసా ? ఆయన పొలాల్లో పనిపాటలు నిల్చిపోతే, ఎంతమంది పాటకజనం అన్నమో రామచంద్రా అంటూ అలమ టిస్తారో మీకు తెలుసా? ఆయన మిల్లులో లాకౌట్ ప్రకటిస్తే కూలీలెందరు నిరు ద్యోగులయి బిచ్చగాళ్లుగా మారిపోతారో మీకు తెలుసా ? మరో విషయం ఉంది. సహాయ నిరాకరణమంటే ఒక గంటా? ఒక పూటా ? ఒక రోజా? ఒక నెలా ? సంవత్సరమా ? ఎంతకాలమని? అప్పారాయనింగారు ఒక వ్యవస్థ. కావా లంటే వందరూపాయల నోట్లని పైసలుగా ఆయన ఖర్చుపెట్టగలడు ? మనమేం చెయ్యగలం ఆయనని? ఆయన మనుషుల్ని కొనగలడు-అమ్మే సేగలడు"

మనోహర్ ఎటువేపు లీడ్ చేస్తున్నాడో శంకర్‌కు అర్థమైంది. పార్వతికి సంజ్ఞ చేశాడు. అతను ఇలా చెప్పగలడని తాము ముందే ఊహించుకుని అందుకు సిద్ధం చేసుకున్న సమాధానాన్ని నలుగురికీ తెలియజేయమని ఆ సంజ్ఞ అర్థం. పార్వతి లేచి నిలబడింది. ఆచితూచినట్లుగా అన్నది–

"అప్పారాయనింగారి ఆత్మబంధువు లైనా సరే మన మనోహర్‌గారు మాట్లాడి నంతగా బలపరుస్తూ మాట్లాడలేరు. మనకు తెలుసు అప్పారాయనింగారి బలమేవిటో? రమ, విస్కీ సేవించిన బలం అది. ఒకరి మీద ఆధారపడి బతికే పేరసైట్ ఆయన! ఆ జాతి మనుషులకు పిరికితనం ఎక్కువ. దొరవారు అంటూ ఆయన్ని గౌరవించేవాళ్ళను మనవేపుకు తిప్పు కోడానికి మరో పథకం కూడా వేశాం. మన కాలేజీలో యన్.యస్.యస్. వుంది. విద్యార్థుల సేవాపథకం. ప్రిన్సిపాలు గార్ని రిక్వెస్ట్ చేస్తే ఈ సంవత్సరం ఆ ఊళ్ళో మన క్యాంపు వేస్తారు. ఆ వలంటీర్లే మనకు సైనికులు. పగలు సేవ చేసి, రాత్రిపూట అప్పారాయనింగారి తాలూకు మనుషులు అనుకున్న వాళ్ళను

మనమూ, మన సైనికులూ వెళ్ళి వాళ్ళ ఇళ్ళదగ్గర కలుద్దాం. కొద్దిరోజుల్లో వాళ్ళంతా అప్పారాయనింగారికి వ్యతిరేకమైపోక తప్పదు"

"ఆయన దగ్గర ఓ అల్సేషియను కుక్క ఉంది. డబుల్ బారెల్ గన్ వుంది. తల్చుకుంటే మీ అందర్నీ పిట్టల్లా కాల్చేయగలడు" మన్మథ అన్నాడు, మనోహర్‌కు వత్తాసుగా.

ఆ ఒక్కమాటా మన్మథను పట్టిచ్చేసింది.

"ఆ కుక్కను చంపేద్దాం. ఆ గన్‌ను పూడ్చేద్దాం" అంటూ మన్మథ వేపు తిరగబడ్డారు అందరూ. అయినా మనోహర్ తన స్నేహితుడి రక్షణకు రాలేదు. పెదవి మెదల్చకుండా బెల్లం ముద్దలాగా ఓ పక్కన కూచుండిపోయాడు.

వాళ్ళంతా తక్షణం మనోహర్‌నూ, మన్మథనూ లాంచీదిగి వెళ్ళిపొమ్మన్నారు. మన్మథ ముందు గునిశాడు. పేచీపెట్టాడు. కానీ పదిమంది ముందూ తట్టుకోలేక లాంచీ దిగి రేవులోకి వెళ్ళిపోయాడు.

"సారీ ఫ్రెండ్స్! పెళ్ళి భోజనంలో మసాలా ఎక్కువైనట్టు మన్మథ మాటలు మనకు కారం కారంగా ఉన్నాయి. వాటిని పెద్దగా పట్టించుకోనక్కరలేదు మనం. అట్లా అని నెగ్లెక్ట్ కూడా చెయ్యొద్దు మనం! అతనన్న దాంట్లో ఒక మంచి పాయింట్ ఉంది. కూలీలకు పనిపోతే, పాపం వాళ్ళ సంసారాలు గడిచేదెట్లా? అందుకని కొంత నిధి పోగుచేద్దాం. సమ్మె సమయంలో వాళ్ళకు సహాయపడదాం!"

మూడో రేవులో దిగుతున్న శంకర్‌ను చూసి ఆశ్చర్యపడుతూ పార్వతి అడి



గింది—"మీ ఇల్లు ఈ లంకలో కాదుగా?"

"ఇవ్వాళ్టి నుంచీ ఇక్కడే!"

"అదేం?"

"మన్మథ అప్పారాయనింగారికి ఉప్పు అందించేసి ఉంటాడు ఈసరికి. నిన్నెట్లా సాధించడమా అని ఆయన బహుశః ఈ సరికి పథకాలు ప్రారంభించి ఉంటాడు. మామ్మగారికి ప్రామిస్ చేశాను — నా ప్రయత్నంలో ప్రాణాలు పోయినాసరే, మీ ఇద్దర్నీ మాత్రం కాపాడి తీరతాను అని! ఈ ప్రాజెక్ట్ పూర్తయే వరకూ అనుక్షణం నేను మీతోనే ఉంటాను"

తమ మీద అతనికి గల ఆప్యాయతకు పార్వతి కళ్ళు చెమర్చాయి.

"మీకేం అభ్యంతరం లేదుగదా?" అని శంకర్ అంటే, "అభ్యంతరం పెట్టమంటారా?" అంది నవ్వుతూ.

లాంచీ రేవులోకి రాగానే ఇద్దరొక వెపు, మరొక వైపు మరో ఇద్దరూ నడిచి పోయారు—గుడ్‌నైట్ చెప్పుకుని.




యన్. యస్. యస్. వలంటీర్లు గ్రామంలోకి వచ్చి దేవాలయానికి వెళ్ళే అప్రోచ్ రోడ్డును బాగుచేశారు. ఊరి చెరువులో పేరుకుపోతున్న గుర్రపుడెక్క ఆకును తొలగించేశారు. నీళ్ళరేవు మెట్లను మరమ్మత్తు చేశారు. బీదవాళ్ళ ఇళ్ళల్లోకివెళ్ళి విటమిన్ టాబ్లెట్లను పంచిపెట్టారు. విసిరి వేయబడినట్లుగా వున్న హరిజనవాడల్లోకి వెళ్ళి పారిశుద్ధ్య నియమాలను వివరించారు. పదిపదిహేను రోజుల్లో తమ ప్రవర్తనతో, నిజాయితీతో, చతురోక్తులతో, తెలివితేటలతో ఆ ప్రజల మనస్సుల్ని దోచుకుని వాళ్ళకు దగ్గరవాళ్ళైపోయారు.

వాళ్ళ నెలరోజుల క్యాంప్‌లో పదిహేను రోజులైపోయాయి. ఇంకో పదిహేను రోజులు మాత్రమే మిగిలున్నాయి. ప్రజల్ని తమవాళ్ళను చేసుకున్నాక అప్పారాయనింగారి పని పట్టాలన్నది వాళ్ళ అభిప్రాయం.

ఈ లోపల వాళ్ళకొక సమస్య వచ్చిపడింది. తులసి చేసిన పనిని వాళ్ల అమ్మగారు హర్షించలేదు. "నన్ను కాదని రిజిష్ట్రి ఆఫీసుకే వెళ్ళిపోయి పెళ్ళిచేసుకుని వచ్చేసిందానివి నిన్నుమాత్రం నేను ఎందుకు అవునంటాను? ఈ ఆస్థిలో నీకు చిల్లి కానీ వాటా ఇవ్వను. ఏ ధర్మసత్రానికో రాసేస్తాను. వెళ్ళు వెళ్ళు" అన్నదామె. అంటూ తులసిని బయటకు తరిమేయబోయింది.

తులసి ఎదురు తిరిగింది.

"ఈ ఆస్థి నీ స్వార్జితంకాదు. పిత్రీయంగా వచ్చింది. ఇందులో నాకు వాటావుంది. నా వాటా నాకు పంచిపెట్టు. ఆ తర్వాత మిగిలింది నీకిష్టం వచ్చినట్టు తగలెట్టు!"

తల్లీ కూతుళ్ల వివాదాన్ని ఎవరూ తీర్చలేకపోయారు. అది చిలికి చిలికి గాలివానయింది.

"తులసీ! ఆస్థికోసం ఎందుకంత పట్టుదల? నీకూ, నాకూ రెక్కలున్నాయి. ఆరోగ్యం వుంది. ఆలోచనలున్నాయి. మీ అమ్మా, మా నాన్నా మనల్ని రోడ్డు మీదకు తరిమేస్తారని ముందే అను

వున్నాం కదా మనం? ఇందులో కొత్తే ముంది? ఎందుకు మీ అమ్మగారితో ఆ వివాదం? పోదాంపద" అన్నాడు తిలక్ అనునయంగా.

ససేమిరా వొప్పుకోలేదు తులసి. "నన్ను తప్పు చేసిందానికింద జమకట్టి వాకీశిక్ష వేస్తోంది మా అమ్మ. ఆమె ఆ విధంగా అనుకొంటున్నందుకు ఆమెకే శిక్ష వేయాలి నేను" అంది.

ఇద్దరూ వచ్చి యన్. యస్. యస్. క్యాంపులో చేరారు. యన్. యస్. యస్. ఆఫీసరు శఠగోపం ఆ ఊరివాడే అయి నందువల్ల ఎక్కడ ఏ పని అవసరమో అక్కడ దాన్ని చకచకా చేయిస్తున్నాడు.

"యన్. యస్. యస్. క్యాంప్ మీ హనీమూన్ కాదుగదా?" మేళమాడా డాయన.

"సార్! ఆఫ్ డ్యూటీ పీరియడ్‌లో మీరు మాకు కొంత కన్‌సెషన్ ఇవ్వాలి" తులసి ప్రాధేయపడింది.

"మీ ఇద్దరికేనా?" ఆయన చిలిపిగా అడిగాడు. "మీ ఇద్దర్నీ పట్టుకున్నా ఆగు తారనుకనా? అయినా భార్యాభర్తలకు నా పర్మిషన్ ఎందుకమ్మా... చెట్లూ, పుట్టలూ, తోటలూ, దొడ్లూ, నదీనదాలూ, సైకతస్థలాలూ, చంద్రోదయాలూ, సూర్యాస్తమయాలూ అన్నీ వాళ్లవేకదా"

"మా ఇద్దరికే కాదండీ— అందరికీ పర్మిషన్ కావాలి" తిలక్ అన్నాడు.

"చంపారు పొండి. అప్పుడిది ఎన్. ఎస్.ఎస్. క్యాంపు కాదు, బృందావనం అవుతుంది. ఆ తర్వాత మెటర్నిటీ వార్డు ఓపెన్ చెయ్యాల్సివస్తుంది"

అందరూ పగలబడి నవ్వుతున్నారు. తిలక్ సిగ్గుసిగ్గుగా అన్నాడు "నా ఉద్దేశం అది కాదండీ! డ్యూటీస్ అయి పోయింతర్వాత అందరం కలసి మా అత్తగారి విషయం కాస్త ఆలోచిద్దామని"

"తెలుసు లేవోయ్, వూరికె నే అన్నాను. ఉలుక్కోకు" శఠగోపం అతని భుజం తట్టుతూ అన్నాడు.

రాత్రిపూట అందరూకలసి తులసివాళ్ళ ఇంటికె వెళ్ళారు. అంత మందిని చూసి తులసి తల్లి కంగారు పడింది. ఆమెను ఎటూ కదలనీయకుండా ఒకచోట కూర్చో పెట్టారు. ఆమె కళ్ళఎదుటే వంట ఇంట్లోనూ, దేవుడి గదిలోనూ దూరి వంట చేసి దేవుడికి నైవేద్యం పెట్టారు. ఆ నైవేద్యాన్ని తీసుకువచ్చి ఆమె ముందుంచి, "ఇది దేవుడి ప్రసాదం. తీసుకోండి. లేక పోతే మీ కళ్లు పోతాయి, ఆనక మీఇష్టం" అంటూఆమెకుబలవంతంగా తినిపించారు. ఆమె కళ్ళముందే తులసికి తెల్లచీర కట్టి, పూలు కుట్టారు. బుగ్గన చుక్క పెట్టి, కాళ్లకు పారాణి అద్దారు. తిలక్‌నూ, తులసినీ తీసుకువచ్చి ఆమెకు పాదాభి వందనం చేయించారు. ఆమె చేతుల్లో అక్షింతలు పెట్టి "ఆశీర్వదించండి పిన్ని గారూ... మీ అమ్మాయినీ, అల్లుణ్నీ" అని ఆమె వాటిని వేస్తుండగా ఫొటోలు తీశారు. ఆ తర్వాత ఆ ఇంట్లో తాత తండ్రుల పరంగా వస్తున్న పెద్ద పందిరి మంచం వున్న గదిని అందంగా అలంక రించి, వధూవరుల్ని మేళమాడుతూ గది లోకి పంపించారు.

తులసి తల్లికి కోపంగా ఉంది. అయినా ఆ తల్లి గుండెలో రవంత సంతోషపు కదలిక కూడా ఆమెకు తెలియకుండానే కదిలించి. ఆమె దగ్గరకు మెల్లగా చేరాడు శంకర్. ఆలోచిస్తున్న ఆమెతోఅన్నాడు— "పిన్నిగారూ! ఒక మాట చెబుతాను వింటారా?"

ఏమిటన్నట్టు చూసింది ఆమె. "మన దేశంలో ఈ కులభేదమే మన పాలిట శాపంగా పరిణమిస్తోంది. గుణభేదమే లేని మహాత్ములున్న దేశంలో ఈ కులబేధం ఎందుకు మనకూ? అది పోవాలంటే కంచం, మంచం ఏకంకావాలి. మా స్నేహితులూ, స్నేహితురాండ్రూ ఒకకులంవాళ్లు కాదు. మీ ఇల్లు ఇవ్వాళ పావనం చేశారు. వంటిల్లుకు కళ తెచ్చారు. దేవుడికి దుమ్ము దులిపారు. ఇహ మీరూ, బాబాయిగారూ వాడిన ఆ పందిరి పట్టెమంచం ఇప్పుడు మా తమ్ముడు తిలక్ వాడుకొంటున్నాడు. ఇంకా ఎందుకూ మీకు పట్టుదల? ఓ పదినెలల్లో మా మరదలు తులసి మీకో మనవణ్నో, మనవరాల్నో ఇస్తుంది. హాయిగా ఆ పసికూనతో కాలక్షేపం చెయ్యండి"

వాళ్లు చేస్తున్నదంతా జబర్దస్తీ అనిపించిందామెకు. మర్నాటి ఉదయం వాళ్లు తమ క్యాంప్ డ్యూటీస్‌కు వెళ్ళిపోయింతర్వాత, ఆమె సరాసరి అప్పారాయనింగారి ఇంటికి వెళ్ళి ఆయనతో తన గోడు వెల్లడించుకుంది.

"ఎట్లాగయినా సరే ఆ కోతిమూక నుంచి మీరే నన్ను కాపాడాలి"

"ఆలోచిస్తాను! మీరు రేపోసారి రండి" అన్నాడాయన.

ఆ రాత్రి శంకర్, పార్వతి, మిగిలిన వాళ్లూ తులసి ఇంట్లోఉన్న చెంబు-తపాళా అన్నీ లెక్కకట్టి ఓ పట్టీ తయారుచేశారు. నగానట్రా వేరుచేశారు. భూమీ పుట్రా లెక్క కట్టారు.

"పిన్నిగారూ! మీరు మా తులసికి న్యాయంగా ఇవ్వవలసినవి ఇవీ" అంటూ వాటినన్నిటినీ ఆమెకు చదివి వినిపించారు.

"మీరు ఇవ్వకపోతే మేమే తీసుకుపోతాం" అంటూ హెచ్చరించారు.

మర్నాడు ఆ సంగతీ అప్పారాయనింగారికి నివేదించింది ఆమె. "ఈ పెళ్ళి నాకు అసలు ఇష్టంలేదు. ఇష్టంలేని పెళ్ళికి ఆస్తి పంపకాలేమిటండీ?" అంటూ మొత్తుకుంది. నెత్తీ నోరూ బాదుకుంది. వాళ్ళమీద పంచాయితీ పెట్టించమంది.

"ఓసి పిచ్చిదానా! నీ కూతురుకూ, ఆ తిలక్‌గాడికీ పెళ్ళయిపోయింది. అది మర్చిపోకు. నీ కూతురు ముండమోస్తేనే వాళ్ళిద్దరూ వేరయ్యేది. ఆ పని చేయించమంటావా?"

బుగ్గన చుక్కతో, నొసటన బొట్టుతో, కాళ్ళకు పారాణితో, తలలో పూలతో, చేతులకు గాజులతో, తెల్లచీరలో మెరుపు తీగలా మెరిసే తులసి ఆమె కళ్ళకు కనిపించింది. ఆ పిల్లే మళ్ళీ విధవరాలుగా... "వద్దు. వద్దు...అట్లా వద్దు. దాని అయిదోతనం తీసేయవద్దు"

శరభలింగం విసుగ్గా అడిగాడు- "అయితే దొరవార్ని ఏం చెయ్యమంటావమ్మా?"

"నా కూతురు ఇంత సాహసం చెయ్యటానికి ఆ కులం తక్కువపిల్ల పార్వతే అని నా అనుమానం. తిలక్‌ను దానిమీదకు ఉసిగొల్పింది ఆ శంకర్‌గాడే! సందేహం లేదు. వాళ్ళిద్దరూ ఆ కోతి మూకకు శ్రీరామచంద్రుడూ, సీతా మహాసాధ్వీనూ"

"అర్థమయింది... అర్థమయింది'' అప్పారాయనింగారు తల పంకించారు. "మీకు వాళ్ళపీడ విరగడ చేస్తాం. వెళ్ళి రండి'' అంటూ ఆమెను అవతలకు పంపించేశాడు. ముక్కూ మొహం తెలీని కాలేజీ విద్యార్థులు తన గ్రామంలో కాలు




పెట్టినప్పట్నుంచీ ఆయనకు అంతా ఇరకాటంగానే ఉంది. దేవుడి గుళ్ళో పొద్దున్నే గంట మోగుతోంది. పూజ ఖర్చు కోసం పూజారి రోజూ తనను వేధించడం మొదలుపెట్టాడు. తన పొలాల్లో పనిచేస్తున్న కూలీలు వాళ్ళలో వాళ్లు గుసగుసలు ప్రారంభించారని తెలుస్తోంది. మిల్లులో కూలీలు కూడా అప్పుడే ముఠా కట్టేశారట. ఇవన్నీ మంచి శకునాలు కావు. దానికి తోడు ఆయనకు గతరాత్రి పిటపిటపిల్ల అన్న మాటలు జ్ఞాపకం వచ్చి మరింత కంపరం ఎత్తింది.

''బాబుగోరూ ! పెతి రాత్రీ తవ దగ్గరకు రోజుకు ఒక్కో గుంట వొత్తుంటుంది కదు బాబూ... ఆ గుంటల నందర్నీ కలుసుకుని రహస్యంగా ఆ శంకర్‌బాబూ, పార్వతమ్మా ఏదో మాట్టాడేసేత్తున్నారండి! కాలేజీ పిల్లలేమో మందులకొట్లో కుక్క బిస్కత్తులు కొంటంవారండీ! మీ దగ్గర కుక్కల్లేవు కదుటండీ అని ఆ కొట్టువోడడిగితే అప్పారాయనింగారి ఆల్సేషియన్ కుక్కుంది కదా అనడం నాను సెవులారా ఇన్నానండీ" అందది.

ఆయనకు చెమట పట్టింది. అయినా మేకపోతు గాంభీర్యంతో "మన కుక్క, అది టైగర్‌కదుటే... దాన్నెవరేం చెయ్యగలరూ? ఇహ నా విషయం అంటావా? మనకు రోగాలంటుకోవే" అన్నాడు.

''అట్లాగా దొరవారూ!" శరభలింగం ఆశ్చర్యాన్నభినయించాడు. అప్పారాయనింగారు పిటపిటలాడే పిల్లవేపు పులుకూ పులుకూ చూస్తూ అన్నాడు-"మనమసలు అడదాన్తో తొంగుంటే కదా రోగాలంటు కోడానికి! ఏవే పిల్లా-అంతేగదా?''

అప్పుడు నర్సమ్మ చెప్పిన మాటల్లోని అసలు సంగతి అప్పారాయనింగారి నోటినుండే స్వయంగా విని శరభలింగం కొయ్యబారిపోయాడు. 'అయితే ఆయన సంతానం.... రామరామ... !' పిటపిటలాడే పిల్ల పకపక నవ్వింది. "తొంగుంటమే అక్కర్లేదు దొరవారూ రోగాలంటుకోడానికి! నోట్లో నోరెట్టి ముద్దెట్టుకున్నా, ఆ ఎంగిలి తగిలి కొన్ని రోగాలొత్తాయంట''

"అట్లాగా !"

శరభలింగం, ఆ పిటపిట పిల్లా వెళ్ళిపోయినా ఆ మాటలు ఆయనను కుట్టడం మానలేదు. తనను సర్వనాశనం చేయడానికి వాళ్ళు పూనుకున్నారన్న మాట! తనను వ్యక్తిగతంగా హింసిస్తారు. తన భూముల్లో పనివాళ్ళు పనిచేయకుండా, తన మిల్లులో కూలీలు పనిచెయ్యకుండా, ఊళ్ళోవాళ్ళు తనను గౌరవించకుండా, తననేకాదు తన కుక్కను కూడా వాళ్ళు వదిలిపెట్టరు! ఇదెక్కడి కక్ష?ఆయనకళ్ల రక్తపుజీరలతో ఎర్రబారాయి. ఒళ్ళు వేడెక్కింది.

మన్మధకు కబురుచేశాడు.

''ఏరా, నీకా పార్వతి కావాలా ? వద్దా?'' డైరెక్టుగా అడిగేశాడు.

మన్మధ నీళ్ళు నములుతున్నాడు ''అదికాదు బాబాయ్...!''

"ఈ బాబాయ్ దగ్గరకు నువ్వు ఇంత వరకూ రాలేదు. ఈ బాబాయి నిన్ను పిలిపించలేదు. తండ్రిపోయినవాడివి గదా, నీ తిప్పలు నువ్వు పడుతున్నావు అని నిన్ను గమనిస్తోనే వున్నా. నీ దారికి ఎప్పుడూ అడ్డురాలేదు. నీకు దానిమీద మనసు వున్న సంగతీ తెలుసు. వాళ్ళు నిన్ను తమలోనుంచి బహిష్కరించారన్న సంగతీ తెలుసు. వెధవా! తెలివిగలవాడి

వైతే, తాగి తందనాలాడకుండా వెంటనే నువ్వు నా దగ్గరకు రావద్దూ... ఇద్దరం కలసి పథకం వేసేవాళ్ళంగదా"

"తప్పయిపోయింది బా బా య్'' అంటూ మన్మథ అప్పారాయనింగారి దగ్గర అతి వినయం నటించాడు. ఇద్దరూ కలిసి చెవులు కొరుక్కోడం మొదలు పెట్టారు.

* * *

'రత్తీ! ఈ కంచి పట్టుచీర చూశావా? నీ వొంటికి ఎంతో బావుంటుందని, నీ కిచ్చేయాలని ఎంత కాలంగానో అను కుంటున్నానే. ఇవ్వాల్టికి వీలుపడింది' అంటూ అప్పారాయనింగారు ఆమె మీదకు తన రెండో భార్య కట్టి విడిచేసిన పాతచీరను విసిరేశాడు.

రత్తి ఆ చీరను తీసుకోలేదు. "మా మగోడికి ఇంకోళ్ల సీరలు నాను కట్టు కోడం అంటే ఇట్టం ఉండదు బాబూ" అన్నది నమ్రతగా. "సీరలూ వొద్దు, సగలూ వొద్దు కాని బాబూ— ఎందుకు పిలిపించారో సెప్పండి. సేసేసి ఎళ్ళి పోతాను"

ఆ మాటా ఈమాటా చెప్పి చివరకు అప్పారాయనింగారన్నాడు." అర్జంటుగా ఇక్కడకు— అహా, ఇక్కడకు వద్దులే, మన తోటలో బంగ్లాలోకి పార్వతిని నువ్వు తీసుకు రావాలి దగ్గరుండి"

"ఆ అమ్మాయి రాదు బాబూ, నిప్పు లాంటిది. నాకు తెల్సు. పెతీరోజూ పడవమీద మేం కల్సుకుంటాం"

"నేను రమ్మన్నానని చెప్పు. తప్ప కుండా వస్తుంది. నాకు మాట ఇచ్చింది"

"ఆ అమ్మాయి తవకాడికొత్తానని మాట ఇచ్చిందా?" వెటకారంగా నవ్వింది రత్తి. "అయితే రప్పించుకోండి బాబూ! నాను కబురు సెప్పేసి ఎళ్ళిపోతాను" వెళ్తూ వెళ్తూ మళ్ళీ ఆగి అనుమానంగా అడిగింది. "ఈ రాయబారానికేనా బాబూ తవరు నన్ను కేకేశారు?"

అప్పారాయనింగారి వేళ్లమధ్య ఎర్రగా సిగరెట్టు. ఆయన నోట్లో ఎర్రని తాంబూలం. ఆయన కడుపులో ఎర్రని విస్కీ. ఆయన కళ్ళల్లో ఎర్రని కామం. ఆయన ఎర్రని మంట ముక్కలా ఉన్నాడు.

"నేను రప్పించుకో లేకకాదే, నిన్న యితే నమ్మి ఆ పిల్ల ఇక్కడికి వస్తుంది. గోటితో పోయేదానికి గొడ్డలెందుకూ?"

"నాను పిల్చుకొత్తానని మీరెందు కనుకుంటారు బాబుగోరూ? నానంత కాని దానిలా కనిపిత్తున్నానా తమ కళ్ళకు?"

"ఛా!ఛా! నిన్ను చూస్తే నాకు మన మహా పతివ్రతలు జ్ఞాపకం వస్తారే! నీకు మొగుడంటే ప్రాణం. వాడికి నా మాటంటే వేదం. నా మాట వాడు కాదనడు. వాడి మాట నువ్వు కాదనవు! అవునా?"

ఒకవేళ రత్తి తను చెప్పినట్టు చెయ్యక పోతే, వచ్చే పరిణామాలేమిటో కూడా స్పష్టం చేశాడు. రత్తి మొగుడి శాల్తీ ఈ భూమ్మీద ఉండదు. ఆ తర్వాత రత్తి బతుకు కుక్కలు చింపిన విస్తరి అవు తుంది. అప్పారాయనింగారు మాట్లాడుతూ ఉండగానే "వొద్దు బాబూ, పార్వతమ్మను తోలుకొత్త" అంటూ రత్తి బయటకు వెళ్ళిపోయింది.

పార్వతిని ఆ భూతగృహంలోకి చేర్చ టానికి రత్తి తన అనుభవాన్నంతా ధార పోయవలసి వచ్చింది. కాస్త నలతగా ఉందని పార్వతి ఆ రోజు ఎన్.ఎస్.ఎస్. కార్యక్రమంలో పాల్గొనలేదు. ఇంట్లోనే




ఉండిపోయింది. శంకర్ కూడా ఉండి పోతానన్నాడు. "వద్దండీ! బావుండదు" అన్నది పార్వతి సిగ్గుపడుతూ.

"ఏది బావుండదు? కాబోయే భార్యకు నలతగా వుంటే, మందూ మాకూ చూసే దిక్కు లేకపోతే ఆ మగవాడు ఇంటి పట్టున ఉండి ఆమెను జాగ్రత్తగా చూసు కోవడమా?" శంకర్ ఖస్సుమన్నాడు.

అతణ్ని బతిమలాడి బామాలి ఎట్లాగో సర్వీస్‌కు పంపించేసింది పార్వతి. ఆ వంటరి పార్వతికి మాయమాటలు చెప్పి రత్తి ఆమెను తోటకు చేర్చింది. పక్కకు తప్పుకుంది.

వెళ్ళిపోతున్న రత్తి కళ్ళల్లో నీళ్ళు.

"ఎందుకే ఏడుస్తున్నావ్?" పార్వతి కంగారుపడుతూ అడిగింది.

"ఆడబతుకే ఎదవబతుకు తల్లీ" అంటూ అక్కడి నుంచి తొందరతొందరగా వెళ్ళిపోయింది రత్తి. వంటరిగా మిగిలిపోయింది పార్వతి.

అట్లా వంటరిగా మిగిలిపోయిన పార్వతితో అప్పారాయనింగారు ముందు సౌమ్యంగా మాట్లాడారు. "మీకేంకావాలో చెప్పండి. తీసుకోండి. కానీ మీ ప్రయత్నాలు మానుకోండి. నాకీ వూళ్ళో అపోజిషన్ కట్టొద్దు; నన్ను రెచ్చగొట్టొద్దు" అన్నాడాయన మొదట.

పార్వతి ఒప్పుకోలేదు. అప్పారాయనింగారు పార్వతికి బంగారం ఆఫర్ చేశారు. ఆమె వాటిని గడ్డిపోచకింద తీసి పడేసింది. సామదానాలు విఫలం కావడంతో భేదం సృష్టించడానికి ప్రయత్నించేశాడు. "పిచ్చిదానా! శంకర్ నీకు అంత అను కుంటున్నావ్! వయసులో ఉన్న మగవాళ్ళు ఎర్రగా వున్న అమ్మాయిలంటే మోజుపడతారు. నువ్వు కాస్త ఎర్రగా బుర్రగా వున్నావని నీవెంటబడ్డాడు. నీ మోజు తీరగానే మరో అమ్మాయి వెంట పడతాడు"

"షటప్! నా శంకర్‌ని ఒక్క మాటన్నా నేను వూరుకోను. లోకంలో ఉన్న అమ్మాయిలంతా వెంటబడినా అతను చలించడు. నాకూ-అతనికీ మధ్య నువ్వు అఘాతం సృష్టించలేవు" ఉంది.

అప్పుడాయనకు దండం తప్ప మరో ఉపాయం తోచలేదు. డబ్బు మదంతో, అధికార మదంతో ఉన్నవాడు తర తరాలుగా తన ప్రతికక్షిని దండోపాయం తోనే లొంగదీసుకొంటున్నాడు.

అప్పారాయనింగారు కూడా అదే విధంగా ఆమెను భయపెట్టి, బాధపెట్టి తనదారికి తెచ్చుకుందామనుకున్నాడు. అనుకుని చేతిలోకి హంటర్ తీసు కున్నాడు.

"టైగర్ – బీ రెడీ!" అన్నాడు అల్సేషియన్ను ఉద్దేశించి. అప్పారాయనింగారి ఆ మాటలు, ఆ వేషం, ఆ చేష్టలు చూడగానే పార్వతికి తన మామ్మను కూడా ఆయన ఇదేవిధంగా ట్రీట్ చేసి ఉంటాడనిపించింది. ఒక్కసారిగా ఆమె రక్తం ఉద్రేకంతో వేడెక్కింది.

ఇంతలో శరభలింగం అక్కడకు పక్కగదిలో నుంచి నుసుగులు కక్కు కుంటూ వచ్చాడు-"దొరవారూ.... దొర వారూ!" అంటూ. "అక్కడ మన్మథ బాబు...శ్యామలను..." అని నాలికకర్చు కున్నాడు-పార్వతిని చూసి.

'శ్యామల' అన్న మాట చెవిన పడ గానే మరింత ఉద్రిక్తురాలైంది పార్వతి. గబుక్కున అప్పారాయనింగారి చేతిలో ఉన్న కొరడా లాక్కుంది. శరభలింగం మీద ఝుళిపిస్తూ "చెప్పు-ఎవరా

శ్యామల?" అన్నది పిడుగులాగా. శరభ లింగం తన దొరవేపు చూశాడు పిరికిగా. కొరడా చుంయ్‌మంటూ తగిలింది ఆయ నకు. తగిలినంతమేరా చర్మం మండి పోయింది!

"నీ చెల్లెలు"

"శ్యామలా!" పెద్దగా కేకవేసింది శ్యామలా...శ్యామలా...శ్యామలా....ఆ హవేలీ అంతా ఆ మాట ప్రతిధ్వనించింది.

శ్యామలా అంటూ వెర్రిగా పిలుస్తూ పార్వతి గదినుండి గదికి పరుగెత్తుతూ తన చెల్లెల్ని వెతకసాగింది.

'శ్యామలా' అన్నమాట చెవినపడింది ఆ గదుల్లో ఓ చీకటి గదిలో ఓ మూల వణికిపోతూ నుంచున్న శ్యామలకు.

'అక్కా' అంటూ సంతోషంతో నిండిపోయిన కంఠంతో తిరిగి జవాబు చెప్పింది ఆ పిల్ల. అక్కా...అక్కా...



అక్కా...కా...ఆ గదుల్లో ఆ గొంతు సుడుగుళ్ళు తిరిగింది. ఒక్క అంగలో అక్కడినుండి పారిపోవాలని ప్రయత్నించింది.

ఒడిసిపట్టాడు మన్మథ.

కౌగిట్లోకి లాక్కోబోయాడు.

అతణ్ణి దూరంగా విసిరికొట్టి మూలకు వెళ్ళి ఆ వేగంలో గోడకు ఢీకొట్టింది. తల బొప్పి కట్టింది.

'అక్కా' అంటూ కింద కూలబడి ఏడవసాగింది. ఏడుపును బిల్చుకుని ాలిగా. హృదయవిదారకంగా మాటలు—

"అక్క పిలుస్తోందని చెప్తే నిజమే నని నమ్మాను. నీ వెంటబడి వచ్చాను. అక్క క్లాస్‌మేట్‌వి కదా, అబద్ధం చెప్తావా అని అనుకున్నాను కానీ ఇంతటి రాక్షసు లుంటారనుకోలేదు. నన్ను వెళ్ళిపోనీ ప్లీజ్ ... ప్లీజ్!" ప్రాధేయపడింది శ్యామల.

ఆమె మీదికి అచ్చుబోసిన అంబోతులా వస్తున్నాడు మన్మథ. అతణ్ని చూసి మరింత హడలిపోతూ, వణికిపోతూ, వెనక్కి వెనక్కి జరుగుతూ, ఏడుస్తూ "నీకు దణ్ణంపెడతా, నీ కాళ్ళకు మొక్కుతా. నన్ను వదిలిపెట్టేయ్, నన్నేం చెయ్యకు" అంటోంది.

మన్మథ నవ్వాడు. పశువులా ఆమె మీద పడబోయాడు. సిగరెట్టు ఒక్క దమ్ము లాగాడు.

"ఓసేవ్...ఏడవకేడవకు. ఒక్కసారి సరే అను. ఆ తర్వాత నిన్ను వదిలిపెట్టేస్తా! మీ అక్కయ్యను కావాలనుకున్నాను. అది రానంది. నా చేతులకు దొరకనంది. పోనీలే అక్కయ్య బదులు చెల్లెలు" మళ్ళీ నవ్వాడు. "చెల్లెలు నాకూ...అక్క మా బాబాయ్‌కూనూ ! అప్పుడు మీరిద్దరూ ఏమవుతారే?"

"ఏమవుతామా ? నీపాలిట కరాళ కాళికలవుతాం" అంటూ వెనకనుండి పార్వతి అతనిమీద ఒక్క దూకు దూకింది. ఒక్క తాపు తన్నింది. ఆ తాపుకు అతను బొక్కబోర్లా పడ్డాడు. కాలుతున్న సిగరెట్టు కిందపడి, దానిమీద అతని మొహం ఆని బుగ్గ చురుక్కుమంది.

అక్కనుచూసి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయి శ్యామల గభాలున లేచి పార్వతి వెనకాలకు వచ్చి నిలబడింది. ఎక్కుపెట్టిన బాణాల్లా ఉన్నారు వాళ్ళిద్దరూ. వాళ్ళ మొహాలు కత్తి అంచుల్లా మెరుస్తున్నాయి. కిందపడ్డ మన్మథ చీకటిసుద్దలా ఉన్నాడు. విరిగిన చెట్టుకొమ్మలా ఉన్నాడు.

ఆ స్థితిలో వాళ్లు ఉండగా వెనుకనుంచి అప్పారాయనింగారు పరుగెత్తుకుంటూ వచ్చి పిస్తోలు తీసి - "హాండ్సప్" అన్నాడు.

నిస్సహాయంగా తొంగిపోవలసి వచ్చింది ఆ ఇద్దరూ.

"ఒరేయ్ అబ్బాయ్...ఎవరు కావాల్రా నీకు?"

మన్మథ కసిగా అన్నాడు. "ముందు జామిపండును, తర్వాత మామిడిపండు!"

"అయితే కానీ! పిస్తోల్తో నీకు నేను కాపలా"

మన్మథ శ్యామలను చేయిపట్టి లాగాడు తనవైపుకు. ఆమె ఓణీలాగి అవతల గిరవాటేశాడు.

అప్పుడే పొటమరిస్తున్న యౌవనం ఆమెది. వక్షస్థలాన్ని చేతులతో కప్పుకుంటూ "అక్కా...అక్కా" అంటూ పార్వతివేపు చూస్తూ దీనంగా కన్నీళ్ళు కార్చడం మొదలెట్టింది శ్యామల.

ఆమెను ఆ స్థితిలో చూస్తుంటే పార్వతి హృదయం మండిపోతున్నది. తన అశక్తతమీద తనకే కోపం వస్తున్నది. శ్యామల శీలం కన్నా తన ప్రాణం ఎక్కువా? వాడు, ఆ పశువు, ఆ మన్మథ శ్యామల పరికిణీపట్టుకునిగుంజుతున్నాడు. కీచకుడిలా నవ్వుతున్నాడు. ఎప్పుడో ద్రౌపదిని కాపాడాడట కృష్ణుడు...ఏడీ రాడేం? మేరీమాగ్దలీన్‌ను రక్షించాడట ఏసుక్రీస్తు. ఎక్కడున్నాడు ప్రభువు? తిష్యరక్షిత కోసం బుద్ధుడే కదిలివచ్చాడట. ఏదీ ఆ బుద్ధుని కరుణాశక్తి ?

ఒక్కసారి విదిలించుకుంది పార్వతి. దండతాడిత భుజంగంలా ఎగిరి దూకింది అప్పారాయనింగారి మీదకు.

అతని చేతుల్లో ఉన్న పిస్తోలును లాక్కున్నది. ధన్...ధన్...ధన్...ధన్... బుల్లెట్లు దూసుకుపోయాయి. పొగ కమ్మేసింది. ఆ పొగలో, ఆ కసిలో





అప్పారాయనింగారు, మన్మథ కిందపడి పోయారు. అప్పారాయనింగారి వెంటబడి పరుగెత్తుకు వచ్చిన అల్సేషియన్ నాలిక బయటపడేసి, కళ్ళు తేలేసి తన యజమాని కాళ్ళదగ్గర నిర్జీవంగా పడిపోయింది.

పొగ తగ్గింతర్వాత, కసి పొంగు చల్లారుతున్నప్పుడు పార్వతి మెల్లగా అడిగింది – "శ్యామలా! ఆర్ యూ ఆల్ రైట్?"

"అక్కా! నేను బాగానే ఉన్నాను. నువ్వు?"

పార్వతి వదనం ఈ జీవితం అర్థం తెలిసిపోయిన వేదాంతిలా వెలిగిపోతోంది.

"అప్పుడు అమ్మను, ఇపుడు నిన్ను రక్షించుకున్నాను. అది చాలు నా బతుక్కి" అన్నది.

అపుడే శంకర్ వచ్చాడక్కడికి మరి కొందరితో. వాతావరణం చూసి స్తంభించి పోయాడు. కథ అంతా అర్థమయింది.

"పార్వతీ ! ఒక్కమాట చెప్పు – కనీసం ఇప్పుడైనా!! నామీద నీకు మనసు ఉంది. అది నాకు తెలుసు. కానీ ఎందుకు పెళ్ళిప్రసక్తి వచ్చినపుడల్లా ఆ విషయంలో దాగుడుమూతలాడుతున్నావు ?"

పార్వతి కళ్ళు మూసుకుంది. "నేను చిన్నప్పుడే ఒక హత్య చేశాను శంకర్ ! ఒక హంతకురాలిని పెళ్ళాడే ధైర్యం నీకుండదనుకున్నాను"

శంకర్ పార్వతిని దగ్గరకు తీసుకుని చిన్నబిడ్డలా అనునయించాడు.

"ఆ విషయం నాకెప్పుడో తెలుసు పార్వతీ! నువ్వు బోర్స్టల్ స్కూలులో పెరిగి పెద్దదానివైనావన్న సంగతి కూడా నాకు తెలుసు"

"నిజంగానా!?"

"బోర్స్టల్ స్కూలులో నీ గ్రూపు ఫోటో చూశాను. నీ వివరాలన్నీ తెలుసు కున్నాను"

"మరి ఇంతవరకూ చెప్పలేదేం?"

"నీ గతాన్ని చూసి నువ్వే భయపడు తున్నప్పుడు–నేను చెప్పడం భావ్యం కాదనుకుని ఊరుకున్నాను"

"అట్లా ఊరుకుని మంచిపనే చేశావులే! నీ భార్యనైతే నా చెల్లెలు కోసం ఈ సాహసాన్ని నేను చెయ్యగలిగేదాన్ని కాదేమో"

పోలీసుల మధ్యగా వెళ్ళిపోతున్న పార్వతినిచూస్తూ ఆమె స్నేహితులందరూ కంట తడిపెడుతున్నారు. తనమీద వాళ్ళకు గల ఆ అభిమానానికి ఆమె మనసు ఆర్ద్రమయింది. కళ్ల కన్నీటితో నిండి పోయాయి. గొంతు గద్గదికం కాగా అన్నది– "ఎందుకర్రా ఆ కన్నీళ్లు? హత్యచేసినా నాకు విచారంగా లేదర్రా! నేను తప్పు చేశానన్న భావమే నాకు కలగటం లేదు. నిజం! ఈ దేశంలోని వేలాది, లక్షలాది మన్మథల్ని, అప్పారాయనింగారి వంటి దుష్టశక్తుల్ని, చీడ పురుగుల్ని ఏరిపారేయడానికి ఎందరు పార్వతులు కావాలో అనే నా ఆలోచన"

పార్వతి చేసిన రెండో హత్య సంగతి విన్న కస్తూర్బా గరల్స్ బోర్స్టల్ స్కూల్ విద్యార్థినులు పరిగెత్తుకుంటూ పుష్పవతి దగ్గరకు వెళ్లారు. "మేడమ్! మా సిస్టర్ మళ్ళీ మా దగ్గరకు వచ్చే స్తుందా?"

కళ్లు తుడుచుకుంటూ అన్నది పుష్ప వతి– "రాదర్రా... ఈ వ్యవస్థ అటువంటి వాళ్ళను బతకనీదర్రా" ఆ మాటలర్థం కాని ఆ పిల్లలు, "ధర్మో రక్షతి రక్షితః" అన్న శ్లోకం వేపు చూస్తూ అట్టేనుంచుండిపోయారు. ★

# చతుర కథలు

## ఇంటర్వ్యూ

రవివర్మ చాలా స్పీడుగా నడుస్తున్నాడు. ఇంటర్వ్యూ కరెక్ట్‌గా పదిగంటల ముప్ఫై నిమిషాలకు మొదలవుతుంది. లేటయి పోతోంది అనుకుంటూ బస్‌స్టాండ్ వైపుకి నడిచాడు. బస్సులో ఎక్కి కూర్చున్నా అతనికి కంగారు తగ్గలేదు. ఇంటర్వ్యూ హాల్లో పదిన్నరకల్లా వుండితీరాలి.

బస్సు చేసే ఆలస్యం మహా దుర్భరంగా వుంది అతనికి. ప్రతి స్టేజీలోనూ ఆగుతోంది బస్సు. టికెట్‌లు ఇవ్వడానికి కాసేపు ఆలస్యం. ఎక్కేవాళ్ళూ, దిగేవాళ్ళూ చేసే ఆలస్యం మరి కాసేపు. భరించలేకపోతున్నాడు రవివర్మ.

అంతర్జాతీయ వ్యవహారాలు, దేశ వ్యవహారాలు, క్రీడలు, జాగ్రఫీ... అబ్బ ప్రతిదాని గురించీ తెలిసి వుండాలి. ఈ మధ్య అవసరం రాక చాలా మరచిపోయాడు. ఇంటి దగ్గర కాస్త పుస్తకాలు తిరగేసి చూసివుంటే బావుండేది. కాని,



పొద్దున్నుంచి ఒకటే హడావిడి. మర్చేపోయాను... అనుకున్నాడు రవివర్మ.

"టికెట్... టికెట్... టికెట్" కండక్టర్ అరుపుకి ఆలోచనల్లోంచి బయట పడ్డాడు. చిల్లర ఇవ్వడానికి పక్కకి తిరిగినపుడు పక్క సీట్లో జనరల్ నాలెడ్జి పుస్తకం పట్టుకు కూర్చున్న ఓ యువకుడు కనిపించాడు.

'అమ్మయ్య' అనుకున్నాడు. సాభిప్రాయంగా ఆ యువకుడి వైపు చూసి చిరునవ్వు నవ్వాడు. అతనూ అర్థం అయినట్లు నవ్వి పుస్తకాన్ని రవివర్మ చేతికి అందించాడు.

కాసేపు దీక్షగా ఈ చివరనుంచి ఆ చివరకు తిరిగేశాడు పుస్తకాన్ని. కొన్ని ప్రశ్నలను వాటి జవాబులను బాగా గుర్తుపెట్టుకున్నాడు. ఇపుడు కాస్త తృప్తిగా వుంది అతనికి. ఆఫీసు దగ్గిర స్టాపులో బస్ ఆగగానే దాదాపు బస్‌లోంచి దూకినంత పనిచేసి పెద్ద పెద్ద అంగలు వేస్తూ ఆఫీసు గేటు దగ్గిరకి చేరాడు.

అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది. అతని బుర్రనిండా ఇంటర్వ్యూను గురించిన ఆలోచనలే.

కేండిడేట్స్ అందరూ వరసగా కూర్చుని వున్నారు. అందరి చేతుల్లోనూ ఫైల్స్ వున్నాయి. 'అందరూ వచ్చేశారు. నేనే ఆలస్యం' అనుకున్నాడు.

చకచకా తన ఏసీ కేబిన్‌లోకి పోయి కుర్చీలో కూర్చున్నాడు. ప్యూన్‌ని పిలిచి "కేండిడేట్స్‌ని వరస ప్రకారం ఒక్కొక్కరినే లోపలికి పంపించు. అప్పుడే చాలా లేటయింది". అన్నాడు లిస్టు అందించి చెమటను తుడుచుకుంటూ.

ఇంటర్వ్యూలు మొదలయ్యాయి. మొదటి కేండిడేట్ గదిలోకి రాగానే విష్ చేశాడు. తలఎత్తి చూసిన రవివర్మకి బస్‌లో తనకు జనరల్ నాలెడ్జి పుస్తకం అరువిచ్చిన యువకుడు బెదిరిపోతూ కనిపించాడు.

# మిష్టరి

మేనేజర్ రామస్వామి ఆఫీసులోకి అడుగు పెట్టగానే వాచ్‌మన్ గోడకున్న గడియారం వంక చూశాడు. సరిగ్గా తొమ్మిది గంటలయింది. ఆ కంపెనీ పర్సనల్ మేనేజర్‌గా ఉన్న రామస్వామి గారు ప్రతిరోజూ ఠంచనుగా తొమ్మిది గంటలకే వస్తారు. అతనికి కావలసినవి అందించి అన్నీ సర్దాక వాచ్‌మన్ టీ తాగడానికి బయటికి వెళతాడు.

కాని ఓ వారం నుంచి డిస్పాచ్ క్లర్క్ గోవిందయ్య 9.15 నిమిషాలకే ఆఫీసుకి రావడం గమనించాడు. శాలరీ క్లర్క్ భూషణం 9.30 నిమిషాలకు వస్తున్నాడు. ఆఫీసు పదిన్నరకుగానీ తెరవరు. వీళ్లు తొందరగా రావడం వలన వాచ్‌మన్ రోజువారీ అలవాటుకి భంగం కలిగింది. కాని ఏమీ చేయలేక ఊరుకున్నాడు.

ఓరోజు రామస్వామి ఆఫీసుకి వచ్చి ఫైల్స్ తిరిగేస్తున్నాడు. "గుడ్‌మార్నింగ్ సార్! ఎండ దంచేస్తోంది కదండీ" అని పలకరించాడు ఫ్యాక్టరీ యూనియన్ లీడర్ అప్పారావు. అతన్ని చూసి అమితాశ్చర్యపోయాడు రామస్వామి. సాధారణంగా పదకొండు గంటలు దాటితేగాని ఆఫీసుకిరాని అప్పారావు 9.45కి రావడం ఏమిటో విచిత్రం అనుకున్నాడు. అప్పా





రావేకాదు కొన్నేళ్లుగా లేట్ మాస్టర్స్ అని బిరుదు సంపాదించుకొన్న మరి కొందరు కూడా తొందరగా రావడం గమనించాడు రామస్వామి.

ఆఫీసుకి తొందరగా వస్తున్న వాళ్ళ ప్రవర్తన కూడా విచిత్రంగా అనిపించ సాగింది అతనికి. వాళ్లు సీట్లల్లో కూర్చుని కాసేపు శూన్యంలోకి చూస్తూ వుండిపోయేవారు. అంతలో ఏదో సంకేతం అందినట్లు చటుక్కున లేచి వెళ్ళిపోయేవారు మళ్ళీ పది పదిహేను నిమిషాలకి ఫ్రెష్‌గా చిరునవ్వు ముఖంతో కనిపించేవారు. అలా ఒకరి తర్వాత ఒకరు పది–పదిహేను నిమిషాల సేపు మాయమై చిరునవ్వు ముఖాలతో తిరిగి వచ్చేవారు.

రామస్వామికి ఇదంతా విచిత్రంగా, అర్థం కాకుండా వుంది. సంగతి ఏమిటో విచారించాలనుకున్నాడు. కాని పబ్లిక్‌గా విచారణ సాగిస్తే యూనియన్‌తో గొడవలు వస్తాయి. అందుకని మేనేజింగ్ డైరెక్టర్‌తో సంప్రదించి ఓ డిటెక్టివ్‌కి ఈ పని అప్పగించాలని నిర్ణయించాడు. డిటెక్టివ్ ఏజెన్సీకి ఆ పని ఐదువేలకి కాంట్రాక్ట్ ఇచ్చాడు.

ఈ విషయం తనకీ, ఎమ్.డీకి తప్ప మరెవరికీ తెలియకుండా జాగ్రత్తపడ్డాడు. ఎందుకయినా మంచిదని రామస్వామి ఓ పదిహేను రోజులు సెలవుపెట్టాడుకూడా.

పదిహేను రోజుల్లో డిటెక్టివ్ ఏజెన్సీ రిపోర్ట్ ఇవ్వాలి. పదిహేను రోజులూ ఇట్టే గడిచిపోయాయి. పదిహేను రోజుల కల్లా డిటెక్టివ్ ఏజెన్సీ తన రిపోర్టు పంపింది.

అందులో ఇలా వుంది – 'ఫ్యాక్టరీ ఉద్యోగులు ప్రతిరోజూ ముందుగా ఆఫీసుకి వచ్చి, కొంచెం సేపు సీట్లల్లో కూర్చుని ఆ తర్వాత యమ్.డి.గారి బాత్రూములోకి వెళ్లి స్నానం చేసి వస్తున్నారు. నగరంలో విపరీతంగా ఏర్పడిన నీటి కొరత వలన స్నానం చేయడానికి నీళ్ళు లేక ఇలా ఆఫీసుకి వచ్చి స్నానం చేస్తున్నారు. కుట్రలు, ద్రోహ చింతన, గూడుపుఠాని వంటివి ఏమీ లేదు. ఇందులో భయపడవలసిన అంశం ఏమీలేదు' అని వుంది.

రామస్వామికి అది చదవగానే చెమట్లు పోశాయి. ఎమ్.డి. ఇది చదివి తన మీద ఎంతలా ఎగురుతాడో ఊహించేసరికి మరింతగా చెమటలు కారి, అక్కడికక్కడే స్నానం చేసినంత పని అయింది రామ స్వామికి.

# సెలక్షన్

"ఓరేయ్ అబ్బాయ్! ఇంకా ఎన్నాళ్ళు నాన్చుతావురా? ఇవాళ ఏమన్నా తేల్చే యాల్సిందే" అన్నాడు రాఘవరావు కొడుకు మనోహర్‌తో.

"అందరిలాగే మనమూ అంటే ఎలా నాన్నగారూ"

"నాకు తెలియక అడుగుతానూ... అరుణలో వున్న లోపం ఏమిటి చక్కగా వుంటే"

"నాకు అంతగా నచ్చలేదు నాన్నగారూ"

"పోనీ చంద్రిక"

"ఊహూ...వద్దు"

"తరంగిణి"

"ఛీ...నచ్చలేదు"

"అసలు నీ ఉద్దేశం ఏమిటి! ఏం చెప్పినా నచ్చలేదంటావు. ఇలా ఇంకా ఎన్నాళ్లు వాయిదా వేస్తావు? స్నేహితులు, చుట్టాలు అడిగితే మా అబ్బాయి ఇంకా ఏమీ నిర్ణయించలేదని చెప్పలేక చచ్చి పోతున్నాను. ఇక ఇదే ఆఖరిసారి నిన్ను అడగటం. పోనీ, మల్లిక ఎలావుంది?"

"నాన్నగారూ! నన్ను కాస్త ఒంటరిగా వదిలేయండి ఈ కాసేపూ. నాకు ఇష్టమైనట్లు సెలక్ట్ చేసుకోనీయండి. అంత తొందరపడితే ఎలా? కలకాలం నిలిచేది గదా ఇది"

"పోనీ, మీ నాన్న చెప్పినదానికి ఒప్పుకోరాదట్రా" అంది తల్లి మనోహర్‌తో.

"ఏమిటమ్మా! నువ్వు కూడా అలా మాట్లాడతావు. నా అభిప్రాయాలు నీకు తెలుసుకదా! నేను అందరిలాంటి వాడిని కాదు. అమ్మాయి కూడా అన్ని విధాలా నాలాగే ఉండాలని కోరడంలో తప్పే



ముంది?" అన్నాడు మనోహర్.

"రెండేళ్ళనించి ఆమాటే చెబుతున్నావు. ఒక్కగానొక్క కొడుకువి..."

ఆవిడని సగంలోనే ఆపుచేశాడు మనోహర్. "అలా అనుకోకమ్మా" అన్నాడు.

"సరేనాయనా! నువ్వు అందరిలాంటి వాడివికాదు. సరే ఒప్పుకున్నాం.మరయితే నీ కూతురుకున్న ప్రత్యేకత ఏమిటో చెబుదూ. అదీ అందరిలానే పుట్టిందికదా! రెండేళ్ళనుంచి పేరుకోసం వెతుకుతున్నా ఇంతవరకూ ఒక్కటి కూడా నచ్చలేదాయె నీకు! పసిదాన్ని చక్కగా పేరుపెట్టి పిలుచుకోడానికి లేకుండావుంచి. 'మనవ రాలి పేరేమిటమ్మా' అంటే చెప్పలేక చచ్చిపోతున్నాం. తొందరగా ఏదో ఓ పేరు పెట్టు" అనేసి లోపలికి వెళ్ళిపోయింది మనోహర్ తల్లి.

మనోహర్ అసాధారణమైన పేరు కోసం తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చు న్నాడు.

—తుషార

భూమ్మీద వున్న 90 శాతం మంచి నీరు అంటార్కిటికా మంచుపొరల అడుగునే నిక్షిప్తమై వుంది. అంతేకాదు ప్రపంచంలోకెల్లా పెద్ద బొగ్గుగనులు, ముడిఇనుము నిక్షేపాలు, ఐదువేలకోట్ల బేరల్స్ ఆయిల్, మరెంతో యురేనియం,

# ప్రకృతి సృష్టించిన మంచుసౌధ

# అంటార్కిటికా

అంతరిక్ష యాత్రల తర్వాత అంతటి ఆసక్తిని రేకెత్తిస్తున్నది అంటార్కిటికా. భూమ్మీద వున్న శీతల భూఖండాలలో కెల్లా అత్యంత శీతల ప్రాంతం అంటార్కిటికా. ప్రస్తుతం ప్రపంచదేశాలకళ్లన్నీ ఈ అంటార్కిటికా సుందరిమీదే కేంద్రీకృతమై వున్నాయి. అందుకు కారణం లేకపోలేదు.

ప్లాటినమ్, టాంటలన్, లిథియం వంటి ఖనిజాలు ఉన్నాయి. అపారంగా చేపలు కూడా వున్నాయి. మరి ప్రపంచ దేశాలన్నీ దీనికోసం ఎగబడటంలో ఆశ్చర్యం ఏముంది?

గతంలో అగ్రదేశాలనదగినవన్నీ

అంటార్కిటికా యాత్ర చేశాయి. గత సంవత్సరం జనవరి తొమ్మిదిన మన దేశం కూడా అంటార్కిటికా యాత్ర చేసి థర్ వరల్డ్ దేశాల్లో దక్షిణధృవం మీద అడుగుపెట్టిన మొదటిదేశంగా భారతదేశం పేరు సంపాదించింది.

ఈ అంటార్కిటికా కథాకమామీషు తెలుసుకొనేముందు దాని భౌగోళిక స్వరూప స్వభావాల గురించి తెలుసుకోవటం చాలా అవసరం. ఒక కోటీ నలభై చదరపు కిలోమీటర్ల వైశాల్యం గల అంటార్కిటికా భూఖండం భారత దేశానికన్నా ఐదురెట్లు పెద్దది. ప్రపంచంలోని 90 శాతం మంచు ఇక్కడే కనిపిస్తుంది. అక్కడి నేల కోట్లాది సంవత్సరాలుగా కురుస్తోన్న మంచుకింద కూరుకుపోయివుంది. ప్రస్తుతం అక్కడ మంచు పెరగడమూలేదు, తరగటమూలేదు. ఒక వేళ ఏదన్నా కారణంచేత మంచు కరిగిందనుకోండి-మనపని ఇంతే సంగతులు. జలప్రళయం తప్పదన్నమాట. అక్కడ మంచు కరిగితే అన్ని సముద్రాల్లోని నీటిమట్టం 250 అడుగులు పెరిగి ప్రపంచాన్ని వరదల్లో ముంచెత్తుతాయి. సముద్ర తీర ప్రాంతాల్లో వున్న కలకత్తా, బొంబాయి, లండన్, న్యూయార్క్, పారిస్ వంటి నగరాల అడ్రస్‌కూడా దొరకదు అప్పుడు.

మనం ఇక్కడ కొద్దిపాటి చలికే స్వెటర్లు వేసుకొని, పళ్లు బిగించి వణుకుతుంటాము. అక్కడయితే వేసవిలో కూడా ఉష్ణోగ్రత సున్నాకి తక్కువ వుంటుంది. వేసవిలోకూడా మంచు కరగదు. ఇక శీతాకాలం సంగతి చెప్పేదేముంది. ఉష్ణోగ్రత మైనస్ 80 డిగ్రీలకు పడిపోతుంది. ఈ ప్రపంచంలో ఒక్క అంటార్కిటికా ఖండం మీద మాత్రమే ఇంత తక్కువ ఉష్ణోగ్రత రికార్డయింది.

సముద్ర మట్టానికి 7,500 అడుగుల ఎత్తున వున్న అంటార్కిటికా మిగిలిన భూభాగాలకన్నా ఎత్తయినది. ఈ ఖండం మధ్యభాగం నుంచి ట్రాన్స్ అంటార్కిటిక్ పర్వత శ్రేణులు విస్తరించివున్నాయి. ఈ పర్వత శిఖరాలు ఎంత పెద్దవంటే రెండు మూడు మైళ్ల మందాన పేరుకుపోయిన మంచులోంచికూడా కనిపిస్తుంటాయి. ఈ పర్వతాల్లోకెల్లా ఎత్తైనది 'పీక్ విజన్'. దీని ఎత్తు 16,000అడుగులు. ఇక్కడి మంచుగుట్టలుచూస్తే రోజుకిఎన్ని టన్నుల మంచు కురుస్తుందో అనిపిస్తుంది. కాని వాస్తవంలో ఏడాదికి సగటున కేవలం ఆరు అంగుళాల మంచు మాత్రమే పడుతుంటట. అంటే ఈ లెక్కన ఎన్నికోట్ల సంవత్సరాలనుంచి మంచు కురుస్తుండివుండాలి?

సాధారణంగా యాత్రికులు అంటార్కిటికాకు అక్టోబర్, జనవరి నెలల మధ్య వెళుతుంటారు. భూగోళంలోని దక్షిణార్ధ భాగాన ఆ నెలలలోనే వేసవి వుండేది. వేసవిలో అక్కడ 24 గంటలూ సూర్యుడు ప్రకాశిస్తాడు.

ఈ అంటార్కిటికా యాత్రకు ఎవరు ఐడితే వారు "హాయిగా హుషారుగా షికారు పోదమా" అంటూ బయలుదేరడానికి వీల్లేదు. అక్కడికి వెళ్ళేవారు శారీరకంగా పరిపూర్ణ ఆరోగ్యవంతులై వుండాలి. ఎక్స్‌రే, ఇ. సి. జి., రక్తం, మూత్రం, కళ్లు, ముక్కు, చెవి, పళ్లు వగైరా పరీక్షలన్నీ చేయించుకోవాలి. అవిగాక టైఫాయిడ్, ఫ్లూ, టి.బి., ధనుర్వాతం వంటివి రాకుండా ఇంజక్షన్లు పొడిపించుకోవాలి.

 

ఇక్కడితో ఒక బాదరబందీ వదిలి పోతుంది. ఇక జామ్మంటూ ఓడ ఎక్కి అంటార్కిటికా తిరిగిరావచ్చు అనుకుంటే అదీ పొరపాటే! కష్టాలు ఇక్కడితో అయిపోవు. ఇక్కడినుంచే మొదలవు తాయి. అక్కడ ఫెళ్ళున ఎండ కాస్తూనే వుంటుంది. ఆకాశం నిర్మలంగానే వుంటుంది. సరేనని మనం అటూ ఇటూ తిరిగే పెంగ్విన్స్‌ను చూసి ముచ్చటపడి అలా విహారానికి బయలుదేరామనుకోండి. ప్రకృతి సౌందర్యానికి మైమరచి "అహా! ఈ ప్రకృతి రచనా చమత్కృతి ఏమియోగాని నా మానసము ఉప్పొంగి పోవుచున్నదని" దుర్యోధనుడిలా డైలాగ్ వదిలే లోపలే ఉపములేని పిడుగులావచ్చి పడే మంచు తుపానులో చిక్కుకుపోయి జన్మలోఇక్కడికి రానుబాబోయ్ అనేస్తాం. అలా పిలవని పేరంటంలా అకస్మాత్తుగా వచ్చిపడే ఈ మంచు తుపానులు గంటకి 200 మైళ్ళ వేగంతో వీస్తూ అడ్డమొచ్చిన ప్రతిదాన్నీ ఎగరేసుకుపోతుంది. అందుకే అంటార్కిటికాలో ఒంటరి విహారాలు నిషిద్ధం. ఇద్దరు ముగ్గురు కలిసే వెళ్ళాలి.

ఇదిగాక అక్కడ మరో పెద్ద ప్రమాదం పొంచివుంది. పైన మంచు పేరుకొని నేలలానే అనిపిస్తుంది. సరేనని ఆకాశంవంక చూస్తూ అడుగులేస్తే మనిషి మరి కనిపించకుండా మాయమైపోతాడు. మంచులో పైకి కనిపించని పగుళ్ళు అనేకం వుంటాయి. కొన్ని చాలా అడుగుల లోతుకూడా వుంటాయి. అక్కడికి వెళ్ళిన అనేకమంది ఇలాంటి పగుళ్ళలో పడి ప్రాణాలు కోల్పోయారు.

అంటార్కిటికాలో మంచులో నడిచే ఉపుడు జాగ్రత్తగా వుండాలి. సూర్యకాంతి తెల్లని మంచుమీదపడి మరింత కాంతివంతమైన వెలుతురు వస్తుంది. మామూలు కళ్ళతో ఆ వెలుగుచూస్తే గుడ్డివాళ్ళైపోతారు. అందుకని 24 గంటలూ గ్లేర్-గ్లాసెస్ పెట్టుకోవాలి. మబ్బు పట్టినపుడు మరో రకం ప్రమాదం ఎదురవుతుంది. దట్టమైన మబ్బులకూ, మంచుకీ మధ్య సూర్యకాంతి చిక్కుపడి ప్రతిఫలించి, వక్రీభవనం చెంది విచిత్రమైన పొగమంచులా ఏర్పడుతుంది. దీన్ని 'వైట్-అవుట్' అంటారు. నేలా, ఆకాశం రెండూ తెల్లగా వుండి రెంటికీ తేడా తెలీదు. నింగీ నేలా ఏకమై పోతాయన్నమాట. ఈ స్థితిలో మంచుమీద నీడలు కూడా పడవు. ఫలితంగా దూరాన్ని అంచనా వేసే శక్తి కోల్పోతాం తాత్కాలికంగా. ఈ సమయంలో నడిస్తే దారి తెలీక వున్నచోటే గుండ్రంగా నడుస్తూండవచ్చు. కొద్ది దూరంలోవున్న సిగరెట్ పెట్టె పెద్ద ట్రంకులా కనిపిస్తుంది. ఇదేదో మయసభలా, మాయాలోకంలా అనిపిస్తోంది కదూ?

ఇవిగాక మరికొన్ని ప్రమాదాలు కూడా పొంచివున్నాయి అక్కడే. గుడారంలో స్టవ్ వెలిగిస్తే అది విషపూరితమైన మోనాక్సైడ్‌ను ఉత్పత్తి చేస్తుంది. కనుక ఎంత చలిగా వున్నా గాలి బయటకు పోయే ఏర్పాట్లు వుండాలి. అదే సమయంలో విపరీతమైన చలి వుంటుంది గనుక ఏ కొంచెం అజాగ్రత్తగా వున్నా శరీరావయవాలు మొద్దుబారిపోయి పక్షవాతం సంప్రాప్తిస్తుంది. ప్రయాణ సమయంలో చేతి గ్లోవ్స్ గాని, టోపీగాని పోయినా, బూట్లలోకి మంచు పోయి పాదాలు తడిసినా ప్రాణాపాయమే. చాప కింద నీరులాంటి అయస్కాంత క్షేత్రాలు మోసం చేస్తుంటాయి. ఇవివున్నచోట

టెలిఫోన్లు, రేడియోలు పనిచేయవు. పైగా ఆయస్కాంత ధృవం అతి దగ్గరగా వుండటాన దిక్సూచికూడా పని చేయదు.

ఇన్ని ప్రమాదాలు పొంచివున్నా, ఇన్ని ఇబ్బందులు వున్నా ప్రపంచ దేశాలు వ్యయ ప్రయాసల కోర్చి అంటార్కిటికాకు ప్రయాణమవుతూనే



వున్నాయి. బంగారు గుడ్డు పెట్టే బాతు అంటే ఎవరికైనా మోజేకదా!

అసలు ఈ అంటార్కిటికాను గురించిన ప్రస్తావన 2000 సంవత్సరాల క్రితమే వచ్చింది. ప్రముఖ తత్వవేత్త అరిస్టాటిల్, అతని సమకాలికులు ఆ రోజుల్లోనే భూగోళపు దక్షిణ భాగాన ఒక భూఖండం వుండి వుండాలని తీర్మానించారు. అప్పటికే వారికి భూమి గుండ్రంగా వుందని తెలుసు.

ఉత్తర అర్ధగోళం వైపు ఎక్కువ భాగం భూమి వుంది, దక్షిణ అర్ధగోళం వైపు ఎక్కువ భాగం నీరు వుంది. కనుక

ఉత్తరార్ధగోళం వైపువున్న భూమికి సమతూకంగా దక్షిణ అర్ధగోళంలో భూమి వుండి వుండాలన్నది వారి వాదన.

ఆర్కిటిక్, అంటార్కిటిక్ అన్న పేర్లు కాస్త గమ్మత్తుగా అనిపిస్తాయి. ఉత్తర ధృవంపైన ఆకాశంలో కాంతివంతమైన నక్షత్ర సముదాయం వున్నది. దీన్ని గ్రీకు భాషలో ఆర్క్టోస్ అంటారు. ఇది కాలక్రమేణా ఆర్కిటిక్‌గా మారి ఉత్తర ధృవాన్ని ఆర్కిటిక్ ధృవమని పిలవడం మొదలు పెట్టారు. దక్షిణ భాగంలో వున్నదని ఊహిస్తున్న భూమి ఆర్కిటిక్ ధృవానికి సరిగ్గా వ్యతిరేక దిశలో వుండి గనుక దాన్ని 'ఏంటి-ఆర్కిటిక్ అని పిలిచారు. దీన్నే క్లుప్తంగా అంటార్కిటిక్ అని పిలవడం మొదలెట్టారు.

అయితే దక్షిణ ధృవప్రాంతంలో భూఖండం వుందా లేదా అన్నది మాత్రం చాలా శతాబ్దాలపాటు తేలలేదు. కళ్ళకి కనిపించని విషయాన్ని ఉందని నమ్మడం కష్టం కదా?

ఆ రోజుల్లోనే ప్రస్తుతం మనం చారిత్రిక హీరోలుగా పరిగణించబడుతున్న వారు కొత్త కొత్త ఖండాలను కనుగొనడానికి, సముద్ర మార్గాల అన్వేషణకు బయలుదేరారు. మగిల్లన్ అనే అతను అప్పట్లో అట్లాంటిక్ నుంచి పసిఫిక్ వరకూ దక్షిణ అమెరికా దక్షిణభాగాన్ని చుడుతూ ప్రయాణించాడు. ఆ ప్రయాణ సమయంలో తారసిల్లిన దక్షిణ ధృవ ప్రాంత విశేషాలను, మంచు ప్రదేశాల గురించి వర్ణించాడు. దీన్నే అతను అంటార్కిటికా అనుకున్నాడు. ఇతని వర్ణనలతో ప్రజల దృష్టి కొద్దిగా అటువైపు మళ్ళింది.

తర్వాత 1772లో ప్రముఖ సాహస యాత్రికుడు జేమ్స్ కుక్ ఈ అదృశ్య ఖండాన్ని వెతకడానికి ప్రయాణమైనాడు. మూడేళ్ళపాటు 68 వేల మైళ్ళ దూరం ప్రయాణంచేసి ఇక నావల్ల కాదని చేతులు ఎత్తేశాడు. అయితే అప్పటికి అంటార్కిటికా అతనికి 150 మైళ్ళ దూరంలో మాత్రమే వుంది. ఆ విషయం అతనికి తెలీదు పాపం. దూరం నుంచి కోటగోడల్లా వున్న మంచు దిబ్బలను చూసి "ఒకవేళ ఈ మంచు దిబ్బల వెనుక ఏదయినా భూఖండం దాగి వున్నా ప్రపంచానికి దానివలన పెద్దగా ఉపయోగం వుండదు" అని డైరీలో రాసుకున్నాడు కెప్టెన్‌కుక్. ఆయన అంచనా తప్పని ఇప్పటి అంటార్కిటికా పరుగు పందాలు నిరూపిస్తున్నాయి.

యూరప్‌లో అప్పుడే పారిశ్రామిక విప్లవం మొదలయింది. కెప్టెన్ కుక్ డైరీలో రాసుకున్నదాని వలన దక్షిణ ధృవ ప్రాంతపు సముద్రాల్లో వేలకొలది వేల్స్, సీల్, వ్యాలస్‌లు దొరుకుతాయని తెలిసింది ప్రజలకి. పారిశ్రామిక విప్లవం వలన వెజిటబుల్ ఆయిల్‌కి గిరాకీ ఏర్పడింది. మినరల్ ఆయిల్‌ను అప్పటికింకా కనుగొనలేదు. కనుక జంతువుల నుండి వచ్చే చమురు ప్రత్యామ్నాయంగా కనిపించింది అందరికీ. ధృవప్రాంతపు జంతుజాలంలో కొవ్వు శాతం అధికంగా వుంటుంది. పైగా అప్పటికే ఎన్నో ఏళ్ళుగా ఎస్కిమోలు సీల్‌లను వేటాడి దాని కొవ్వును వంటకు, దీపాలకు ఉపయోగిస్తున్నారు. ఇంకేం వీళ్ళకి బంగారపుగని దొరికినట్లయింది. కొద్దోగొప్పో సత్తావున్న తూర్పు అమెరికా వేటగాళ్ళు తట్టాబుట్టా సర్దుకుని పోలోమని దక్షిణ ధృవప్రాంతాలవేపు పరుగులు




తీశారు.

ఈ వేటగాళ్ళు అలా వెతుకుతూ వెళ్ళి మంచుతో కప్పబడిన అనేక ద్వీపాలను కనుగొన్నారు. వేసవిలో సీల్ చేపలు పిల్లలను పెట్టడానికి ఆ ప్రాంతాలకు వస్తుంటాయి. సీల్‌పిల్లలు మూడునెలల పాటుఅక్కడే ఎండకాగుతాయి. ఇలాంటి ద్వీపాలు వేటగాళ్ళపాలిట బంగారుగనుల వంటివే. అందుకే ఎవరికివారు రహస్య మేప్‌లు సంపాదించి వేటకి బయలుదేరారు. ఆ సమయంలో దాదాపు ౬౦లక్షల సీల్‌లను చంపారు.

అలా మొదలయిన అంటార్కిటికా యాత్రలు అంచెలంచెలుగా సాగి దక్షిణ ధృవాన్ని చేరుకొనేవరకూ జరిగాయి.

అంటార్కిటికాను ముందు ఎవరు కనుగొన్నారన్నది వివాదాస్పదమే. రష్యా, అమెరికా, బ్రిటన్‌లు అంటార్కిటికాను 19వ శతాబ్దిలోముందు మేము కనుగొన్నాం అంటే మేమని వాదులాడుకొంటున్నాయి. ఎవరు కనుగొన్నా బ్రిటిష్ కెప్టెన్ జేమ్స్ రోజ్ చూపిన మార్గాన్నే తరువాతివారు అనుసరించారు.

అంటార్కిటికా ప్రయాణాలు సర్వసామాన్యమయిపోయాక దక్షిణ ధృవాన్ని ముందు చేరే విషయంలో పోటీ మొదలయింది. భౌగోళిక దక్షిణ ధృవం, అయస్కాంత దక్షిణ ధృవం ఒకే బిందువు వద్ద వుండవు. రెంటికీ మధ్య 11 డిగ్రీల తేడా వుంది. దిక్సూచి సాయంతో అయస్కాంత దక్షిణ ధృవాన్ని సులభంగా నిర్ణయించవచ్చు. ఎటొచ్చీ భౌగోళిక ధృవాన్ని నిర్ణయించడమే తలనొప్పి వ్యవహారం. దీన్ని గ్రహస్థితినిబట్టి మాత్రమే తెలుసుకో వీలవుతుంది.

వేసవిలో సూర్యుడు సరిగ్గా 90డిగ్రీల వద్ద నడినెత్తిన ప్రకాశిస్తున్న ప్రదేశాన్ని భౌగోళిక దక్షిణ ధృవం అని నిర్ణయిస్తారు.

బ్రిటన్‌కి చెందిన కెప్టెన్ రోజ్ ముందు ఉత్తర అయస్కాంత ధృవయాత్ర పూర్తిచేసి,తర్వాత దక్షిణ అయస్కాంత ధృవాన్ని చేరదామనుకున్నాడు. కొంత దూరం వెళ్ళాడు కూడా. కాని లక్ష్యాన్ని చేరలేకపోయాడు.

వెళ్ళినందుకు కొంత ప్రాంతానికీ, రెండు అగ్నిపర్వతాలకూ నామకరణోత్సవం జరిపి వచ్చేశాడు. తర్వాత అతని పేరిట అంటార్కిటికాలోని ఒక ద్వీపాన్ని రోజ్‌ద్వీపం అని పిలిచారు.

ఆ తర్వాత దక్షిణ ధృవాన్ని ముందు చేరాలని పోటీ మొదలయింది. దక్షిణ ధృవ దిగ్విజయ యాత్ర నవరసభరితమయినది. సాహసం, డ్రామా, విషాదం, అన్నీ కలగలిసిన ఆసక్తికరమయిన పరుగుపందెం ఇది. ఈ పందెంలో పాల్గొన్న పోటీదారులు బ్రిటన్‌కి చెందిన కెప్టెన్ రాబర్ట్ ఫలేకన్ స్కాట్, నార్వేకి చెందిన అముందర్‌సన్. ఇద్దరూ తమ దేశానికి చెందిన జెండాని ముందు ఎగరేయాలన్న లక్ష్యంతో బయలుదేరారు.

ఆవిధంగా వారిద్దరిమధ్యా మొదలైన పందెం సస్పెన్సుతో సాగిపోయింది. నిజానికి వారిద్దరిలోనూ అముందర్‌సన్ వాస్తవవాది. ప్రతిదానికీ ఖచ్చితమయిన పథకాలు వేసుకునేవాడు. అసలతను ఉత్తర ధృవానికే వెళదామనుకున్నాడు. కాని అప్పటికే అక్కడికెవరో చేరుకున్నారని తెలిసి దక్షిణ ధృవంవేపు చూపు మరల్చాడు.

అతగాడికి దక్షిణ ధృవం బలపరాక్రమాలతో మాత్రమే గెలవతగిన రాజసం,

అందంవున్న సుందరాంగిగా కనిపించింది. ఆ మాటే అన్నాడు కూడా.

ఇక రాబర్ట్‌స్కాట్‌కి భావోద్రేకం పాలు ఎక్కువ. వాస్తవిక దృష్టి తక్కువ. అముండర్‌సన్ కేవలం అంటార్కిటిక్ ధృవాన్ని ముందు చేరాలన్న ఏకైక లక్ష్యంతో బయలుదేరాడు. స్కాట్ మాత్రం ధృవాన్ని చేరడంతోపాటు



శాస్త్రీయ పరిశోధనల భారాన్ని కూడా తలకెత్తుకున్నాడు. అందుకే అతను అన్ని విధాలా వెనుకబడిపోయాడు.

అముండర్‌సన్ తన స్లెడ్జి బళ్ళను లాగడానికి వంద సైబీరియన్ జాతి కుక్కలను వెంటబెట్టుకువెళ్ళాడు. ప్రయాణం ముగిసే సమయానికి వాటిలో 18 కుక్కలను ఆహారంగా ఉపయోగించాడు. ఒకో కుక్క 25 కేజీల మాంసాన్ని ఇస్తుంది. పాపం స్కాట్ ప్రారంభంలోనే తప్పటడుగు వేశాడు. ప్రయాణానికి ఏవి తగినవో నిర్ణయించుకో



లేక మంచూరియన్ గుర్రాలను మోటారు కార్లను వెంట తెచ్చాడు. అవి అతనికి ఏమాత్రం ఉపయోగపడలేదు.

అముందర్‌సన్ ఎస్కిమోలనుంచి ధృవవాతావరణానికి సరిపోయే దుస్తులను తయారుచేసుకోవడం నేర్చుకున్నాడు. ఒదులుగా, తేలికగా వుండి ఎక్కువ వెచ్చదనాన్ని, సులభంగా నడవటానికి వీలయే దుస్తులను ఎంచుకున్నాడు. అటు స్కాట్, అతని సహచరులు బిగుతయిన బరువైన దుస్తులను ధరించారు. అముందర్ సన్ ఎంచుకున్న హైబెర్గ్‌గ్లేసియర్ దారి కాస్త ప్రమాదరహితమైనది. సులభమైనది. స్కాట్ వెళ్ళేదారి ప్రపంచంలోకెల్లా పెద్దది, ప్రమాదకరమైనది అయిన బ్రెడ్ మోర్‌గ్లేసియర్ మీదుగా వెళుతుంది. దక్షిణధృవానికి అముందర్‌సన్ స్థావరం స్కాట్ స్థావరంకన్నా 50 మైళ్ళు దగ్గిరగా వుంది. అముందర్‌సన్ తను వెళ్ళేదారిలో తిరుగు ప్రయాణంలో ఉపయోగించుకోడానికిగాను ఆహారపదార్థాల డిపోలను పెట్టే ప్రయత్నాల్లో వున్నపుడు స్కాట్ వివిధ పరిశోధనల్లోమునిగితేలుతున్నాడు. అతను దార్లో మంచుతునక కూడా పడని లోయలననేకం కనుగొన్నాడు. చాలా అరుదైన ఎంపరర్ పెంగ్విన్ గుడ్లను సేకరించాడు. స్కాట్ సహచరులూ అతనికి తగ్గవారే దొరికారు. విల్సన్ ఆ బృందంలోని ఏకైక డాక్టరేగాక మంచి కళాకారుడుకూడా, అతను అంటార్కిటిక్ పక్షుల గురించి విలువైన పుస్తకం రాశాడు.

వసంతకాలం మొదలవగానే అముందర్‌సన్ బయలుదేరాడు. అంతా అతను అనుకున్నట్లే తు.చ తప్పకుండా సాగిపోయింది. 1911 డిసెంబర్ 14న అతను భౌగోళిక దక్షిణ ధృవం వద్ద నార్వే దేశపు జండాను ఎగరేసి అంటార్కిటికా సుందరిని జయించాడు. సూర్యుడు ఖచ్చితంగా నడినెత్తిన 90 డిగ్రీలవద్ద వున్నాడని తెల్సుకోడానికి సహచరులతో మూడు రోజులు వుండి నిర్ధారణ చేసుకొని మరీ తిరుగు ప్రయాణమైనాడు. స్కాట్ బృందంకోసం గుడారాలు, ఆహారం, స్లెడ్జి బళ్లు, ఇతర పరికరాలను అక్కడే వదిలేశారు. ఓ ఉత్తరం రాసిపెట్టి విజయోత్సాహంతో వెనక్కి మళ్ళారు. అతను వెనక్కి వెళ్ళేటపుడు సులభంగా వుంటుందని ప్రతి రెండున్నర మైళ్ళకి రాళ్ళగుట్టలను వుంచాడు. సరిగ్గా రెండేళ్ళ క్రితం నిర్ణయించిన తేదీనాటికే అతని స్థావరానికి వచ్చి చేరారు.

అముందర్‌సన్ దక్షిణధృవాన్ని చేరిన సమయానికి స్కాట్ అక్కడికి 400 మైళ్ళ దూరాన సహకరించని వాతావరణంతో పోరాడుతున్నాడు. స్కాట్‌కి పాపం అడుగడుగునా అవాంతరాలు ఎదురయ్యాయి.అముందర్‌సన్ రోజుకి సగటున 20 మైళ్ళు ప్రయాణిస్తే, స్కాట్ అతికష్టం మీద 5-6 మైళ్లు మాత్రం ప్రయాణించగలిగాడు. పడుతూ లేస్తూ ఎలాగోలాగ దక్షిణధృవాన్ని చేరేసరికి వారి భయాలే నిజమయ్యాయి. అముందర్ సన్ చేరిన నెలరోజులకి స్కాట్ దక్షిణ ధృవం చేరాడు. అక్కడ నార్వేదేశపు జండా కనిపించగానే స్కాట్ హతాశుడయ్యాడు. పడినశ్రమంతా బూడిదలో పోసిన పన్నీరయింది.

మానసికంగా, శారీరకంగా అలిసిపోయి వ్యథాభరిత హృదయాలతో ఓడిపోయి, గాయపడిన సైనికుల్లా వెనుదిరిగారు. అప్పుడు వాతావరణం ప్రయా




ణానికి అనుకూలంగా లేదు. పైగా తెచ్చుకున్న ఆహారపదార్థాలు వేగంగా తరిగిపోతున్నాయి.

గోర్రుచుట్టు మీద రోకటిపోటులా స్కాట్ సహచరుల్లో ఒకడైన ఎవన్స్ వెనకబడిపోతూ చివరికి కిందపడిపోయి మరి లేవలేదు. ఆరోజు 1911 ఫిబ్రవరి 17. సరిగ్గా అతను చనిపోయిన నెలరోజులకి మరోదెబ్బ తగిలింది వారి బృందానికి. స్కాట్ మరో సహచరుడు ఓటెస్ పాదాలు మొద్దుబారిపోయి అతికష్టం మీద వారి వెంట వస్తున్నాడు. అతను అలా ఎన్నో రోజులు బతకడని అందరికీతెలుసు. ఓటెస్ ఆ. సంగతి గ్రహించాడు. అసలే తరిగిపోతున్న ఆహార పదార్థాలతో దినమొక గండంగా, భారంగా పయనిస్తున్న బృందానికి అదనపు భారంగా వుండదల్చుకోలేదతను. అందుకే ఓరోజు మంచు తుఫాను వస్తుండగా గుడారం వదిలి బయటికి వెళ్ళిపోయాడు. అతని శరీరం తర్వాత ఎవరికీ కనిపించలేదు.

అది జరిగిన మరో ఐదు రోజులకి మరింత భారమైన హృదయాలతో మినుకు మినుకుమంటున్న ఆశతో ప్రయాణం సాగించింది స్కాట్ బృందం. వారి దగ్గిర వున్న ఆహారపదార్థాలు అయిపోయాయి.



వారి ఆహార పదార్థాల డిపో మరో 11 మైళ్ల దూరంలో వుంది. కాని ప్రకృతి వాళ్ళపై పగబూనినట్లు అప్పుడే తీవ్రమైన మంచు తుఫాను మొదలైంది. అవి వారిని గుడారంలోనే ఖైదీలుగా చేసింది. వారు ఓ వారం రోజులపాటు తిండితిప్పలు లేకుండా, చలికాచుకోడానికి ఇంధనం లేకుండా వుండిపోయారు. బతికి బట్ట గడతామన్న ఆశ వారికి పూర్తిగా అడుగంటిపోయింది.

బృందం నాయకుడిగా స్కాట్ తన చివరి విధి నిర్వహించాడు. అతను విల్సన్ భార్యకు మిత్రుని త్యాగాన్ని ప్రశంసిస్తూ ఉత్తరం రాశాడు. బోవెర్ తల్లికి ఆమె కుమారుడి ధైర్యాన్ని మెచ్చుకుంటూ ఉత్తరం రాశాడు. తన భార్యకు ఉత్తరం రాస్తూ "మా సాహసయాత్ర తాలూకు విశేషాలు నేనే స్వయంగా చెప్పాలని అనుకున్నాను. కాని అది సాధ్యమయే పని కాదని తేలిపోయింది. మన అబ్బాయిని జాగ్రత్తగా పెంచు. ధైర్యవంతుడిగా పెరగనివ్వు వాడిని. పిరికిమందు పోయకు. చరిత్రకారుడిగా తీర్చిదిద్దు" అని రాశాడు.

మిగిలిన మిత్రులకి, శ్రేయోభిలాషులకి తన డైరీలో చివరిసారిగా ఉత్తరం రాశాడు. "మేమంతా చనిపోయేవరకూ కలిసే వుంటాము. మృత్యువు ఎంతో దూరంలో లేదు. ఇక నాలో రాసే శక్తి లేదు. నా సహచరులను దేవుడే రక్షించాలి....." అక్కడితో ఆ కలం ఆగిపోయింది. విషాదాంత నాటకానికి తెరపడింది. అంటార్కిటికా కన్యను సాధిద్దామని బయలుదేరిన స్కాట్ బృందం మృత్యుదేవత ఒడిలోకి చేరింది.

మరో ఎనిమిది నెలల అనంతరం ఒక సహాయక బృందం మంచుతో కప్పబడిన స్కాట్ గుడారాన్ని కనుగొన్నది. లోపల విల్సన్, బోవెర్‌లు స్లీపింగ్ బేగ్స్‌తో వున్నారు. స్కాట్ వారిద్దరి మధ్యా ఉన్నాడు. అతని స్లీపింగ్ బేగ్ తెరచుకుని వుంది. అతని చేయి ఒకటి ప్రియమిత్రుడు విల్సన్ భుజం మీద వుంది. విల్సన్ తల వద్ద వారు బ్రెడ్‌మోర్ గ్లేసియర్ నుంచి తిరుగు ప్రయాణంలో సేకరించిన 16 కేజీల రాళ్ళు, బొగ్గు, ఆకుల ఫాజిల్స్ (శిలాజలాలు) వున్నాయి. అంతటి క్లిష్ట పరిస్థితుల్లో ప్రయాణం చేస్తూ కూడా సేకరించిన వాటిని చూసి వెళ్ళినవారి కళ్ళు చెమర్చాయి. అవన్నీ తర్వాత అంటార్కిటికా భౌగోళిక వివరాలుతెలుసుకోడానికి ఉపయోగించాయి. స్కాట్ తలకింద వున్న ఒక ఆకుపచ్చ సంచిలో దక్షిణ ధృవ సాహసయాత్రా వివరాలున్న డైరీ వుంది. అది వారి ప్రయాణంలోని సాహసాలు, విషాద ఘట్టాలతో నిండి వుంది. సహాయ బృందం వారి శరీరాలను అలాగే ఉంచేసి మంచుకప్పి చిన్న రాళ్ళగుట్ట పేర్చి క్రాస్‌ను అమర్చారు. స్కాట్ ఓడిపోయి గెలిచాడు. అతని సాహస విషాదయాత్ర, ఆ బృందం చేసిన త్యాగం మానవచరిత్రలో మరపురాని భాగంగా మిగిలిపోయింది.

అలా మొదలైన అంటార్కిటికా యాత్రలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి. ప్రకృతి సృష్టించిన మయసభలాంటి ఆ మాయా లోకం మానవుడిని ఆకర్షిస్తూనే వుంది ఇంకా.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004.

# ప్రియ తోడుగా ఉంటే చాలు.. మరింత సంతృప్తి!




బ్రేక్‌ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' ఆకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్లలో మీకు కావలసింది ఎన్నుకోండి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో * అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ * పండు మిరపకాయ * వంకాయ

తీపిరకాలు : * మామిడికాయ * అల్లం

ప్రియ ఫుడ్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED